పరబ్రహ్మణేనమః

శ్రీ మదష్టాదశ మహాపురాణాంతర్గతంబగు
శ్రీస్కాంద పురాణమందలి

# శ్రావణమాస మాహాత్మ్యము.

ఈ గ్రంథము

బ్రహ్మశ్రీ చల్లా నాగలింగశాస్త్రులవారి పుత్రుఁడగు

## లక్ష్మీనృసింహశాస్త్రిచే

ఆంధ్రతాత్పర్యసహితముగా చేర్పఁబడి,

బ్రహ్మశ్రీ కాపూరి రంగయ్యశాస్త్రులవారిచేఁ

పరిష్కరింపఁబడి,

స్వకీయ శ్రీ
ఆర్యానంద ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియె,

ప్రథమ ముద్రణము ౫౦౦ ప్రతులు.

మచిలీపట్టణము.

దీని వెల రు. 1—0—0



1932

శ్రీరస్తు.

స్కాంద పురాణాంతర్గత

# శ్రావణమాస మాహాత్మ్యమ్.



శ్లో॥ శుక్లాంబరధరంవిష్ణుం శశివర్ణంచతుర్భుజం । ప్రసన్నవదనంధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥ వ్యాసంవశిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషం । పరాశరాత్మజంవందే శుకతాతంతపోనిధిం॥ వ్యాసాయవిష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే । నమోవైబ్రహ్మనిధయే వాసుదేవాయతేనమః ॥ అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే। సదైకరూపరూపాయ విష్ణవేసర్వజిష్ణవే ॥ నారాయణం నమస్కృత్య నరంచైవనరోత్తమం । దేవీంసరస్వతీంచైవ తతోజయముదీరయేత్॥ అభ్రశ్యామః పింగజటాబద్ధ కలాపః ప్రాంశుర్దండీ కృష్ణమృగత్వక్పరిధానః। సర్వాన్లోకాన్పావయమానః కవిముఖ్యఃపారాశర్యః పరమనురూపం విస్ఫురతోతు॥ అచతుర్వదనో బ్రహ్మాద్విబాహురపరోహరిః। అఫాలలోచనశ్శంభుర్భగవాన్బాదరాయణః॥

శౌనకఉవాచ॥ శ్లో॥ సూతసూత మహాభాగ వ్యాసశిష్యమహామతే। త్వదీయవదనాంభోజా దుపాఖ్యానిశ్రుణ్వతాం ॥ తృప్తిర్నజాయతేభూయశ్శ్రావణేచ్ఛాప్రవర్ధతే॥

తా॥ మహానుభావుడవును విశేషమైన జ్ఞానము గలవాడవును వ్యాసమునీశ్వరునకు శిష్యుడవునగు ఓసూతమునీశ్వరా! నీముఖ పద్మమువలన ననేకయితిహాసములను వింటిమి. అయినను తృప్తి తీరలేదు, తిరిగి శ్రావణమాస మాహాత్మ్యము వినవలయునని కోరిక గలిగి యున్నది. అని శౌనకుడు పలికెను.

శ్లో॥ కార్తికస్యచమాహాత్మ్యం తులాసంస్థేదివాకరే। మాఘమాసస్యమాహాత్మ్యం మకరస్థేదివాకరే। వైశాఖమాసమాహాత్మ్యం తథామేషగతేరవౌ ॥ తత్రతత్రచయేధర్మాః కథితాస్సర్వశస్త్వయా॥

తా॥ ఓమునీశ్వరుడా! సూర్యుడు తులారాశియందు ప్రవేశించి నప్పుడు కార్తికమాస మాహాత్మ్యమును సూర్యుడు మకరరాశియందు ప్రవేశించి నప్పుడు

మాఘమాస మాహాత్మ్యమును సూర్యుడు మేషరాశి యందు ప్రవేశించి నప్పుడు వైశాఖమాస మాహాత్మ్యమును చెప్పియాయా మాసముల యందు జేయతగిన ధర్మములను సవిస్తరముగా జెప్పియుంటిరి.

శ్లో॥ ఏతేభ్యోప్యధికఃకశ్చి న్మాసశ్చే త్తవసంమతః । యచ్ఛ్రుత్వాపునరన్యత్ర శ్రోతుమిచ్ఛానసోభవేత్ । శ్రద్ధాళోః శ్రోతురగ్రేతు వక్తాగోప్యం నకారయేత్ ॥

తా॥ ఓ మునీశ్వరుడా! ఏమాసము యొక్క మహిమను వినిన యెడల మరి యొకధర్మమును వినవల యునని కోరిక కలుగదో అటువంటిదియు ఈ చెప్పబడిన మాసములకంటె నుత్తమమైన మాసమున్న యెడల చెప్పవలయును - ఎవరైనను ధర్మమును వినవలయునని కోరిక కలిగి యున్న యెడల తెలసినవారు దానిని చెప్పవలయునుగాని దాచగూడదు.

సూతః॥ శ్లో॥ శృణుధ్వంమునయస్సర్వే భవతాంవాక్య గౌరవాత్ । తుష్టోహంనచగోప్యంమే భవదగ్రేతుకించన ॥

తా॥ సూతుడు చెప్పుచున్నాడు. ఓ శౌనకాది మునులారా! మీరందరు వినుడు. మీకందరకు నాయందుండు గౌరవమువలనసంతసించితిని. ఇంత శ్రద్ధ కలిగి యున్న మీ యెదుటను సర్వమును జెప్పెదనుగాని రహస్యముగా నుంచువాడను కాను.

శ్లో॥ అదాంభిత్వంతథాస్తిక్య మశఠత్వంసుభక్తతా । శుశ్రూషత్వంవినీతత్వం బ్రహ్మణ్యత్వంసుశీలతా॥ ధృవత్వంచశుచిత్వంచ తపస్విత్వానసూయతే। ఏతేద్వాదశసంఖ్యాకా గుణాశ్శ్రోతుఃప్రకీర్తితాః॥ తేసర్వేపిభవత్స్వేవ తుష్యం స్తత్వంబ్రవీమ్యతః॥

తా॥ డాంబికము లేకయుండుట, ఈశ్వరుండుండు ననుట, ద్వేషము లేకపోవుట, భక్తికలిగి యుండుట, పెద్దలను సేవించుట, నమ్రముగా నుండుట, సమస్త విద్యలు నేర్చి యుండుట, మంచిస్వభావము కలిగియుంచుట, ధైర్యము కలిగియుండుట, శుచిగానుండుట, తపస్సు జేసికొనుట, అసూయతలేకపోవుట,అనునట్టి గుణములు పండ్రెండును ధర్మములను వినవలయునను వారికి ముఖ్యముగా నుండవలయును. కాబట్టిఅట్టి సమస్తగుణములు మీయందు నున్నందు వలన సంతోషించి యధార్థముగా నంతయు మీకు జెప్పదలచిన వాడనై తిని.

శ్లో॥ సనత్కుమారో మేధావీ ధర్మజిజ్ఞాసురానతః । ఈశ్వరం పరిపప్రచ్ఛ భక్త్యాపరమయాయుతః॥

తా॥ ఓమునులారా! మిక్కిలిజ్ఞాన సంపన్నుడైన సనత్కుమారుడుధర్మము లను దెలిసికొన నిశ్చయించినవాడై యీప్రకారముగా నడిగెను.

సనత్కుమారః॥ శ్లో॥ దేవదేవమహాదేవ యోగిధ్యేయపదాంబుజ। వ్రతానిబహుళశ్శ్రుత్వా శ్రుతాధర్మాశ్చసర్వశః॥

తా॥ సనత్కుమారుడడుగుచున్నాడు. దేవతులకు దేవుడవును మునీశ్వరులచే ధ్యానము చేయుతగిన పాదపద్మములు కలవాడవునగు యోసాంబమూర్తీ! అనేకమైన వ్రతములు ధర్మములు సవిస్తరముగా నీవలన వినియుంటిని.

శ్లో॥ తథాపిశ్రోతుమిచ్ఛామి వర్తతేహృదిసాంప్రతం । ద్వాదశస్వపిమాసేషు మాసశ్శ్రేష్ఠతమస్స్మృతః । తవప్రీతికరోత్యంతం సిద్ధిదస్సర్వ కర్మణామ్ ॥

తా॥ అయినను ఇప్పుడు నామనస్సునందు మఱియొకకోరికగలదు అది యెట్లనఁగా పండ్రెండు మాసములలోను శ్రేష్ఠమైనదియు మీకు ప్రియమైనదియు సమస్తకర్మలకు ఫలమునిచ్చు నట్టి మాసమును వినవలయునని కోరిక జనియించియున్నది.

శ్లో॥ అన్యమాసేకృతంకర్మ తదేవాస్మిన్ కృతంయది । స్యాదనంతఫలందేవ తంమాసం వక్తుమర్హసి ॥ తత్రత్యాన్ సర్వధర్మాంశ్చ లోకానుగ్రహ కామ్యయా॥

తా॥ ఓస్వామీ ! ఇతరమాస ములయందు జేయు నట్టి కర్మ ఏమాసమందు జేసిన విశేషఫలము నొసగునో అట్టి మాసమును ఆమాసము నందుండెడి సమస్తధర్మములను జెప్పి లోకులను తరింపజేయునను గ్రహము కలవాడ వగుమని సనత్కుమార మునీశ్వరుఁ డీశ్వరునితో బలికెను.

ఈశ్వర ఉవాచ ॥ శ్లో॥ సనత్కుమారవక్ష్యామి నుగోప్యమపి సువ్రత। శుశ్రూషత్వేనభక్త్యాచ ప్రీతోస్మివిధినందన ॥

తా॥ బ్రహ్మమానసపుత్రుడవునగు యోసనత్కుమారా! నీయొక్కశుశ్రూషచేతను భక్తిచేతను సంతోషించితిని. నేజెప్పెడు ధర్మము రహస్యముగా నుంచతగినదైనను జెప్పెద వినుము.

శ్లో॥ ద్వాదశస్వపిమాసేషు శ్రావణోమేతివల్లభః । శ్రవణార్హంయన్మహాత్మ్యంతతోసౌ శ్రావణోమతః॥

తా॥ పండ్రెండు మాసములలోను శ్రావణ మాసము నాకు చాలా ప్రియమయినది, దాని మహిమ వినతగినది గాన శ్రావణ మాసమని పెద్దలచే నుడువఁబడియున్నది.

శ్లో॥ శ్రవణర్క్షం పౌర్ణమాస్యాం తతోపి శ్రావణ స్స్మృతః । యశ్చ శ్రవణమాత్రేణ సిద్ధిదః శ్రావణోప్యతః॥

తా॥ శ్రవణ నక్షత్రముతో గూడిన పూర్ణిమ గలదు కాఁబట్టి శ్రావణ మాసమని చెప్పబడు చున్నది, ఏమాస మహిమ వినఁబడినంత మాత్రముననే ఫలము నిచ్చుచున్నదో, అందువలనను ఆమాసము శ్రావణమాసమని చెప్పబడు చున్నది.

శ్లో॥ స్వచ్ఛత్వాచ్చనభస్తుల్యో నభా ఇతితతస్స్మృతః । తత్రత్య ధర్మగణనాంకర్తుం కశ్శక్నుయాద్భువి॥

తా॥ ఆకాశమువలె నిర్మలమయినది కాఁబట్టి శ్రావణమాస మునకు, నభా, అని పేరువచ్చినది, ఆమాసము నందుండు ధర్మములను లెక్క పెట్టుటకు ఈ భూమి యందు నెవఁడును సమర్థుఁడు కాఁడు.

శ్లో॥ సర్వతోయత్ఫలంద్రష్టుం చతురాస్యోభవద్విధిః। ద్రష్టుం యత్ఫలమాహాత్మ్యం సహస్రాక్షోభవద్వృషా ॥

తా॥ ఈ శ్రావణ మాస మహిమను సర్వమును చూచుటకు బ్రహ్మ దేవుడు నాలుగు ముఖములుగలవాడయ్యెను, దేవేంద్రుడును వేయి నేత్రములుగలవాడయ్యెను.

శ్లో॥ అనంతోయత్ఫలంవక్తుం సహస్రద్వయ జిహ్వకః । కింబహూక్తేనకోప్యేతద్ద్రష్టుంవక్తుంనచక్షమః ॥

తా॥ ఈ శ్రావణమాస ఫలమును చెప్పుటకు ఆదిశేషుఁడు రెండు వేల నాలుకలు గలవాడయ్యెను. మఱియు నిదియదియని విశేషముగా జెప్పనేల. ఈమాసము యొక్క ఫలమును జెప్పుటకు ఈప్రపంచములో నెవరును సమర్థులులేరు.

శ్లో॥ ఏతత్కాలామపిమునే లభతేనాన్యమాసకః । సర్వోవ్రతమయశ్చైవ స్సర్వోధర్మమయస్స్మృతః॥

తా॥ ఓ మునీశ్వరుఁడా! ఈ శ్రావణమాస మహిమలో పదునారవ వంతు

మహిమనైనను ఇతర మాసములు పొందలేవు, కాఁబట్టి యీ మాసమంతయు వ్రత స్వరూపముగాను ధర్మ స్వరూపముగా నున్నదని మునీశ్వరులు చెప్పిరి.

శ్లో॥ నకోపివాసరోయత్ర వ్రతశూన్యః ప్రదృశ్యతే । ప్రాయేణ తిథయశ్చాపి వ్రతవత్యోత్రమాసికే॥

తా॥ ఈ శ్రావణమాసమునందు ఒక దిన మయినను వ్రతములేని దినములేదు ఈ మాసమునందు తిథులన్నియు వ్రతదినములైనవి.

శ్లో॥ అత్రోచ్యతే మహాత్మ్యస్య దర్థవాదోనచోత్రహి। ఆర్తైర్జిజ్ఞాసుభిర్భక్తై స్తథా ధార్థిముముక్షుభిః ॥ చతుర్విధైరపి జనైస్సేవ్యస్స్వస్వేష్టకాంక్షిభిః॥

తా॥ ఈ శ్రావణమాస మహిమను గురించి చెప్పిన దంతయు యదార్థమే గాని స్తోత్రము కాదు ఆర్తులు, జ్ఞానేచ్ఛగల భక్తులు, ప్రయోజనము నపేక్షించువారు, మోక్షాపేక్షగలవారు, ఈ నాలుగు విధములైనవారును తమ తమ కోరికలను పొందుటకు ఈ శ్రావణమాస ధర్మముల నాచరింపవలయును.

సనత్కుమారఉవాచ ॥ శ్లో ॥ భగవన్యత్త్వయాప్రోక్తో వ్రతశూన్యోనవాసరః । ప్రాయేణతిథిరప్యత్ర తన్మమాచక్ష్వసత్తమ ॥ కస్యాంతిథౌ కింవ్రతం స్యాత్కస్మిన్వారేచకింవ్రతం । తత్రతత్రాధికారీకః కింఫలంకీదృశోవిధిః॥

తా ॥ సనత్కుమారు డడుగుచున్నాఁడు, ఓ సాంబమూర్తీ ! ఈ శ్రావణ మాసమునందు ఒకవారమైనను ఒకతిథియైనను. వ్రతములేనిదికాదు. తిథులన్నియు తరుచుగా వ్రతములు కలవియే యని చెప్పితిమి. దానినే విస్తరించి నాకుచెప్పవలయును. ఏతిథియందేమి వ్రతముకలదు, ఏవారమునందేమి వ్రతముకలదు, ఆయా వ్రతముల నెటువంటివాఁడు చేయవలయును చేసినందువలన నేమిఫలముకలుగును. చేయువిధాన మెటువంటిది.

శ్లో॥ కేనకేనాపిచాచీర్ణ ముద్యాపనవిధిశ్చకః। కోదేవఃకోత్ర పూజ్యస్స్యాత్సామగ్రీపూజనస్యకా॥ ప్రధానంపూజనంకుత్ర జాగరశ్చాపితద్విధః । కస్యవ్రతస్యకః కాలస్తత్సర్వం వదమేప్రభో॥

తా ॥ ఈ శ్రావణమాస వ్రతములను పూర్వమందాచరించిన వారెవరు ఉద్యాపనము చేయుటెట్లు. ఏదేవతను పూజింపవలయును ఆపూజకు సామాగ్రియెటు

తా ॥ నిన్ను పూజించినయెడల పంచాయతనపూజ జరుగును ఇతరదేవతలను పూజించినయెడల ఆవిధముగా సంభవించదు.

శ్లో॥ స్వయంశివ స్త్వంవామే శా శక్తిగణాణపతి స్తథా। దక్షిణో రావక్షి సూర్యో హృదయే భక్తరాణహరిః॥ అతోస్యబ్రహ్మరూపత్వా ద్భవాత్సత్త్వాద్ధరేరపి॥ భోక్తృత్వాచ్ఛుతవేశాన శ్రేష్ఠత్వేకస్యసంశయః॥

తా ॥ ఓసాంబమూర్తీ! నీవు ప్రధానుడవై యుండగా నీయెడమ భాగమందు శక్తియు, కుడితొడయందు గణపతియు, నేత్రంబులయందు సూర్యుడును, భక్తాగ్రగణ్యుడగు విష్ణువు హృదయమందును నివసించి యుండుటవలన సృష్టి స్థితిలయములను జేయుటవలనను నీవు బ్రహ్మస్వరూపుడవైతివి ఓశివుడా! నీవుసమస్తదేవులకును జీవస్వరూపముగా నుండుటవలన నీవు శ్రేష్ఠుడవనుటకు నెవరికి సందేహము లేదు.

శ్లో॥ విరక్తత్వంశిక్షయతి శ్మశానేపర్వతేస్థితిః। ఉతామృతత్వస్యేశాన మంత్రలింగేనసూక్తకే॥ పౌరుషేప్రతిపాద్యోసి ఇతిప్రాహుర్మహర్షయః॥

తా ॥ విరక్తినిజెంద శ్మశానమునందు, పర్వతములయందు, నీయొక్కనివాసము ప్రతివారికిని వైరాగ్యము నవలంబించి మోక్షాపేక్షులుగా నుండవలయునని బోధించుచున్నది మరియూ పురుషసూక్తములో (ఉతామృతత్వస్యేశానః) అను మంత్రముచే ప్రతిపాదింపబడు దేవుడవు నీవేయని మునీశ్వరులు చెప్పుచున్నారు.

శ్లో॥ జగత్సంహారకంహాలాహలంకేనధృతంగళే। మహాప్రలయకాలాగ్నింఫాలేధర్తుంచకః క్షమః॥ భవాంధకూపపతనే హేతుః కేనహా తస్స్మరః। కింవర్ణ్యాం భాగధేయం తేయద్వక్తుంహీనాదృశోభవాన్॥

తా ॥ ప్రపంచమును సంహరింప జేయునట్టి హాలాహలమను విషయమును నశింపజేయు ప్రళయకాలాగ్నిని మూడవనేత్రముగా నొందుటనుధరించిన సమర్థుడవు నీవేకదా సంసార మనెడు చీకటి నూతిలో పడద్రోయుటకు సమర్థుడగు మన్మథుని సంహరించిన వాడవుగదా నీవుయిటువంటి వాడవని నీమహిమను చెప్పుటకు నేనెంతటివాడను.

శ్లో॥ త్వాంస్తోతుం జన్మకోట్యాపి వరాకోహం నచక్షమః । కృత్వామయికృపామేవ మత్ప్రశ్నాన్వక్తుమర్హసి॥

తా॥ గ్రుడ్డిగవ్వతో సమానుడనైన నేను కోటిజన్మములెత్తినను నిన్ను స్తుతించుటకు సమర్థుడను కాను కాబట్టి నాయందు దయయుంచి నేజేసిన ప్రశ్నలకు నన్నిటికిని తగిన సమాధానములను జెప్పి నన్ను కృతార్థుడను జేయుము.

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణమాస మాహాత్మ్యే ప్రథమోధ్యాయ
స్సమాప్తః

---

## అథ ద్వితీయోధ్యాయః.

ఈశ్వర ఉవాచ॥ శ్లో॥ సాధుసాధుమహాభాగ వినీతోసివిరించిజ। శ్రోతాగుణయుతోయస్మా చ్ఛ్రద్ధాళుర్భక్తిభూషితః॥

తా॥ ఈశ్వరుడు చెప్పుచున్నాడు మహానుభావుడవును బ్రహ్మమానసపుత్రుడవునగు ఓ సనత్కుమారా! నీవుచేసిన ప్రశ్న బాగుగానున్నది జ్ఞానము కలవాడవు వినువారు మంచిగుణములు కలవారును, భక్తికలవారును, శ్రద్ధకలవారునై నయెడల వారికి కోరినప్రశ్నలను గురించి ముఖ్యముగా జెప్పవలయును.

శ్లో॥ శ్రావణేమాసివిషయే యత్పృష్టంభవతానఘ । అదృష్టమపితేవక్ష్యే ప్రేమ్ణాపరమయాముదా॥

తా॥ ఓమునీశ్వరా! శ్రావణమాసమును గురించి నీవుచేసిన ప్రశ్నను ఇదివరలో నెవరికి దెలియబడనప్పటికిని నీయందుండెడి మిక్కిలి ప్రేమచేతను జెప్పుచున్నాను.

శ్లో॥ ప్రియోభవసిచాద్వేష్టా నమ్రస్త్వంచతథావిధిః । పంచమోమస్తకశ్ఛిన్నః ప్రోద్ధతస్యపితుస్తవ ॥ త్వంచతం మత్సరంత్యక్త్వా మాంయతశ్శరణంగతః । అతోవక్ష్యామితేతాత భూత్వాచైకమనాశ్శృణు ॥

తా॥ నీవు ద్వేషములేనివాడవును విధేయుడవును ప్రియమైనవాడవునైతివి నీతండ్రియైనబ్రహ్మ గర్వించియుంటచే నైదవశిరస్సును ఛేదించితిని నీతండ్రికి కలిగి

నదనే ద్వేషము లేక నన్ను శరణను పొందితివి గావన నీవడిగిన ప్రశ్నలకు సమాధానము జెప్పెదను సావధాన మనస్సుగలవాడవై వినుము.

శ్లో॥ కుర్యాన్నక్తవ్రతం యోగీ శ్రావణే నియతో నరః। రుద్రాభిషేకం కుర్వీత మాసమాత్రం దినే దినే॥

తా॥ ఓమునీశ్వరా! ప్రతిమనుష్యుడును శ్రావణమాసములో నక్తవ్రతమును జేసి నెలదినములలో ప్రతిదినమందును రుద్రాభిషేకమును జేయుచుండవలెను

శ్లో॥ స్వప్రీతివిషయస్యాపి కస్యచిత్త్యాగమాచరేత్। పుష్పైః ఫలైశ్చ ధాన్యైశ్చ తులసీమంజరీదళైః॥ బిల్వపత్రైర్లక్షపూజాం శంకరస్య సమాచరేత్। కోటిలింగాది కర్తవ్యం బ్రాహ్మణాంశ్చైవ భోజయేత్॥ ధారణాపారణే కుర్యాదుపోషణమథాపిచ। పంచామృతాభిషేకంచ మమప్రీతికరంపరం॥

తా॥ తనకు ప్రియమైన వస్తువేదియైన నొకటి విడువలయును పుష్పములు, ఫలములు, ధాన్యములు, తులసీదళములు, మారేడుదళములు మొదలగు వానిచే నీశ్వరునకు లక్షపత్రిపూజ చేయవలయును కోటిలింగార్చనమును జేయించి బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును ఈశ్వరప్రసాదమును ధరించుటయు, నొకప్పుడు పారణజేయుటయు, నొకప్పుడు నుపవాసము జేయుటయు, నాకుమిక్కిలి ప్రీతికరమైన పంచామృతములతో నభిషేకమును జేయుచుండవలయును.

శ్లో॥ అస్మిన్మాసే కృతం యద్యత్తదానంత్యాయ కల్పతే। భూమిశాయీ బ్రహ్మచారీ సత్యవాదీ భవేన్మనే॥

తా॥ ఓమునీశ్వరుడా! ఈశ్రావణమాసములో జేయబడుధర్మములన్నియు విశేషఫలమునిచ్చునవి యగును ఈవ్రతముల నాచరించువాడు మంచము మొదలగు వానిని విడచిపెట్టి నేలయందే శయనించవలయును సత్యముగా మాట్లాడుచుండవలయును బ్రహ్మచర్యవ్రతమును సలుపుచుండవలయును.

శ్లో॥ నవయేన్మాసమేనంతు వ్రతంవర్జ్యంకదాచన। అనోదనం సమశ్నీయా ద్ధవిష్యాన్నమథాపివా॥

తా॥ ఈమాసము నెప్పుడును వ్రతశూన్యమైన దానిగా వెళ్లబుచ్చకూడదు ఆహారవిషయములో అన్నము తినగూడదు హోమాదులయందు నుపయోగింపబడిన యన్నము మిగిలినయెడల నట్టియన్నమును భుజియించవచ్చును.

శ్లో॥ పత్రంచైవసమశ్నీయా చ్ఛాకమూశ్రింత్యజేత్క్వచిత్। కించిద్వ్రతీసర్వథాస్యాద్భక్తిమాన్మునిసత్తమ ॥

తా॥ ఓమునీశ్వరుండా! ఆకులను భక్షింపవచ్చును కూరలను భుజియింపకూడదు వ్రతముజేయువాఁడుసమస్తవిధములచేతను భక్తిగలవాడై యుండవలయును.

శ్లో॥ సదాచారోభూమిశాయీ ప్రాతస్స్నాయీ జితేంద్రియః। మత్పూజాంప్రత్యహంకుర్యా దేకాగ్రకృతమానసః ॥

తా॥ వ్రతము నాచరించువాఁడు యోగ్యమైన యాచారముగల వాఁడై స్థిరమైనమనస్సు గలవాఁడగుచు నింద్రియమును జయించి యుదయమున స్నానము జేయుచు భూమియందు శయనించుచు నిత్యము నాపూజ జేయుచుండవలయును.

శ్లో॥ పునశ్చరణమప్యత్ర మంత్రాణాంసిద్ధిదంపరం। శివషడ్వర్ణంమంత్రస్య గాయత్ర్యాశ్చజపంచరేత్ ॥

తా॥ శ్రావణ మాసమునందు మంత్రములను పునశ్చరణముజేసిన యెడల కోరికలు సిద్ధింపగలవు కాఁబట్టి యోంకారముతో గూడిన ఆరువర్ణములు గలదిగాన శివపంచాక్షరీ మంత్రమును గాయత్రీమంత్రమును జపించవలయును.

శ్లో॥ ప్రదక్షిణానమస్కారాన్ వేదపారాయణంతథా। కృతం ఫలతి సద్యోవా వాంఛితార్థఫలప్రదః ॥

తా॥ ప్రదక్షిణములు నమస్కారములు వేదపారాయణము జేయించవలయును. ఈచెప్పబడినవన్నియు చేయించిన యెడల వెంటనే కోరిన ఫలమునిచ్చునవి యగును.

శ్లో॥ జపఃపురుషసూక్తస్య చాధికంఫలదోభవేత్। గ్రహయజ్ఞఃకోటిహోమో లక్షహోమోయుతస్తథా। కృతఃఫలతి సద్యోత్రవాంఛితార్థఫలప్రదః॥

తా॥ పురుషసూక్తముచే జపముచేయుటయు విశేషఫలము కలుగును నవగ్రహములను గురించి కోటిహోమములుగాని లక్షహోమములుగాని పదివేలుహోమములుగాని తనశక్తికొలది చేయించిన కోరిన కోరికలు ఫలించునవి యగును.

శ్లో॥ అస్మిన్మాసే చైకదినం యోవంధ్యం వ్రతతోనయేత్। సయాతినరకంఘోరం యావదాభూతసంప్లవం॥

తా ॥ ఎవడైన నీశ్రావణమాసములో నొక్క దినమందైనను ధర్మము నాచరింపక వ్యర్థముగా గడపువాఁడు ప్రళయకాల పర్యంతము నరకములో నుండువాఁడగును.

శ్లో॥ యథాచాయంశ్రియోమాస స్తథాకించిన్నమేప్రియం । కామ్యశ్చఫలదశ్చాయం నిష్కామస్యతుమోక్షదః ॥

తా ॥ నాకు ఈమాసము ప్రియమైనట్లు మఱియొకటి యేదైనను ప్రియము కాదు ఈమాసము కోరికలు గలవానికి కోరికలు నిచ్చునదియు మోక్షము కోరువానికి మోక్షము నిచ్చునదియగును.

శ్లో॥ తత్రతత్రతుయేధర్మా స్తాన్మత్తశ్శృణుసత్తమ । రవౌరవివ్రతంసోమే మత్పూజానక్తభోజనం॥

తా॥ ఓమునీశ్వరా! యేయేదినములయం దేయేవ్రతముల నాచరింపవలయునో జెప్పెదవినుము ఆదివారమునందు సూర్యవ్రతమును సోమవారమునందు నాయొక్క పూజను చేసి రాత్రులయందు భుజింపవలయును.

శ్లో॥ ప్రథమంసోమమారభ్య వ్రతంస్యాద్రోటకాభిధం । సార్ధమాసత్రియంతత్స్యా త్సర్వకామార్థసిద్ధిదం॥

తా ॥ మొదటిసోమవారము మొదలు మూడుమాసముల పదిహేనుదినముల వఱకు రోటకమను వ్రతము ప్రతిసోమవారమునందు నాచరింపవలెను. సమస్త కోరికల నొసగును.

శ్లో॥ భౌమేమంగళ గౌర్యాశ్చ తదహ్నోబుధ జీవయోః । శుక్రేజీవంతికాయాశ్చ ఆంజనేయనృసింహయోః ॥

తా ॥ మంగళవారమునందు మంగళ గౌరీదేవిని బుధవార గురువారముల యందు బుధుని బృహస్పతిని పూజింపవలయును శుక్రవారమునందు జీవంతిక యను దేవతను ఆంజనేయ నరసింహ దేవతలనుబూజింపవలెను.

శ్లో॥ శనౌవ్రతంసమాదిష్టం తిథివ్రతమునేశ్శృణు ॥ నభశ్శుక్ల ద్వితీయాయాం వ్రతమౌదుంబరాభిధం॥

తా॥ శ్రావణమాసమునందు శనివారముతోఁ గూడిన యేయేతిథుల యందు నేయేవ్రతము నాచరింపవలయునో జెప్పెదవినుము. శుక్లవిదియందు ఔదుంబర వ్రతమును చేయవలెను.

శ్లో॥ గౌరీవ్రతం తృతీయాయాం శ్రావణేశుక్లపక్షకే । తథా శుక్లచతుర్థ్యాంతు దూర్వాగణపతివ్రతం॥

తా॥ శ్రావణశుక్లతదియయందు గౌరీవ్రతమును శుక్లచవితియందు దూర్వాగణపతి వ్రతమునాచరింపవలయును.

శ్లో॥ వినాయకేతితస్యాశ్చ సంజ్ఞాస్యాదపరామునే । నాగానాం పూజనేశస్తా పంచమీశుక్లపక్షకే।

తా॥ ఓ మునీశ్వరుడా! ఆ దూర్వాగణపతి వ్రతమునకే వినాయక వ్రతమనియు రెండవపేరుగలదు మఱియు శుద్ధపంచమి యందు సర్పములను పూజించవలెను.

శ్లో॥ ఇమాంమానవకల్పాది జానీహిమునిసత్తమ । సూపోదన వ్రతంషష్ట్యాం సప్తమ్యాంశీతలవ్రతం॥ పవిత్రారోపణందేవ్యా హ్యష్టమ్యాంశుక్లపక్షకే। శుక్లకృష్ణనవమ్యాస్తు నక్తవ్రతవిధిస్మృతః॥

తా॥ ఈ సర్పపూజయే సృష్టి మొదలుకొని జరుగుచున్నది షష్ఠియందు సూపోదన వ్రతము, సప్తమియందు శీతలవ్రతము, అష్టమియందు పవిత్రారోపణ వ్రతము, శుక్లకృష్ణ పక్షముల రెండు నవములయందు నక్తవ్రత మాచరించవలెను.

శ్లో॥ దశమ్యాంశుక్లపక్షేతు ఆశాసంజ్ఞంవ్రతంచరేత్ । పక్షద్వయేవిశేషోస్మిన్నేకాదశ్యోస్తుకశ్చన॥

తా॥ శుక్లదశమియందు ఆశయనెడు వ్రతమును చేయవలయును శుక్లకృష్ణ రెండుపక్షముల యేకాదశుల యందును విష్ణు సంబంధమైన వ్రతమును చేయవలయును.

శ్లో॥ పవిత్రారోపణంశుక్ల ద్వాదశ్యాంతు హరేస్స్మృతం । ద్వాదశ్యాంతుశ్రీధరం పూజ్య పరాంగతిమవాప్నుయాత్॥

తా॥ శుక్లద్వాదశియందు విష్ణువునకు పవిత్రారోపణమను వ్రతమును చేయవలయును, ద్వాదశియందు విష్ణుమూర్తిని పూజించినయెడల నుత్తమమైన పదమును పొందగలరు.

శ్లో॥ ఉత్సర్జనముపాకర్మ సభాదీపస్తథైవచ। ఉపాకర్మసభాయాంతు రక్షాబంధస్తథాపరః॥ శ్రవణాకర్మతథైవ తథాసర్ప బలిస్స్మృతః। హయగ్రీవస్యావతారః పూర్ణిమాయాంతుసప్తకమ్।

తా ॥ ఉపాకర్మ, ఉత్సర్జనము, సభాదీపము, రక్షాబంధము, శ్రవణా కర్మ, సర్పబలి, హయగ్రీవావతారము, అనెడు నీయేడును పూర్ణిమయందు నాచరింపవలయును

శ్లో॥ నభఃకృష్ణే తుసంకష్ట చతుర్థీవ్రతముచ్యతే । జ్ఞేయా మానవకల్పాది శ్రావణేకృష్ణపంచమీ॥

తా ॥ శ్రావణబహుళ చవితియందు సంకష్టచతుర్థీ వ్రతమును చేయవలెను శ్రావణబహుళ పంచమియందు మానవ కల్పాదియను వ్రతమును చేయవలయును.

శ్లో॥ పూర్ణావతారఃకృష్ణస్య కృష్ణాష్టమ్యాంద్విజోత్తమ।అవతారస్సమభవద్ప్రీతంతస్య మహోత్సవః॥

తా ॥ శ్రావణబహుళ అష్టమియందు శ్రీకృష్ణ స్వరూపముగా భగవంతుని పూర్ణమైన తావతార ముద్భవించెను గాన ఆదినమందు మిక్కిలి యుత్సవముతో కృష్ణాష్టమీవ్రతమును చేయవలెను.

శ్లో॥ అమాయాంశ్రావణేమాసి పిఠోరావ్రతముచ్యతే। కుశానాంగ్రహణంచైవ వృషభాణాంచపూజనమ్॥

తా ॥ శ్రావణబహుళ అమావాస్యయందు పిఠోరమను వ్రతమును నాచరింపవలయును ఆదినమునందు దర్భలను గ్రహించి వృషభములను పూజింపవలయును.

శ్లో॥ శుక్లాద్యతిథిమారభ్య తత్తిథిషు దేవతాః। వహ్నిర్దేవః ప్రతిపదిద్వితీయా బ్రహ్మదేవతా ॥ తృతీయాయాస్తథాగౌరీ చతుర్థ్యాంగణనాయకః। సర్పాధిపాపంచమీస్యాత్షష్ఠీస్యాత్స్కంద దేవతా॥ సప్తమ్యాంభాస్కరో దేవ శివదేవాష్టమీతిథిః । దుర్గాధిపాతు నవమీ దశమ్యంతక దేవతా॥ ఏకాదశ్యాంశ్చైవ విశ్వేదేవాః ప్రకీర్తితాః। ద్వాదశ్యాశ్చహరిః కామస్త్రయోదశ్యధిపోయమః॥ చతుర్దశ్యాంశివశ్చైవ పౌర్ణమాస్యాం శచీపతిః । అమాయాం పితరోదేవా ఏతేతిథ్యదిపాస్స్మృతాః ॥ సస దేవ స్తత్ర పూజ్యోయస్య దేవస్యయా తిథిః। అగస్త్యస్యోదయేమాసే ప్రాయేణాత్రైవజాయతే॥ కథయామి చతంకాలం శృణుష్వైకమనామునే॥

తా ॥ శుక్ల పాడ్యమి మొదలు ఏయేతిథులకు ఏయే దేవతలు అధిపతులైయుం దురో వానిని చెప్పెదను సావధానమనస్సు గలవాడవై వినుము పాడ్యమికి వహ్నియు,

విదియకు బ్రహ్మయు, తదియకు పార్వతియు, చవితికి గణపతియు, పంచమికిసర్పములును, షష్ఠికి కుమారస్వామియు, సప్తమికి సూర్యుఁడును, అష్టమికి శివుడును, నవమికి దుర్గయు, దశమికి మృత్యుదేవతయు, ఏకాదశికివిశ్వేదేవతులును, ద్వాదశికి విష్ణుమూర్తియు, మన్మధుడును, త్రయోదశికియముడును,చతుర్దశికి శివుడును, పౌర్ణమికి నిందుఁడును, అమావాస్యకుపితృదేవతులును అధిపతులై యుండిరి కాఁబట్టి యేయేతిథికి నేయేదేవతు లధిపతులై యుండిరో ఆయాతిథుల యందాయా దేవతులను పూజింప వలయును అగస్త్యోదయ మాసముకూడ తరచుగా ఈశ్రావణ మాసమునందే కలుగును కాఁబట్టి యోమునీశ్వరుఁడా అట్టికాలమును గుఱించి వివరించి చెప్పుచున్నాను స్థిరచిత్తముతో వినుము.

శ్లో॥ సింహసంక్రాంతిదివసాయదా ద్వాదశయాంతివై। చత్వారింశ్చఘటికాతదాగస్త్యోదయోభవేత్ ॥

తా ॥ సింహ సంక్రమణము ప్రవేశించిన పిమ్మట పండ్రెండు దినములు నలుబది ఘడియలు గడచిన యనంతరము అగస్త్యోదయమగు. ఇది మిక్కిలి పుణ్యకాలమని చెప్పఁబడెను.

శ్లో॥ సప్తాహానితతఃపూర్వే హ్యగస్త్యార్ఘ్యంసమాచరేత్ ॥

తా ॥ అగస్త్యోదయమునకు పూర్వము ఏడుదినములు అగస్త్యునకు పూజసాంతింపవలయును మఱికొందఱిమతము ఉదయాత్పర మందును కూడ చేయవచ్చు నని యున్నది.

శ్లో॥ ద్వాదశేష్వపిమాసేషు ఆదిత్యోభిన్నసంజ్ఞయా । తపతే శ్రావణేతత్ర గభస్తిరితిసంజ్ఞితః॥ తత్పూజనంచకర్తవ్యం మాసేస్మిన్ భక్తితత్పరైః ॥

తా ॥ చైత్రము మొదలు పండ్రెండు మాసములయందు సూర్యుఁడు పండ్రెండు నామములచే జెప్పబడు చున్నాఁడు శ్రావణమాసము నందు సూర్యుఁడు (గభస్తి) యనిపేరుచే ప్రకాశించుచుండును కాఁబట్టి ఈ శ్రావణ మాసము నందు మిక్కిలి భక్తిగలవారలై గభస్తియను సూర్యునికి పూజచేయవలయును.

శ్లో॥ చతుర్ష్వపి మాసేషు వ్రతానివిహితానిచ । శ్రావణే చత్యజేచ్ఛాకం దధిభాద్రపదేతథా ॥

తా ॥ శ్రావణము మొదలు నాలుగుమాసముల యందును చెప్పఁబడిన వ్రతములను జేయుచు శ్రావణ మాసములో కూరను భాద్రపదములో పెరుగును భుజింపక విడువవలయును.

శ్లో॥ దుగ్ధమాశ్వయుజేమాసి కార్తికేద్విదళంత్యజేత్ । ఇత్యాదీనిసమస్తాని తానికర్తుమశక్నువన్ ॥ ఏకస్మిన్ శ్రావణేమాసి కుర్వంస్తత్ఫలభాగ్భవేత్ । ఉద్దేశోయంమయాప్రోక్తస్సంక్షేపాత్తవ మానద॥

తా ॥ ఓమునీశ్వరా! ఆశ్వయుజ మాసమునందు పాలును కార్తికమాసమున ద్విదళమును విడువ వలయును ఈచెప్పఁబడిన వన్నియు జేయుటకు సమర్థుఁడు కానియెడల ఒకశ్రావణమాసము నందైనను జెప్పినరీతిగా జేసినయెడల నన్నిమాసములయందును జేసినఫలమును పొందువాఁడగును కాఁబట్టి నాయుద్దేశము సంక్షేపముగా నీకుజెప్పితిని.

శ్లో॥ అత్రత్యానాంవ్రతానాంతు ధర్మాణాంమునిసత్తమ । కేనాపివిస్తరోవక్తుం నాలంవర్షశతైరపి॥

తా ॥ ఓమునీశ్వరా! ఈ శ్రావణమాసమునందు చేయతగిన వ్రతములను ధర్మములను గురించి నూరుసంవత్సరముల పర్యంతమును జెప్పుటకు నెవడును సమర్థుడుకాడు.

శ్లో। మమప్రీత్యైహరేర్వాపి కుర్యాద్వ్రతమశేషతః। ఆవయోర్నహిభేదోస్తి పరమార్థవిచారతః॥

తా ॥ నాకును విష్ణుమూర్తికిని ప్రీతికొరకు సమస్త వ్రతములను చేయవలయును యథార్థముగా విచారించినయెడలమాయిద్దఱికినెంతమాత్రము భేదములేదు.

శ్లో॥ కల్పయంత్యత్రయేభేదం తేవైనిరయగామినః । సనత్కుమారతస్మాత్త్వం శ్రావణేధర్మమాచర ॥

తా ॥ ఎవరు మాయుభయులకు భేదమున్నట్లు తలచునో అట్టివారు నరకమును పొందుచున్నారు కాఁబట్టి యోమునీశ్వరా! శ్రావమాసమునందు ధర్మమాచరింపవలయును.

ఇతి స్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణవ్రతోద్దేశన కథనంనామ ద్వితీయోధ్యాయ
స్సమాప్తః

---

## అథతృతీయోధ్యాయః.

సనత్కుమార ఉవాచ॥ శ్లో॥ భగవన్వ్రతసంఘస్య చోద్దేశః కథితస్త్వయా। తృప్తిర్నజాయతే స్వామిన్ విస్తరాద్వక్తు మర్హసి॥ యచ్ఛ్రుత్వాకృతకృత్యోహం భవిష్యామి సురేశ్వర॥

తా॥ సనత్కుమారు డడుగుచున్నాఁడు ఓభగవంతుడా! వ్రతములను గుఱించి సామాన్యముగా చెప్పితివి అందువలన నాకుతృప్తికాలేదు ఓదేవోత్తమా! దేనివలన నేను తరింతునో దానిని విస్తరించి చెప్పవలయునని సనత్కుమారు డడిగెను.

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ నక్తవ్రతేనయోగీశ శ్రావణంయోనయేత్సుధీః। ద్వాదశస్వపిమాసేషు సనక్తఫలభాగ్భవేత్॥ సాయాహ్నేపూర్వంతు నక్తంస్యాద్రాత్రిభోజనమ్॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాఁడు ఓమునీశ్వరా! ఎవడు నక్తవ్రతముచే శ్రావణమాసమును వెళ్లబుచ్చునో వాఁడుపన్నెండు మాసములయందు నక్తవ్రతమును చేసినఫలమునొందును సాయంకాలమునకు పూర్వము భుజించుట నక్తభోజనము అదియే రాత్రిభోజనమనియు జెప్పఁబడును.

శ్లో॥ తత్రాద్యత్రిఘటింత్యక్త్వా కాలస్యాన్నక్తభోజనే। తతస్సంధ్యాత్రిఘటికా అస్తాదుపరిభాస్వతః॥

తా॥ సూర్యాస్తమమైన పిమ్మట మూడు ఘడియలు సంధ్యాకాలముగా జెప్పఁబడుచున్నది గానయనంతరము నక్తభోజనమునకు ప్రశస్తమైన కాలముగా జెప్పఁబడెను.

శ్లో॥ చత్వారిమానికర్మాణి సంధ్యాయాంపరి వర్జయేత్। ఆహారంమైథునంనిద్రాం స్వాధ్యాయంచచతుర్థకమ్॥

తా॥ భుజించుట, సంభోగించుట, నిద్రించుట వేదముచదువుట, ఈనాలుగు కర్మలు సంధ్యాకాలమునందు విడువవలయును.

శ్లో॥ గృహస్థయతిభేదేన వ్యవస్థాంచైవమేశృణు। ఆత్మనోద్విగుణేచ్ఛాయా మందీభవతిభాస్కరే॥ యతేర్నక్తంతు తత్రోక్తం ననక్తంనిశిభోజనం। నక్షత్రదర్శనాన్నక్తం గృహస్థస్యబుధైస్మృతమ్॥

తా॥ ఓమునీశ్వరా! నక్తమును గురించి గృహస్థులకు యతీశ్వరులకును భేదమును జెప్పెదవినుము సూర్యుఁడు పడమటి దిక్కునకు వెళ్ళగా మనుష్యుని యొక్క నీడ దేహప్రమాణముకంటె రెండురెట్లు హెచ్చుగానుండు సమయమున నక్తకాలమని యతీశ్వరులకు చెప్పఁబడినది గాని రాత్రిభోజనము యతీశ్వరులకు జెప్పబడలేదు. గృహస్థులకు నక్షత్రము ఉదయించిన పిమ్మట శ్రేష్ఠముగా జెప్పఁబడెను.

శ్లో॥ యతేర్దినాష్టమేభాగే రాత్రౌతస్యనిషిధ్యతే। నక్తంనిశాయాంకుర్వీత గృహస్థోవిధిసంయుతః॥

తా॥ పగటి ప్రమాణము ఎనిమిదిభాగములు చేయగా చివరదైన యెనిమిదవభాగకాలము యతీశ్వరులకు జెప్పఁబడినది గానిరాత్రిభోజనము నిషేధింపఁబడినది గృహస్థుఁడు రాత్రియందే యథావిధిగా నక్తవ్రతమును చేయవలయును.

శ్లో॥ యతిశ్చవిధవాచైవ విధురశ్చ ససూర్యకమ్। విధురశ్చేత్పుత్రవాన్స్యాత్సతురాత్రౌసమాచరేత్॥

తా॥ యతీశ్వరుఁడును, విధవయు, భార్యావియోగమైన వాడును సాయంకాలమున సూర్యాస్తమయము కాకపూర్వమే భుజింపవలయును భార్యావియోగమైన వాఁడైనను పుత్రులుకల వాఁడైననేని రాత్రియందు భుజింపవచ్చును.

శ్లో॥ అనాశ్రమీవాప్యాశ్రమీస్యాదపత్నీకోపిపుత్రవాన్। ఏవం యథాధికారంతు కుర్యాన్నక్తవ్రతంసుధీః॥

తా॥ పుత్రులుకల వాఁడైనయెడల భార్యావియోగమైన వాఁడును గృహస్థుఁడనియే చెప్పవచ్చును కాఁబట్టి వారివారికి చెప్పఁబడిన విధిచొప్పున నక్తవ్రతము నాచరింపవలయును.

శ్లో॥ అత్రనక్తవ్రతీమాసే పరాంగతిమవాప్నుయాత్॥

తా॥ ఈశ్రావణమాసమునందు నక్తవ్రతము నాచరించువారు ఉత్కృష్టమైన లోకమును జెందగలరు.

శ్లో॥ తిథౌప్రతిపదిప్రాతః శ్రావణేసముపస్థితే। సంకల్పయేన్మాసమేకం శ్రావణేప్రత్యహంత్వహం। ప్రాతస్స్నానం కరిష్యామి బ్రహ్మచర్యవ్రతేస్థితః॥ భోక్ష్యామినక్తం భూశయ్యాం కరిష్యే ప్రాణినాందయామ్। ప్రారబ్ధేస్మిన్ వ్రతేదేవ యద్యపూర్ణే మ్రియేహ్యహమ్॥ తదాసంపూర్ణతాం యాతు ప్రసాదాత్తే జగత్పతే। ఇతిసంకల్ప్య

మేధావీ మాసేన నక్తవ్రతంచ రేత్। ఏవంనక్త వ్రతంకుర్వన్మమప్రియతరో భవేత్ ॥

తా ॥ శ్రావణశుద్ధ పాడ్యమీదినము రాగానే ప్రాతఃకాలమున నిట్లుసంకల్పము జేయవలయును ఓస్వామీ! యీశ్రావణ మాసము ముప్పది దినములును ప్రాతఃకాలంబున స్నానము చేయుచు బ్రహ్మచర్య వ్రతమును జరుపుకొనుచు రాత్రులయందే భుజించుచు భూమియందే శయనించుచు సమస్త ప్రాణులయందు దయగానుండుచు నీవ్రతమును ప్రారంభించి చేయుచున్నాను. ఒకవేళ యీవ్రతము పూర్తికాక పూర్వమే నేను మరణించితినేని యీవ్రతము సంపూర్తి యైనదానిగా నీయనుగ్రహము వలన జేయుమని బుద్ధిమంతుఁడైనవాడు ఇట్లుసంకల్పముచేసి శ్రావణమాసము నంతయు నక్తవ్రతముచే గడప వలయును ఇట్లు నక్తవ్రతమును చేసినవాఁడు నాకుమిక్కిలి ప్రియమైన వాఁడగును.

శ్లో॥ విప్రద్వారాతిరుద్రేణ మహారుద్రేణ వాన్వయం। అభిషేకంమాసమాత్రం రుద్రేణప్రత్యహం చరేత్ ॥ తస్యప్రీణామ్యహం వత్స జలధారాప్రియోయతః॥

తా ॥ నాశిరస్సున నెప్పుడు జలధారలు పడుచుండుటే నాకు ప్రియము కాఁబట్టి శ్రావణమాసము ప్రతిదినమునను తానుగాని యొకబ్రాహ్మణుని ద్వారాగాని రుద్రము, అతిరుద్రము, మహారుద్రము, మొదలగు వానితో తనశక్తినను సరించి రుద్రాభిషేకమును జరిపించవలయును.

శ్లో॥ కుర్యాద్రుద్రేణవాహోమం మమప్రీతికరంపరమ్।స్వస్యయద్రోచతేత్యంతం భోజ్యంవాభోగ్యమేవవా॥ సంకల్ప్యద్విజవర్యాయ దత్వామాసే స్వయంత్యజేత్॥

తా ॥ నాకుసంతోషకరముగా రుద్రముచే హోమము చేయించ వలయును శ్రావణమాసములో ముప్పది దినములయందును తనకునిష్టమైనదిగా యిష్టము లేనిదిగానిపదార్థములను సంకల్పముజేసి బ్రాహ్మణులకు దానమియ్య వలయును అట్టి పదార్థములను తానుభుజింపగూడదు.

శ్లో॥ అతఃపరంశ్రుణుమునే లక్షపూజావిధింపరమ్॥ శ్రీకామోబిల్వపత్రైశ్చ దూర్వాభిశ్శాంతి కాముకః। ఆయుఃకామేనకర్తవ్యం చంపకైఃపూజనంహరేః॥

తా ॥ ఓమునీశ్వరుఁడా! ఇకముందు లక్షపత్రి పూజావిధానము జెప్పెదను వినుము సంపత్తును కోరువాడు మారేడు దళములతోటి శాంతిని కోరువాడు గరికె తోటి ఆయుష్యును కోరువాడు చంపక పుష్పములతోటి భగవంతునిపూజించవలెను.

శ్లో॥ విద్యాకామేనకర్తవ్యం మల్లికాజాతిభిస్తథా । శివవిష్ణ్వోః ప్రసన్నత్వం తులసీభిఃప్రసిద్ధ్యతి ॥ పుత్రకామేనకర్తవ్యం బాణార్కైః పూజనం శుభం । దుస్స్వప్న పరిశమంధాన్యైశ్చ పూజయేత్ ॥

తా ॥ విద్యనుకోరువాడు మల్లి పుష్పములను జాజిపుష్పముల చేతను శివునకు విష్ణువునకు తృప్తినొందుటకు తులసీదళములతోటి పుత్రులను కోరువాడు వాకుడు పువ్వులతోటి దుస్స్వప్నదోషము పోవుటకు ప్రశస్తమైనధాన్యములతోటి పూజింపవలెను.

శ్లో॥ రంగవల్ల్యాదిభిర్దేవం దేవస్యాగ్రేవినిర్మితైః। పద్మాదిభిస్స్వస్తికాద్యైశ్చ చక్రాద్యైఃపూజయేద్విభుమ్॥

తా ॥ భగవంతుని సన్నిధానమందు పద్మము స్వస్తికము చక్రము శంఖము మొదలగు నాకారములుగా ముగ్గులతో నలంకరించి భగవంతుని పూజింపవలయును.

శ్లో ॥ ఏవంహిసర్వపుష్పైశ్చ స్సర్వకామార్థసిద్ధయే । లక్షపూజాంప్రకుర్యాచ్చే త్సుప్రసన్నోహరోభవేత్ ॥

తా ॥ ఈప్రకారము తాను కోరిన కోర్కెలన్నియు పొందుటకు సమస్త పుష్పములచేతను లక్షపత్రిపూజను చేసినయెడల సాంబమూర్తి యనుగ్రహించి కోరికల నొసంగును.

శ్లో॥ ఉద్యాపనంతతఃకార్యం మండపంచైవ సాధయేత్ । వేదికాచపరికర్తవ్యా మండపస్యత్రిభాగతః ॥

తా ॥ అటుపిమ్మట నుద్యాపనము చేయ వలయును అందునిమిత్తమై మండపమేర్పరచ వలయును మంటపమునకు మూడువరెట్లు హెచ్చుగా నుండునట్లు అరుగు నేర్పరచవలెను.

శ్లో॥ పుణ్యాహవాచనంకృత్వా ఆచార్యంవరయేత్తతః।గీతవాదిత్రనిర్ఘోషైః బ్రహ్మఘోషేణభూయసా। ప్రవిశ్యమండపేతస్మిన్ రాత్రౌజాగరణంచరేత్॥

తా ॥ అనంతర మాచార్య నేర్పరచుకొని పుణ్యాహ వాచనముచేసి గీత వాద్యధ్వనులతోడను బ్రాహ్మణుల స్వస్తివాచనాది ధ్వనుల తోడను మంటపము నందు ప్రవేశించి రాత్రియందు జాగరణము చేయవలయును.

శ్లో ॥ వేదికాయాం ప్రకర్తవ్యం లింగతోభద్ర ముత్తమమ్।
తన్మధ్యే తండులైః కుర్యాత్ కైలాసం చ సుశోభనమ్ ॥

తా ॥ ఆవేదికయందు శుభప్రదమైన లింగాకారము నేర్పరచ వలయును దానిమధ్యయందు తండులములనుంచి కైలాసాకారముగా నేర్పరచవలయును.

శ్లో॥ కలశం స్థాపయే త్తత్ర తామ్రం చైవమహాప్రభమ్ । పంచ పల్లవసంయుక్తం న్యసేద్వస్త్రం సుసూక్ష్మకమ్॥

తా ॥ అక్కడచక్కని వర్ణముగల రాగికలశమునుంచి దానిలో నైదువిధ ములగు చిగుళ్లనుంచి యాకలశమునకు మృదువైన నూతనవస్త్రమును జుట్టవలయును.

శ్లో॥ సౌవర్ణీం ప్రతిమాం తత్ర స్థాపయే త్పార్వతీపతేః। పూజాం తత్ర ప్రకుర్వీత పంచామృతపురస్సరైః॥

తా॥ బంగారముతో చేయఁబడిన యీశ్వరునిప్రతిమ నాకలశమునందుంచి పంచామృతము మొదలగువానిచే నభిషేకము చేసి షోడశోపచార పూజచేయ వలయును.

శ్లో ॥ ధూపైర్దీపైస్సనైవేద్యై గీతవాదిత్రనృత్యకైః । వేద శాస్త్రపురాణైశ్చ రాత్రౌ జాగరణం చరేత్ ॥

తా ॥ ధూపము, దీపము, నైవేద్యము మొదలగునవి యాచరించి పిమ్మట నృత్తము, గీతము, వాద్యము, వేదశాస్త్ర పురాణములయొక్క పఠనము మొదలగు వానిచే రాత్రిజాగరణము చేయవలెను.

శ్లో॥ తతః ప్రభాతసమయే సుస్నాతస్సుశుచిర్భవేత్ । స్థండిలం కారయే త్తత్ర స్వశాఖోక్తవిధానతః॥ హోమం చ సతిలాజ్యేన పాయ సేన చ కారయేత్ । మూలమంత్రేణ గాయత్ర్యా శివనామ్నాం సహ స్రకైః ॥

తా ॥ తెల్లవారిన పిమ్మట ప్రాతఃకాలమున స్నానముచేసి పరిశుద్ధుఁడై యా వేదికయందు స్థండిలము నేర్పరచిన పిమ్మట తనశాఖకు సంబంధించిన మంత్ర ములచేతను, గాయత్రీమూలమంత్రముచేతను, శివసహస్ర నామములచేతను, నేతితో కలిపిననువ్వులు, పాయసము, మొదలగువానితో హోమము చేయవలెను.

శ్లో॥ యేనమంత్రేణ పూజాతు కృతా తేనైవ హోమయేత్ ।
శర్కరాఘృతమిశ్రేణ చరుణా జుహుయాత్తతః ॥

తా॥ ఏమంత్రములచే పూజచేయఁబడినదో ఆమంత్రములనే యుచ్చరింపుచు నేతితో కలిపిన పంచదారతోఁటి యన్నముతోఁటి హోమము చేయవలయును.

శ్లో॥ తతస్స్విష్టకృతం హుత్వా పూర్ణాహుతిమనంతరం। ఆచార్యంపూజయేత్సమ్యగ్వస్త్రాలంకారభూషణైః॥

తా॥ అనంతరము స్విష్టకృత్తుహోమముచేసి పిమ్మట పూర్ణాహుతిని జేయవలయును అనంతరము వస్త్రములు ఆభరణములు మొదలగువానిచే నాచార్యుని బాగుగా పూజింపవలెను.

శ్లో॥ బ్రాహ్మణాన్పూజయేత్పశ్చాత్తేభ్యోదద్యాచ్చదక్షిణామ్। యేనయేనప్రకుర్యాచ్చ లక్షపూజాముమాపతేః॥ తత్తద్ద్రవ్యాత్సువర్ణేన కృత్వాశంభుంప్రపూజయేత్। యదిదీపఃకృతస్తేన తద్దానంచైవకారయేత్॥ సువర్ణవర్తికాంకృత్వా దీపపాత్రంచరౌప్యకం। గోఘృతేనసమాయుక్తం సర్వకామార్థసిద్ధయే॥

తా॥ అనంతర బ్రాహ్మణులకు దక్షిణ తాంబూలములనిచ్చి పూజింపవలెను సాంబమూర్తికి లక్షపూజను చేసిన వారందఱును బంగారముతో సాంబమూర్తి ప్రతిమను జేయించి దానిని పూజించి బ్రాహ్మణునకు దానమియ్యవలయును దీపములను కూడ వెలిగించిన యెడల దీపదానము చేయవలయును అదియెట్లనఁగా వెండితో దీపపాత్రయును బంగారముతో వత్తియును చేయించి ఆవునేతితోకూడ దానమిచ్చిన యెడల సమస్తకోరికలు సిద్ధించును.

శ్లో॥ క్షమాపయేత్తతో దేవం బ్రాహ్మణాన్భోజయేచ్ఛతమ్। ఏవంయః కురుతేపూజాం తస్యప్రీణామ్యహంమునే॥

తా॥ భగవంతుని క్షమార్పణముగోరి పిమ్మట నూరుగురు బ్రాహ్మణులను భుజింపవలయును ఓమునీశ్వరుఁడా యీప్రకారము పూజచేసిన వాని ననుగ్రహించెదను.

శ్లో॥ తత్రాపిశ్రావణేకుర్యాత్తద్దానంత్వాయకల్పతే। స్వప్రీత్యై

విషయఃకశ్చి త్పదార్థ స్త్యజ్యతేయది । మదర్పణధియాచాత్ర మాసి తస్యఫలంశృణు । ఇహాముత్రచతత్ప్రాప్తి ర్భవేల్లక్షగుణాధికా॥

తా॥ అదియుశ్రావణ మాసములో చేసిన యెడల విశేషఫలము నిచ్చునది యగును తనకునిష్టమగు పదార్థమును నాకునర్పణ పూర్వకముగా విడచి పెట్టిన యెడల వానియొక్క ఫలమునుజెప్పెదవినుము వదలివేసిన వస్తువును లక్షరెట్లు ఇహలోకపరలోకముల యందు పొందువాడగును

శ్లో॥ సకామత్వేతుచైవంస్యా న్నిష్కామత్వేపరాగతిః రుద్రాభిషేకంకుర్యాణ స్తత్రత్యాక్షరసంఖ్యయా ॥ ప్రత్యక్షరంకోటివర్షాం రుద్రలోకేమహీయతే।పంచామృతస్యాభిషేకాదమృతత్వంసమశ్నుతే॥

తా॥ కోరికలుగలవాడై చేసిన యెడల కోరికలు సిద్ధించును కోరిక రహితముగా చేసినయెడల నుత్తమలోకమును జెందును ఆ చెప్పఁబడిన మంత్రాక్షరసంఖ్య ప్రకారముగా రుద్రాభిషేకమును చేసినయెడల నొక్కొక్క యక్షరమునకు కోటి సంవత్సరములు నభిషేకముచేసిన జన్మరాహిత్యమును జెందును.

శ్లో॥ తస్మిన్మాసేభూమిశాయీ ఫలంతస్యాపిమేశృణు। ప్రవాళనిర్మితాంశ్రేష్ఠాం గజదంతభవామపి ॥ పటీరనిర్మితాంచాపి ఖచితాం నవరత్నకైః।నిస్త్రీమమృగపక్షీంద్రవిశేషాంద్విజసత్తమ॥రమ్యాంవస్త్రైణసంఛన్నాం మాలికాంచాత్ర శోభనామ్ । దశోపబర్హణైర్యుక్తాం శయ్యాం సలభతేశుభామ్ । రమ్యాంగనాసమాయుక్తాం రత్నదీపవిభూషితామ్ ॥

తా॥ ఆ శ్రావణమాసములో భూమియందే శయనించిన వానియొక్క ఫలమును జెప్పెదను వినుము పగడములు, ఏనుగుదంతములు, స్ఫటికలు, నవరత్నములు, మొదలగు వానిచే నిర్మింపబడినదియు మిక్కిలియందమైనపక్షిబొమ్మలచే నలంకరింపబడినదియు నో బ్రాహ్మణోత్తమా! రమ్య మగు వస్త్రముచే గప్పబడిన హంసతూలిక గలదియు, పది తలగడదిండ్లు గలదియు, సుందరమగు స్త్రీలతో గూడినదియు,రత్నదీపములతో నలంకరింప బడినదియు, శుభప్రదమైన శయ్యను పొందువాడగును.

శ్లో ॥ బ్రహ్మచర్యేణచాప్యత్ర వీర్యపుష్టిర్భవేద్ధ్రువా ॥ ఓజోబలం దేహదార్ఢ్యం యద్ధర్మస్యోప కారకమ్ । ప్రత్యక్షం వైభవేత్తస్య బ్రహ్మప్రాప్తిర్నసంశయః॥

తా॥ బ్రహ్మచర్య వ్రతమును జరిపిన యెడల దృఢమైన వీర్య పుష్టియు, తేజస్సును, ధర్మములు చేయుటకు నుపయుక్తమైన దేహబలమును ప్రత్యక్షము గానే పొందగలుగును జన్మానంతరమున మోక్షమును పొందువాడగును.

శ్లో॥ సకామస్యసకామస్య స్వర్గం దేవాంగనాశుభమ్। అత్ర మౌన వ్రతధరో మహాన్భుక్తా ప్రజాయతే ॥ అహోరాత్రి దినేచాపి భుక్తికాలే ధవాపునః॥

తా॥ రాత్రిగాని పగలు గాని లేక భోజనకాలమందు గాని మౌనవ్రతమును బూనిన వాడు కోరికలు గలవాడైనను లేనివాడయినను దేవతా స్త్రీలచే ప్రకాశించుచున్న స్వర్గలోక సుఖముల ననుభవించి పిమ్మట భూలోకములో మిక్కిలి సత్య సంధుడుగా జన్మించును

శ్లో॥ ఘంటాయాః పుస్తకస్యాపి వ్రతాంతేదాన మాచరేత్। సర్వశాస్త్రప్రవీణస్స్యాద్వేద వేదాంగపారగః। వాచస్పతిసమోబుద్ధా మౌన మాహాత్మ్యతోభవేత్ ॥ మౌనినః కలహోనాస్తి తస్మాన్మౌన వ్రతంపరమ్ ॥

తా॥ వ్రతమును పూర్తిజేసిన పిమ్మట ఘంటనుగాని పుస్తకమునుగాని దానమిచ్చిన యెడల మౌనవ్రత మహిమచే వేదములను వేదాంగములను జదివి సమస్త శాస్త్రములయందు నేర్పుగలవాడయి బృహస్పతి వంటి బుద్ధిగలవాడై యుండును మౌనముగానుండిన కలహము కలుగనేరదని చెప్పబడియున్నది గనుక నే మౌనవ్రతమును ముఖ్యముగా నాచరింపతగినది.

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాస మాహాత్మ్యే ఈశ్వర సనత్కుమార సంవాదే నక్తవ్రత లక్షపూజా భూమి శయనమౌనాది వ్రతకధనంనామ తృతీయోధ్యాయ స్సమాప్తః

---

## అథ చతుర్థోఽధ్యాయః.

ఈశ్వర ఉవాచ॥ శ్లో॥ సనత్కుమార వక్ష్యామి ధారణాపారణా వ్రతమ్। పుణ్యాహం వాచయేత్పూర్వ మారభ్య ప్రతిపద్దినమ్ ॥ సంకల్పయే న్మమప్రీత్యై ధారణాపారణావ్రతం। ఏకస్మిన్ధారణంకుర్యాత్పారణంచ తథాపరే ॥

తా ॥ ఈశ్వరుఁడు చెప్పుచున్నాడు ఓసనత్కుమారా! ధారణా పారణా వ్రతమును గురించి చెప్పెదవినుము శ్రావణశుద్ధ పాడ్యమియందు ముందుగా పుణ్యాహవాచముజేసి నాకుప్రీతి నిమిత్తమై ధారణా పారణా వ్రతమును గురించి సంకల్పము జేయవలయును అనఁగా నొకదినంబున ధారణయు మరుదినంబున పారణయు జరుపవలయును.

శ్లో॥ ఉపవాసోధారణేస్యాత్పారణేభోజనంభవే। సమాప్తే మాసిచైవాత్ర కుర్యాదుద్యాపనంవ్రతీ॥

తా ॥ ధారణ అనఁగా నుపవాసము జేయుట, పారణ అనఁగా భోజనము చేయుట, ఇట్లు మాసము పూర్తి కాఁగానే వ్రతము చేయువాఁడు ఉద్యాపనము చేయవలయును.

శ్లో ॥ సమాప్తే శ్రావణేమాసి పుణ్యాహంకారయేత్పురా। ఆచార్యంవరయేత్పశ్చాద్బ్రాహ్మణాంశ్చైవమానద ॥

తా ॥ ఓ మునీశ్వరా! శ్రావణ మాసము పూర్తియైన పిమ్మట ముందుగా పుణ్యాహవాచనము చేసి ఆచార్యునకు బ్రాహ్మణులకు వరుణల నియ్యవలెను.

శ్లో ॥ పార్వతీశంకరస్యాపి ప్రతిమాం స్వర్ణనిర్మితామ్। పూర్ణకుంభేతు సంస్థాప్య పూజయేన్నిశిభక్తితః॥

తా॥ బంగారముతో పార్వతీ పరమేశ్వరుల ప్రతిమను చేయించి పూర్ణకలశము నందుంచి రాత్రి వఱకు నుపవాసము చేసి భక్తి గలవాఁడయి రాత్రియందు పూజింపవలయును.

శ్లో ॥ రాత్రౌజాగరణంకుర్యాత్పురాణ శ్రవణాదిభిః। ప్రాతరగ్నింసమాధాయ హోమంకుర్యాద్యథావిధి॥

తా॥ పురాణ పఠనము మొదలగు వానిచే రాత్రి యంతయు జాగరణముచేసి ప్రాతఃకాలమున నగ్ని హోత్రమునుంచి యథావిధిగా హోమములను చేయవలెను.

శ్లో॥ త్ర్యంబకేనైవ మంత్రేణ జుహుయాచ్ఛతికాదనమ్। తథైవ శివగాయత్ర్యా జుహుయాచ్ఛఘృతౌదనమ్ ॥

తా॥ త్ర్యంబకమను మంత్రముచే నువ్వులు కలిపిన యన్నముతోను శివగాయత్రీ మంత్రముచే నెయ్యి కలిపిన యన్నముతోను హోమమునుచేయవలెను.

శ్లో॥ షడక్షరేణమంత్రేణ పాయసంజుహుయాత్తతః। పూర్ణాహుతింతతోహుత్వా హోమశేషంసమాపయేత్ ॥

తా॥ ఆఱుఅక్షరములు గల శివసంబంధ మగుమంత్రముచే పరమాన్నమును హోమముచేసి పిమ్మట పూర్ణాహుతి హోమమును చేసి మఱియు మిగిలిన హోమములన్నియు చేయవలెను.

శ్లో॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చా దాచార్యంచైవపూజయేత్। ఏవంకృత్వా మహాభాగ బ్రహ్మహత్యాది పాతకైః॥ ముచ్యతేనాత్ర సందేహ స్తస్మాత్కుర్యాన్మహావ్రతమ్। శృణుమాసోపవాసస్య శ్రావణేవిధి మాదరాత్ ॥

తా॥ ఓ మహానుభావా! అనంతరము బ్రాహ్మణులను భుజింపఁ జేయవలెను. పిమ్మట స్వశక్తి కొలది నాచార్యుని పూజింపవలయును, ఇట్లుచేసినయెడల బ్రహ్మహత్య మొదలగు గొప్ప పాపములన్నియు నశించును దీని విషయమై సందేహ మేమియునులేదు, అందువలన ఈగొప్పవ్రతము తప్పక చేయవలయును, శ్రావణ మాసమునందు నెలదినము లుపవాసము చేయునట్టి విధానము జెప్పెదను శ్రద్ధతో వినుము.

శ్లో॥ సంకల్పయేత్తుంప్రతిపద్దినే ప్రాతర్వ్రతింమునే। నారీవాపురుషోవాపి సంయతాత్మాజితేంద్రియః॥ తతోర్చయే దమాయాంతు శంకరంలోకశంకరం। సంపూజయేత్షోడశభి రుపచారై ర్వృషధ్వజం॥

తా॥ ఓ మునీశ్వరుడా! పురుషుడుగాని, స్త్రీగాని, శ్రావణశుద్ధ పాడ్యమి యందు సంకల్పము చేసి వ్రతము నారంభించి చేయుచు నింద్రియములను జయించి స్థిరచిత్తము గలవాడై పిమ్మట నమావాస్యయందు లోకములకు సుఖమును చేయునట్టి సాంబమూర్తిని షోడశోప చారములచే పూజింపవలెను.

శ్లో॥ బ్రాహ్మణాన్పూజయేద్భక్త్యా వస్త్రాలంకరణాదిభిః। భోజయేచ్చ యథాశక్త్యా ప్రణిపత్యవిసర్జయేత్ ॥

తా॥ భక్తిచే బ్రాహ్మణులకు వస్త్రములు అలంకారముల నిచ్చి పూజించి తన శక్తికొలదియు భోజనం పెట్టి నమస్కారములనుచేసి వారినిపంపవలెను.

శ్లో॥ ఏవంమాసోపవాసస్తు మమప్రీతికరోభవేత్ । రుద్రవర్తి విధానంచ సంఖ్యాతంలక్షసంఖ్యయా॥

తా॥ ఇట్లు మాసోపవాస వ్రతము చేసినయెడల నాకు ప్రియమైన దగును, రుద్రవర్తివిధానమును చెప్పెద వినుము లక్షసంఖ్యగల వర్తులనుచేయవలెను.

శ్లో॥ శృణుష్వావహితోభూత్వా సర్వసిద్ధికరంన్నృణాం। కార్పాసతంతుభిః కార్యా ఏకాదశభిరాదరాత్॥

తా॥ సర్వజనులకు ఫలమును కలిగింపచేసి యీ వ్రతమును గురించిచెప్పెదను వినుము ప్రత్తిగారంతో పదు నొకండు వర్తులనుచేసి యా దారముతో రుద్రునకు నీరాజన మివ్వవలయును.

శ్లో॥ వర్తయస్తారుద్రవర్తీకా సంజ్ఞాప్రీతికరామమ। శ్రావణస్యాద్యదివసే సంకల్ప్యవిధిపూర్వకమ్ ॥ దేవదేవం మహాదేవం లక్షవర్తిభిరాదరాత్। నీరాజయామిగౌరీశం శ్రావణేమాసిభక్తితః ॥

తా॥ పదునొకండు వత్తులతో చేసిన యెడల నాకు ప్రీతి కలుగును శ్రావణ మాసంలో శుద్ధపాడ్యమియందు యథావిధిగా సంకల్పంచేసి భక్తిపూర్వకంగా దేవ దేవుడగు సాంబమూర్తికి లక్ష వత్తులతో శ్రావణ మాసము నందు నీరాజన మిచ్చుచున్నానని మనస్సునందు నిశ్చయించేసికొని యాచరింపవలెను.

శ్లో॥ పూజయిత్వాప్రతిదినం వర్తీనాంతుసహస్రతః।నీరాజయే దంత్యదినే సహస్రాణ్యేకసప్తతిః॥

తా॥ ప్రతిదినము సాంబమూర్తిని పూజింపుచు వెయ్యివత్తులతో నీరాజన మివ్వవలయును, చివర దినమునందు డెబ్బైయొక్క వేల వత్తులతో నీరాజనమివ్వవలయును.

శ్లో॥ అథవాప్రత్యహందద్యాత్సహస్రత్రియమాదృతః। చరమేతుదినేదద్యాత్సహస్రాణిత్రయోదశ॥

తా॥ లేక మతియొక పక్షమునందు నిత్యము మూడువేల వత్తులతో నీరాజన మిచ్చుచు చివరదినమునందు పదమూడు వేల వత్తులతోనైనా నీరాజనమివ్వవలెను.

శ్లో॥ ఏకస్మిన్వా దినేరుద్ర వర్తిలక్షం ప్రదీపయేత్ । సుఘృతే నాపిబహులా సిద్ధాస్తామమవల్లభాః । పూజయిత్వాతువిశ్వేశం శృణుయాచ్చకథాంతతః॥

తా॥ నాకుప్రీతికరమైనవియు మృదువైనవత్తులను విశేషమగు ఆవు నేతితో తడిపి లక్షవత్తుల నొక్కదినమందైనా వెలిగింపవచ్చును ఈ విధముగా సాంబమూర్తిని పూజించి యనంతరం కథను వినవలయును

సనత్కుమారఉవాచ ॥ శ్లో॥ దేవదేవ జగన్నాథ జగదానంద కారక । వ్రతస్యాస్యప్రభావం మే కృపాంకృత్వావదప్రభో ॥ కేనచీర్ణం వ్రతమిదం విధిరుద్యాపనేకథమ్॥

తా॥ దేవతలకు దేవుడవును, ప్రపంచమునకు సంతోషమును కలిగించు వట్టి దొరా ప్రభువా ! నాయందు దయయుంచి పూర్వమున ఈ వ్రతము దీనికి నుద్యాపనం చేయుటెట్లో యీ మొదలగు విషయములను జెప్పి యీ వ్రతమహిమను నాకు జెప్పుమని సనత్కుమారుఁడు సాంబమూర్తినడిగెను.

శ్లో॥ శృణువై ధాత్రయత్నేన వ్రితానాముత్తమంవ్రతం। రుద్రవర్త్యామహాపుణ్యాం సర్వోపద్రవనాశనమ్॥ ప్రీతిసౌభాగ్యజననం పుత్రపౌత్రసమృద్ధిదమ్। శంకరప్రీతిజననం శివలోకప్రదంపరమ్॥ రుద్రవర్తిసమంనాస్తి త్రిషులోకేషు సువ్రతం । అత్రైవోదాహరంతీమమితిహాసం పురాతనమ్॥

తా॥ ఈశ్వరుడు చెప్పుచున్నాడు ఓ మునీశ్వరా! బ్రహ్మయత్నముచే నేర్పడినదియు, వ్రతములలో శ్రేష్ఠ మయినదియు, మిక్కిలి పుణ్యకర మైనదియు, సర్వకష్టములను పోగొట్టునదియు, సంతోషమును మంచియోగ్యత నిచ్చునదియు, పుత్రులను పౌత్రులను వృద్ధినొందించునదియు, సాంబమూర్తికి సంతోషమునుకలిగించునదియు యుత్కృష్టమైన కైలాసస్థానము నొసగు నదియు నగు రుద్రవర్తి యను వ్రతముతో సమానముగు వ్రతం మూడులోకములలో నెచ్చటను లేదు, కాఁబట్టి యీ వ్రతమును గురించి పూర్వం జరిగిన కథ నొక దానిని చెప్పెదను సావధాన మనస్సు గలవాడవై వినుము.

శ్లో॥ క్షిప్రానద్యాస్తటేరమ్యా పురీఉజ్జయినీశుభా। తస్యామాసీత్సుగంధాఖ్యా వారస్త్రీహ్యతిసుందరీ॥

తా ॥ పూర్వకాలమున క్షిప్రయను నదీతీరమందు శుభప్రదమగు ఉజ్జయిని యను పట్టణం కలదు ఆ పట్టణంలో విశేష సౌందర్యము గల సుగంధయను వేశ్యా స్త్రీగలదు.

శ్లో॥ తయాశుల్కః కృతః స్వీయే సురతే తు సుదుస్సహం। సువర్ణానాం శతం లోకే ప్రతిజ్ఞాం కృత వత్యథ ॥

తా॥ తనతో సంభోగింప వలెనను కోరువారు తనకు నూరు మాడల నిచ్చిన యెడల నంగీకరింతునని యా భోగంస్త్రీ నందరికి తెలియపరచెను.

శ్లో ॥ యువానశ్చ తయా విప్ర భ్రంశితాశ్చ సుగంధయా। రాజానో రాజ పుత్రాశ్చ నగ్నీకృత్య పునః పునః॥

తా॥ ఓ మునీశ్వరా ! సుగంధయను యాభోగంస్త్రీ, వయస్సున నుండి తన యందు నభిలాషముగల రాజులను, రాచకొమాళ్లను, తనకు స్వాధీనము జేసికొని వారివద్దనుండు ధనమంతయు దీసికొని దరిద్రులుగాను, దిగంబరులనుగా జేసి మాటి మాటికి పంపుచుండెను.

శ్లో ॥ తేషాం భూషాః గృహీత్వా తు ధిక్కృతాస్తు సుగంధయా। ఏవం హి బహవో లోకా లుంఠితాస్తే సుగంధయా ॥

తా ॥ ఆసుగంధ తనవద్దకు వచ్చిన వారియొక్క ఆభరణములనుకూడ తీసికొని వారిని తిరస్కరించి పంపుచుండెను ఈప్రకారము అనేకజనులు సుగంధచే వంచింపబడిరి.

శ్లో॥ తస్యాస్తు దేహగంధేన క్రోశమాత్రం సుగంధితం । రూపలావణ్యకాంతీనాం సా ప్రతిష్ఠాధరాతలే॥

తా ॥ దానియొక్క దేహసంబంధమైన పరిమళము యొకక్రోశెడు దూరము వరకు పరిమళించును సౌందర్యము కాంతి మొదలగు గుణములుగల యాస్త్రీతో సమానమైన స్త్రీ భూలోకము నందెచ్చటను లేదు.

శ్లో॥ షట్త్రింశద్రాగ భార్యాణాం షడ్రాగాణాంచ గాయనే। తత్సంతత్యోః ప్రియానంతాశ్చ కుశలా గానకర్మణి ॥

తా ॥ ఆరురాగములు, ముప్పదియారు ఆరాగములగల, భార్యలుగల రాగములను, పాడుటయందు ఆమెయు, ఆమెయొక్క, సంతానము వంశీకులు, మొదలగు వారందఱును సమర్థులు.

శ్లో॥ నృత్యైరంభాదికాస్సర్వా స్త్రజ్ఞాయంతీ సురాంగనాః। గత్యాగజాంశ్చహంసాంశ్చ విహసంతీపదేపదే॥

తా॥ నాట్యమునందు రంభ మొదలగు సమస్త దేవతా స్త్రీలను తిరస్కరించునది నడకచే నేనుగులను, హంసలను ప్రతియడుగు నందును ఆక్షేపించుచుండును.

శ్లో॥ కామబాణాన్ ప్రేరయంతీ కటాక్షైర్భ్రూవి కృంతైశ్చతైః। కదాచిత్సాగతాక్షిప్రాం కౌతుకాదిష్టమానసా॥

తా॥ దానియొక్క చూపులచేతను ప్రతివారియందును మన్మథబాణములను ప్రయోగించి మోహపెట్టుచుండెను ఇట్లుకొంతకాలము వెళ్లగా నొకప్పుడు క్షిప్రానదిని చూడవలెనని కోరికగలిగి యానదియొద్దకు వెళ్లెను.

శ్లో॥ దదర్శసామనోరమ్యా మృషిభిఃపరిసేవితామ్। కేచిద్ధ్యానపరావిప్రాః కేచిజ్జపపరాయణాః॥ రతాశ్శివార్చనే కేచి ద్విష్ణోః కేచిత్ప్రపూజనే। తేషాంమధ్యేవశిష్ఠోహి తయాదృష్టోమహామునే॥

తా॥ ఓమునీశ్వరుఁడా! మునీశ్వరులచే సేవింపబడుచుండెడి యానదిని చూడఁగా నచ్చటకొందఱు మునులు ధ్యానముచేయువారును, మఱికొందఱు జపముచేయువారును, కొందఱు శివుని పూజించువారును, కొందఱు విష్ణువును పూజించువారునై యుండిరి వారిలో వశిష్టమహామునిని యాస్త్రీజూచెను.

శ్లో॥ తస్యాధమేణభవేద్బుద్ధి స్తద్దర్శనమహాత్మ్యతః। విగతాశాజీవనేతి విషయేష్వవిశేషతః॥ వినమ్రకం ధరాభూత్వా ప్రణిపత్యపునః పునః। స్వకర్మపరిహారాయ పప్రచ్ఛమునిపుంగవమ్॥

తా॥ ఆవేశ్యాస్త్రీకి వశిష్ఠమహామునిని చూచినంతమాత్రమున ధర్మమాచరింపవలయునని బుద్ధిగలిగి జీవనమునందును భోగములయందును వాంఛవదలిపెట్టి శిరస్సునువంచి వినయవిధేయతలతోగూడి యామునీశ్వరునకు నమస్కరించి తాను జేసిన దుష్టకర్మలను నశింపుజేసి కొనుటకు నుపాయము అవశిష్టమహామునినడిగెను.

సుగంధోవాచ॥ శ్లో॥ అనాధనాథవిప్రేంద్ర సర్వవిద్యావిశారద। మయాకృతానిపాపాని యోగీశసుబహూన్యపి॥ తత్సర్వపాపనాశాయ ఉపాయంబ్రూహిమేప్రభో॥

తా ॥ దిక్కులేనివారలను రక్షించువాడవును సమస్త విశ్వములయందు సమర్థుడవునగు యోబ్రాహ్మణోత్తమా! నేనుయిదివరలో ననేకపాపములను జేసితిని ఆసమస్తపాపములు నశించునట్టి యుపాయమును జెప్పుమని సుగంధయడిగెను.

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ ఏవముక్తస్తయావిప్రో వసిష్ఠోమునిరబ్రవీత్। తస్యాఃకర్మసవిజ్ఞాయ సోఽబ్రవీద్దీనవత్సలః॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాఁడు ఇట్లుభోగముస్త్రీయడుగగా నేదాని యొక్కకర్మమును దెలిసికొనినవాఁడై దీనులయందు దయాస్వభావముగల వశిష్ఠమహామునియిట్లు చెప్పుచున్నాఁడు.

వసిష్ఠఉవాచ ॥ శ్లో ॥ శృణుష్వావహితా భూత్వా తవపాపస్యసంక్షయః। యేనపుణ్యేనజాయేత తత్సర్వంతథయామి తే ॥

తా ॥ వసిష్ఠమహాముని చెప్పుచున్నాఁడు ఓచిన్నదానా! ఏపుణ్యము జేసిన నీవుజేసిన పాపములన్నియు నశించునో అట్టిధర్మముల నన్నియు జెప్పెదను సావధాన మనస్సుగలదానవై వినుము,

శ్లో॥ గచ్ఛవారాణసీంభద్రే త్రిషులోకేషువిశ్రుతాం। గత్వా కురుష్వతత్ క్షేత్రే వ్రతంత్రైలోక్యదుర్లభమ్॥

తా ॥ ఓచిన్నదానా! మూడులోకములయందును మిక్కిలి పుణ్యక్షేత్రమని ప్రసిద్ధికెక్కిన కాశీపట్టణమునకువెళ్లి నచ్చట నిదివరలో నెవరికిని సాధ్యముగాని వ్రతమును జెప్పెదను దానినిజేయుము.

శ్లో॥ రుద్రవర్త్యామహాపుణ్యాం శివప్రీతికరంపరమ్।కృత్వావ్రతమిదం భద్రేప్రాప్స్యసిత్వంపరాంగతిమ్।

తా ॥ ఓమంగళస్వభావులారా! మిక్కిలిపుణ్యప్రదమైనదియు శివునకుప్రీతికరమైన రుద్రవర్తినను వ్రతమును చేసినయెడల నీవు యుత్తమమైన లోకమును పొందగలవు.

శ్లో॥ తతస్సాకోసమాదాయ భృత్యంచైవసుమిత్రకమ్। గత్వా కాశీంవ్రతంచక్రే వసిష్ఠోక్తవిధానతః॥

తా ॥ అనంతరమాచిన్నది తనకుకావలసినంత ధనమునుతీసికొని మిక్కిలి పరమాప్తుఁడైన భృత్యునితోగూడ కాశీ పట్టణము నకువెళ్లి వశిష్ఠ మునీశ్వరుఁడు చెప్పినరీతిగా వ్రతమునుజేసెను.

శ్లో॥ తతస్సానశరీరేణ తస్మిఁల్లింగేలయంయయౌ ॥

తా ॥ అనంతరమాచిన్నది శరీరముతో కూడ లింగము నంథై క్యమయ్యెను.

శ్లో॥ ఏవంయఃకురుతేనారీ వ్రతమేతత్సుదుర్లభమ్। యంయం చింతయతేకామం తంతంప్రాప్నోత్యసంశయః ॥

తా ॥ ఇతరులకు సాధ్యముగాని యిట్టి వ్రతము నాచరించినవారు మనస్సున తలచిన కోరికలన్నియు పొందగలరు.

శ్లో॥ మాహాత్మ్యంశృణుమాణిక్యవర్తీనామపిసువ్రత। వర్తేన తాసాంవిప్రేంద్ర మదదాణసనభాగినీ॥

తా॥ మాణిక్యములను కూడ వత్తులకు చేర్చి దీపములను వెలిగించిన యెడల ఓయో మునీశ్వరా! అట్టివ్రతము చేత నాలోకమునకు వచ్చినా సింహాసనము నందు కూర్చుండు వాడగును.

శ్లో॥ జాయతేమమప్రియాసాహి యావదాభూతసంప్లవం।ఉద్యాపనమథోవక్ష్యే వ్రతసంపూర్ణహేతవే ॥

తా ॥ ఇట్టి వ్రతమును చేసినస్త్రీ ప్రళయమయ్యే వఱకు నాకు ప్రియమైన దగును మరియువ్రతము సంపూర్తినొందుటకు నుద్యాపన విధిని చెప్పెదవినుము,

శ్లో॥ కలశేస్థాపయేద్దేవ ముమయాసహితంశివమ్ । సువర్ణ నిర్మితందేవం వృషభంరౌప్యనిర్మితమ్॥

తా ॥ బంగారముతో సాంబమూర్తి, పార్వతీప్రతిమను, వెండితో వృషభ ప్రతిమన్ను, చేయించి కలశమునందుంచవలయును.

శ్లో॥ విధినాపూజనంకృత్వా రాత్రౌజాగరణంచరేత్ । తతః ప్రభాతేవిమలేస్నాత్వా నద్యాంవిధానతః ॥ ఆచార్యంవరయేద్భక్త్యా ద్విజైరేకాదశైస్సహ । హోమశ్చైవ ప్రకర్తవ్యో ఘృతపాయసబిల్వకైః॥ రుద్రసూక్తేనగాయత్ర్యా మూలమంత్రేణ వాపునః । తతః పూర్ణాహుతింహుత్వా ఆచార్యాదీన్ప్రపూజయేత్ ॥

తా ॥ యథావిధిగా పూజించి రాత్రియంతయు జాగరణముతో వెళ్లబుచ్చ వలయును అనంతరము తెల్లవారగానే నదికి వెళ్లి నిర్మలమగు నీటిలో యథావిధిగా స్నానంచేసి భక్తికలిగి ఆచార్యుని మఱియు పదునొకండు జనులఁ చేయు బ్రాహ్మణులను నియమించి రుద్ర సూక్తము గాయత్రీ మూల మంత్రముల నుచ్ఛరించుచు

నెయ్యి పరమాన్నము మారేడు దళములు మొదలగు వానిచే హోమము చేసి యనంతరము హోమ సంపూర్తిగా కరమైన పూర్ణాహుతిని చేసి యాచార్యుడు మొదలగు ఋత్విక్కులను పూజింప వలయును.

శ్లో॥ తద్వై కాదశసద్విప్రాన్స పత్నీకాం స్తుభోజనమ్। ఏవంయాకురు తేనారి సర్వపాపైఃప్రముచ్యతే।

తా॥ అనంతరము పదునొకండు బ్రాహ్మణులను భార్యలతో కూడ భుజింప చేయవలయును, యిట్లు యాచరించిన స్త్రీ సమస్త పాపముల వలన విడువ బడును.

శ్లో॥ కథాంశ్రుత్వావిధానేన స్థాప్యంసర్వంన్య వేదయేత్ ।అశ్వమేధసహస్రస్య ఫలంభవతినిశ్చితమ్ ॥

తా॥ అనంతరము యధా విధిగా కథను విని యచ్చట నావాహనము చేయబడిన మంటపము నంతయూ నాచార్యున కొసంగ వలయును ఈ ప్రకార మాచరించిన వారికి అశ్వమేధమను యజ్ఞము చేసినంత ఫలంగలుగును సందేహంలేదు.

ఇతి స్కాందపురాణే శ్రావణమాస మాహాత్మ్యే ఈశ్వర

సనత్కుమార సంవాదే ధారణాపారణావ్రతోప

వాస రుద్రవర్తికధనంనామ చతుర్థోధ్యాయ

స్సమాప్తః.

---

అధ పంచమోధ్యాయః.

ఈశ్వర ఉవాచ ॥ శ్లో॥ మాహాత్మ్యంకోటిలింగానాం పుణ్యం వక్తుంనశక్యతే। ఏకైకస్యాపిలింగస్య కింపునఃకోటిసంఖ్యయా ॥

తా॥ సాంబమూర్తిగా చెప్పుచున్నాడు కోటి లింగముల యొక్క మహిమను చెప్పెదను వినుడు ఒక్క లింగము యొక్క మహిమను చెప్పడము సాధ్యము కాకయుండగా కోటిలింగముల యొక్క మహిమను చెప్పుటకు నెట్లు సాధ్యమగును.

శ్లో॥ అశక్తోలక్షకంకుర్యా త్సహస్రమధవాశతమ్। ఏకస్యాపిహి లింగస్య కారణా న్మమసన్నిధిః॥

తా॥ కోటి లింగములను పూజించుటకు సమర్థతలేని పక్షమున లక్ష లింగములను గాని వేయిలింగములను గాని నూఱు లింగములను గాని లేక ఒక్క లింగమును గాని పూజించినయెడల నాలోకములో నాసమీపమున నుండగలడు.

శ్లో॥ షడక్షరేణ మంత్రేణ పూజాకార్యా స్మరద్విషః । ఉపచారైః షోడశభిర్భక్తియుక్తేనచేతసా ॥

తా॥ ఆఱుఅక్షరములు గల యీశ్వరుని సంబధమగు మంత్రముచే భక్తి, శ్రద్ధలుగలిగిన మనస్సులో గూడిన వాడై సాంబమూర్తిని పూజింపవలయును.

శ్లో॥ ఉద్యాపనంచకర్తవ్యం గ్రహయజ్ఞపురస్సరమ్ । సంపాదనీయోహోమశ్చ బ్రాహ్మణాంశ్చైవభోజయేత్ ॥

తా॥ నవగ్రహములను గుఱించి హోమము చేసి యనంతరము ఉద్యాపనము చేయవలయును అనంతరము బ్రాహ్మణులకూడ భుజింపచేయవలయును.

శ్లో॥ నాకాలమరణంతస్య వంధ్యత్వహరణం పరమ్ । సర్వాపత్తిక్షయకరం సర్వసంపత్ప్రవర్ధనమ్ ॥ ప్రేత్యకైలాసవాసశ్చ ఆకల్పంమమసన్నిధౌ। పంచామృతాభిషేకంచ యఃకుర్యాచ్ఛ్రావణేనరః॥

తా॥ శ్రావణ మాసములో శివుని పంచామృతముల చే నభిషేకము చేసిన వానికి అకాలమృత్యువులేకపోవుటయు సంతానవంతుడుగా నుండుటయు సమస్త విపత్తులునశించుటయు సమస్తఐశ్వర్యములు వృద్ధిపొందుటయు గలిగి సర్వకాలముల యందును నాసన్నిధానమున నుండగలడు.

శ్లో॥ సపంచామృతభోజీస్యాత్ సంపన్నోగోధనేనచ । అత్యంతమధురాలాపీ ప్రియశ్చత్రిపురద్విషః॥

తా॥ అట్టి వాడు నిత్యము పంచామృతములతో భుజించు వాడును గోవుల సంపత్తు గలవాడును. మిక్కిలి మనోహరముగ సంభాషించు వాడును, సాంబమూర్తికి ప్రియమైనవాడు నగును.

శ్లో॥ అనోదనవ్రతీచైవ హవిష్యాశీచయోనరః। వ్రీహ్యాదిసర్వధాన్యానా మక్షయోసౌనిధిర్భవేత్ ॥

తా॥ అన్నమును భుజింపక హోమమును చేయుగా మిగిలిన హవిస్సును భుజించినవాడు వ్రీహులు మొదలగు సమస్త ధాన్య ములతో నెల్లప్పుడు నిండి యుండు వాడు అగును.

శ్లో॥ పత్త్ర్యావల్యాంతు భుంజాన స్స్వర్ణభాజనభోజనః। శాక వర్జనతస్స్యాద్వై శకకర్తా నరోత్తమః॥

తా॥ విస్తర్లయందు భుజించినవాడు బంగారు పాత్రలయందు భుజించువాడగును కూరను వదలివేసిన వాడు విక్రమార్కుడు మొదలగువారి వంటి శకములను చేయురాజగును.

శ్లో॥ కేవలంభూమిశాయీతు కైలాసేవాస మాప్నుయాత్। ప్రాతస్స్నానాన్నభోమాసి అబ్దతత్ఫలభాజ్యతః॥

తా॥ భూమియందు శయనించిన యెడల కైలాసము పొందగలడు శ్రావణ మాసములో ప్రాతః కాలమున స్నానము చేసిన యెడల సంవత్సరము చేసినఫలము పొందును.

శ్లో॥ జితేంద్రియతుత్వాస్మాసేస్మి న్బలమైంద్రియకంభవేత్।

తా॥ ఈ మాసములో నింద్రియములజయించి వాడయ్యెనేని ఇంద్రియములకు బలము కలవాడగును

శ్లో॥ స్ఫాటికేరాజతేస్వర్ణే మార్త్స్నే మారకతేపివా। స్వయంభూవా స్థాపితేవా పైష్టేధాతు మయేపివా॥ చందనే గావ నీతేవా స్యన్యస్మిన్వాపిలింగకే॥ సకృత్పూజాం ప్రకుర్వాణో బ్రహ్మహత్యా శతంహరేత్। సూర్యచంద్రోపరాగేషు సిద్ధిః క్షేత్రేషు వాక్వచిత్॥

తా॥ స్ఫటికము, వెండి, బంగారు, మట్టి మొదలగు వానితో చేర్పడిన లింగముగాని మరకతముగాని లేక స్వయముగ పుట్టినదియు లేక చేయబడినదియు, లేక మరియొక ధాతువులు మంచిగంధము నవనీతము మొదలగు వానితో చేయబడినదిగాని యేలింగమందైనను ఒక్కసారి పూజించిననాడు అనేక బ్రహ్మహత్యాది పాపములను పోగొట్టుకొన్న వాడగును, సూర్యచంద్ర గ్రహణములయందును పుణ్యక్షేత్రములయందును మంత్రములను జపించిన సిద్ధికలది యగును.

శ్లో॥ సిద్ధిర్వ్యాలక్షజాప్యేన సకృత్స్యాజ్జపతోత్రిసా। వస్యకాలే కృతాహోన్యూర్నమస్కారాఃప్రదక్షిణాః॥ సహస్రేణ ఫలంయత్స్యాత్ స్మాసేస్మిన్నేకవారతః॥

తా॥ పూర్వమున చెప్పబడినట్టి సమయముల యందు నొక్కసారి జపము చేసినయెడల లక్ష పర్యాయములు జపముచేసిన ఫలము కలుగును, మరియు ఈ శ్రా

వణ మాసములో నొక్క పర్యాయము జపించిన యెడల నితర కాలముల యందు వేయి పర్యాయములు చేసినంత ఫలము కలుగును ఆ ప్రకారమే నమస్కారములు ప్రదక్షిణలు కూడ ఫలము నిచ్చునవియగును.

శ్లో॥ మత్ప్రియే శ్రావణేమాసి వేదపారాయణేకృతే। సర్వేషాం వేదమంత్రాణాం సిద్ధిస్స్యాత్ప్రజాయతే। మాసేస్మిన్ పౌరుషంసూక్తం జపేచ్ఛ్రద్ధయాన్వితః ॥ కృత్వాక్షసంఖ్యా సహస్రంతు కలౌస్యాత్తుచతుర్గుణమ్। వర్ణానాంసంఖ్యయావాపి శతంకుర్యాత్తంద్రితః ॥

తా॥ నాకు ప్రీతి కరమైన శ్రావణ మాసములో వేద పారాయణము చేసిన యెడల సమస్త వేద మంత్రములు సిద్ధి కలవి యగును ఈ మాసములో శ్రద్ధ కలిగి పురుషసూక్త మెన్ని యక్షరములు కలిగియున్నదో అన్ని వేల పర్యాయములు పఠించిన యెడల కలియుగములో నాలుగురెట్లు ఫలము గలదియగును లేక యెన్ని యక్షరములు కలిగియుండునో అన్ని వందల పర్యాయములు చేయవలెను.

శ్లో॥ అశక్తసంఖ్యయాకర్తుం శతమావేశనవాడపేత్ । బ్రహ్మహత్యాదిపాపేభ్యో ముచ్యతేనాత్రిసంశయః॥

తా॥ అన్ని పర్యాయములు చేయుటకు సమర్థుడు కానియెడల నూరుపర్యాయములు పఠించినయెడల బ్రహ్మహత్య మొదలగు సమస్త పాపముల వలనను విడువబడును సందేహము లేదు.

శ్లో॥ గురుతల్పేకృతేపాపే ప్రాయశ్చిత్తమిదంపరమ్ । నాస్త్యేతత్సదృశంపుణ్యం పవిత్రంపాపనాశనమ్॥

తా॥ గురుభార్యా సంభోగము చేసినవానికి ఇది మిక్కిలి ప్రాయశ్చిత్తముగా చెప్పబడినది గాన దీనితో సమాన మైనదియు, పవిత్ర మైనదియు, పాప ములను పోగొట్టునదియు మఱియొకటి లేదు.

శ్లో॥ వినాపౌరుషజాప్యేన నవమేదేకమప్యహమ్। అథవాదమిదంబ్రూయాత్సనరోనిరయీభవేత్ ॥

తా॥ ఒక్క దిన మయినను పురుషసూక్త పఠనము లేకుండా వెళ్ల బుచ్చరాదు అది అసత్య మని చెప్పినవాడు అనేక జన్మముల పర్యంతము నరక మును పొందువాడగును.

శ్లో॥ గ్రహాయజ్ఞః ప్రకర్తవ్య స్సమిచ్చరుతిలాజ్యకైః। ధూపగంధప్రసూనాది నైవేద్యాదిపరిశేషతః।

తా॥ ధూపము, గంధము, పుష్పములు, మొదలగువానిచే పూజించి నైవేద్యమును చేసి పిమ్మట సమిధలు అన్నము తిలలు ఆజ్యము మొదలగు వానిచే గ్రహములను గురించి హోమము చేసిన యెడల గ్రహయజ్ఞమని చెప్పబడును

శ్లో॥ తద్రూపాణాంచ ధ్యానాది సంపాద్యచ యథావిధిః। కోటిహోమో లక్షహోమో యుతహోమ స్తుశక్తితః। తైర్వ్యాహృతిభిః కార్యో గ్రహయజ్ఞోభిధోప్యసౌ।

తా॥ ఆ గ్రహముల రూప ప్రకారముగా ధ్యానము చేసి యథా విధిగా కోటి పర్యాయములుగాని, లక్ష పర్యాయములుగాని, పదివేల పర్యాయములుగాని, తన శక్తికొలది వ్యాహృతుల నుచ్చరింపుచు తిలలతో హోమము చేసిన గ్రహయజ్ఞమని చెప్పబడుచున్నది అందువలన నుత్తము లోకములను పొందగలరు.

శ్లో॥ అథవక్ష్యామివారాణాం వ్రతాని శ్రుణుసాంప్రతమ్ ॥

తా॥ యింకను వారముల గురించి చేయువ్రతము చెప్పెదను వినుము.

శ్లో॥ తత్రాదౌరవివారస్య వ్రతంవక్ష్యామితేనఘ। అత్రాపుణ్యదాహరంతీమ మితిహాసంపురాతనమ్ ॥

తా॥ ఓ పుణ్యాత్మా! ఆ వారములలో మొదటిదగు నాదివారమును గురించి చెప్పెదను వినుము మరియు నిందును గురించి పూర్వము జరిగిన యొకకథను చెప్పెదను వినుము.

శ్లో॥ ప్రతిష్ఠానపురేరమ్యే సుకర్మనామవైద్విజః। ఆసీద్దరిద్రః కృపణోభైక్ష్య చర్యాపరాయణః॥

తా॥ పూర్వకాలమున ప్రతిష్ఠా నగరమందు దరిద్రుడును కుచ్చిత స్వభావుడును భిక్షముచే జీవించు వాడునగు సుకర్ముడను బ్రాహ్మణుడు కలడు

శ్లో॥ ఏకదాసగతో ధాన్యం యాచితుంపర్యటన్పురమ్। స్త్రియోదదర్శసదనే కస్యచిద్గృహమేధినః॥ చరంతోర్కరవివారస్య మిలితావ్రతముత్తమమ్। తదోచుస్తాశ్చతంగృష్ట్వా ఆచ్ఛాదయుతసత్వరమ్॥

తా॥ ఒకానొకప్పుడా బ్రాహ్మణుడు భిక్షముచే ధాన్యమును సంపాదించుటకు నా పట్టణములో దిరుగుచుండగా నొక గృహస్థునింట కొందరు స్త్రీలు కలిసి

యాదివార వ్రతమును చేయుచున్నవారలై యచ్చటకు వచ్చిన బ్రాహ్మణునిచూచి యీ బ్రాహ్మణునకు పూజావిధిని కనుపరచ గూడదని యా స్త్రీ లనుకొనిరి.

శ్లో॥ పూజావిధింతతోవిప్రః ప్రార్థయామాస తాః స్త్రియః। ఛాద్యతేకింనుభోః సాధ్వ్యః భవతీభిరిదం వ్రతమ్। కథయధ్వం కృపాం కృత్వా మమోపరి దయాళవః। పరోపకార సదృశోధర్మో నాస్తి జగత్త్రయే॥

తా॥ ఆ స్త్రీలు పూజా విధిని కనుపరచక పోవుటచే ఓ నారీమణులారా! మీరలు చేయుచుండెడి వ్రతమును నేను జూడకుండగ జేసితిరి ఏమి కారణము దయా స్వభావము గల మీరలు నాయందు దయనుంచి చెప్ప వలయును మూడు లోకముల యందును పరోప కారముతో సమానమగు ధర్మంలేదు అని బ్రాహ్మణుడా స్త్రీల నను ప్రార్థించెను.

శ్లో॥ సాధూనాం సమచిత్తానాం పరార్థస్స్వార్థ ఏవహి। దరిద్రపీడితశ్చాహం శ్రుత్వేతం వ్రతముత్తమ్॥ చరిష్యామి వ్రతంబ్రూత ఫలంచాస్య వ్రతస్యహి॥

తా॥ సర్వ భూతములయందు సమాన భావముగల సజ్జనులకు పరోపకారం చేయుట తమ స్వకార్యముగానే భావింతురు కాబట్టి నేను దరిద్రుడనౌటవలన ఈ వ్రతమును మీవలన విని నేనాచరింప వలయునని కోరిక గలిగియున్నవాడను గాన వ్రత విధానమును వ్రతఫలమును జెప్పవలయునని యా బ్రాహ్మణుడు స్త్రీలనడిగెను.

స్త్రియఊచుః॥ శ్లో॥ ఉన్మాదం వా ప్రమాదం వా విస్మృతిం వా కరిష్యసి। అభక్తిం వాప్యనాస్థాం వా కథం దేయం తవద్విజ॥

తా॥ ఓ బ్రాహ్మణుడా! నీవు యోగ్యమైన మనస్సు కలవాడవు కావు ఈ వ్రతమును నీకు చెప్పితిమేని దీనియందు దాసక్తి యుంచువాడవు కావు భక్తిగానుండవు మఱచి పోయెదవు ఆక్షేపింతువు కాబట్టి నీకు చెప్ప కూడదని యా స్త్రీలనిరి.

శ్లో॥ ఇతిచాసాంవచశ్శ్రుత్వా విప్రేంద్రోవాక్యమబ్రవీత్। జ్ఞానవానస్మిభోసాధ్వ్యః భక్తిమాంశ్చాస్మిసువ్రతాః॥

తా॥ యిట్లు పలికిన యా స్త్రీల మాటలను విని యా బ్రాహ్మణుడు యో పతివ్రతలారా! నేనుజ్ఞానము కలవాడను భక్తికలవాడనై తిని కాబట్టి యీ వ్రతమును జెప్పుమని యడిగెను.

శ్లో ॥ ఏవంతద్వచనంశ్రుత్వా ప్రౌఢాతాసుచ సూఖవేత్ ।
సాహోవాచ వ్రతంతస్మై యథాభూతంచతద్విధమ్॥

తా ॥ ఇట్లు పలికిన యాబ్రాహ్మణుని మాటలనువిని యాస్త్రీలలో నేర్పు గల యొకస్త్రీ ఆవ్రతముయొక్క యదార్థమును సవిస్తరముగా నాబ్రాహ్మణునితో నిట్లుచెప్పెదను.

శ్లో ॥ శ్రావణేశుక్లపక్షేషు ప్రథమేరవివాసరే । మాసేనోత్థాయావగాహం కుర్యాచ్ఛీతోదకేనతు॥

తా ॥ శ్రావణమాసములో మొదటగా వచ్చెడి యాదివారమునందు ప్రాతఃకాలమున మౌనముగానుండి చల్లని యుదకములో స్నానము జేయవలయును.

శ్లో॥ స్వనిత్యకర్మ సంపాద్య నాగవల్లీదళేశుభే । పరిధిద్వాదశయుతం మండలంతత్రసంలిఖేత్ ॥

తా॥ ప్రాతఃకాల సంబధమైన సంధ్యావందనాదికృత్యముల దీర్చుకొని తమలపాకులను పంద్రెండు మండలముల నేర్పరచవలయును.

శ్లో॥ అర్కవద్వర్తులంసమ్యగ్రక్తచందనతశ్శుభమ్ । తత్రసంజ్ఞాయుతంసూర్యం పూజయేద్రక్తచందనాత్ ॥

తా ॥ ఆ మండపమునందు సూర్యబింబము వలెనే గుండ్రముగా ఎఱ్ఱనిగంధముతో పండ్రెండు మండలముల నేర్పరచి సంజ్ఞాఛాయా సమాయుక్తుడగు సూర్యుని యావాహనముచేసి యెఱ్ఱనిగంధముతో పూజచేయవలయును.

శ్లో ॥ జానుభ్యామవనీంగత్వా అర్ఘ్యాన్ద్వాదశతండులైః।
రక్తచందనమిశ్రైశ్చ జపాకుసుమసంయుతమ్ ॥

తా ॥ మోకాళ్లను భూమియందుంచి పండ్రెండు పర్యాయము లర్ఘ్యమీయవలయును ఎఱ్ఱని గంధముతో మిశ్రితములైన బియ్యముతోను పూజచేయవలయును.

శ్లో ॥ దద్యాద్గభస్తయేసమ్యక్ శ్రద్ధాభక్తిపురస్సరమ్ । రక్తాక్షతైర్జపాపుష్పై స్తథాన్యైరుపచారకైః॥

తా ॥ శ్రద్ధయు, భక్తియు, గలిగి దాసనపుష్పములు, ఎఱ్ఱని యక్షంతలు, మరియునితరమైన యుపచారముల చేతను సూర్యునికి పూజచేయవలయును.

శ్లో॥ నారికేలస్యబీజంతు ఖండశర్కరయాయుతమ్ । నైవేద్య మర్పయిత్వాతు మంత్రైరాదిత్యలింగకైః॥ స్తుపీత ద్వాదశవర్త్యైర్నమ స్కారైః ప్రదక్షిణాః । షడ్తంతు సన్మితంసూత్రం షడ్భిర్గ్రంధిభిరన్వి తమ్॥ అర్పయిత్వాతు దేవేశం బధ్నీయాత్తుగళేచతత్ । ద్విజాయవా యనందద్యాత్ఫలైర్ద్వాదశభిర్యుతం ॥

తా ॥ కొబ్బరిచిప్పలు, పంచదార, పటికిబెల్లము, మొదలగునవి నివేదనము జేసిసూర్యుని నిరూపణచేయునట్టి పంట్రెండు మంత్రములచేత స్తోత్రము చేసి పంట్రెండు నమస్కారములను పంట్రెండు ప్రదక్షిణములుజేసి ఆరు పోగులుగల తోరమునుపోసి ఆరుముళ్లు నువేసి యాతోరమును సూర్యునకు సమర్పించి దానినికంఠమునందు ధరించవలయును పిమ్మట పంట్రెండు ఫలములను బ్రాహ్మణునకు వాయనమివ్వవలయును.

శ్లో॥ ఏతద్వ్రతప్రకారంచ శ్రావణేత్కస్య చిత్పురా । ఏవం వ్రతేకృతే విప్ర నిర్ధనోధన మాప్నుయాత్ ॥ అపుత్రో లభతేపుత్రం కుష్ఠీకుష్ఠాత్ప్రముచ్యతే బద్ధస్స్యాత్బంధరహితో రోగీ రోగేణహీయతే॥

తా ॥ ఈవ్రతవిధానము పూర్వమెవ్వరికిని తెలియదు కాబట్టి యీప్రకారము వ్రతముజేసినయెడల దరిద్రుడు ధనముపొందును పుత్రులులేనివాడు పుత్రులనుపొందును కుష్ఠురోగి రోగమువలన విముక్తుడగును బంధింపబడినవాడు బంధనమువల్ల విముక్తుడగును మరియేయితర రోగములు కలవాడైనను వానివలన విడువబడును.

శ్లో॥ కింబహూక్తేనవిప్రేంద్ర యద్యదిచ్ఛతి వాంఛితమ్ । తత్తల్లభేత్సాధకోసౌ వ్రతస్యాస్యప్రభావతః॥

తా ॥ ఓబ్రాహ్మణోత్తమా! ఇది యది యని చెప్పనేల ఈవ్రతముచేయు వాడు వ్రతమహిమచే కోరినన్నియు పొందగలడు.

శ్లో॥ ఏవంచతుష్పంచ వారేషు కదాచిదపిపంచసు । ఉద్యాపనం తతఃకార్యం వ్రతసంపూర్ణహేతవే ॥

తా ॥ ఈప్రకారము శ్రావణమాసములో వచ్చిననాలుగు వారములయందు గాని అయిదు వారములయందుగాని వ్రతమునుజేసి పిమ్మట వ్రతముసంపూర్తినొందుటకు నుద్యాపనము చేయవలయును.

శ్లో॥ ఏవంకురుష్వవిప్రేంద్ర సర్వసిద్ధిర్భవిష్యతి। నమస్కృత్వా తు తాస్సాధ్వీ ర్విప్రస్స్వగృహం మాయయా ॥ తథాచకారతత్సర్వం వ్రతంచైవ యథాశ్రుతం । స్వకన్యకాద్వయస్యాపి శ్రావణమాస తద్విధిమ్ ॥

తా ॥ ఓ బ్రాహ్మణోత్తమా! ఈప్రకారము చేసిన సమస్తకోరికలు పొందగలవని యాస్త్రీలు చెప్పఁగా నాబ్రాహ్మణుఁడు వారికినమస్కారముచేసి తన యింటికివెళ్లి యాస్త్రీ చెప్పిన ప్రకారము వ్రతమునాచరించి యావ్రతవిధానమునంతయును తన యిద్దరు కుమార్తెలకు జెప్పెను.

శ్లో॥ తస్యశ్రవణమాత్రేణ దర్శనాత్పూజనస్యచ। స్వరాంగనోపమేకన్యే జాతేతస్యప్రభావతః॥

తా ॥ ఆబ్రాహ్మణుని కుమార్తెలు తండ్రిచెప్పినకథనువినుటవలనను ఆయన చేసినపూజ చూచుటవలనను ఆవ్రత ప్రభావముచే దేవతా స్త్రీలతో సమానమైన సౌందర్యముగలవారైరి.

శ్లో॥ తదాప్రభృతివిప్రస్య గృహేలక్ష్మీర్వ్యవేశహ । నానామార్గైర్నిమిత్తైశ్చ లక్ష్మీవానితిసోభవత్ ॥

తా ॥ ఆదిమొదలుకొని యాబ్రాహ్మణునింట లక్ష్మీదేవి నివసించియుండెను అనేకవిధములుగా నాబ్రాహ్మణుడు ధనమును సంపాదించుచు లక్ష్మీసంపన్నుడని ప్రసిద్ధికెక్కెను.

శ్లో॥ కదాచిద్గచ్ఛతా రాజ్ఞా విప్రసద్మపురాధ్వనా। వాతాయనే సితేకన్యే దృష్టేనిరుపమేశుభే ॥

తా ॥ ఒకానొకప్పుడా పట్టణపురాజువీధివెంబడి వచ్చుచుండగా నాబ్రాహ్మణుని యింటివద్దకు వచ్చుసరికి కిటికీగుండా యిద్దరు మిక్కిలి సౌందర్యముగల స్త్రీలు కనబడిరి.

శ్లో॥ దేహావయవసంస్థానై ర్వస్తుయద్యచ్చసుందరమ్। త్రైలోక్యేభత్సయంత్యౌతే పద్మచంద్రాదికంచయత్ ॥

తా ॥ లోకములో పద్మము చంద్రుఁడు మొదలగు వస్తువు లెవ్విగలవో వానినన్నిటిని తమదేహము అవయవములయొక్క సౌందర్యముచే తిరస్కరించుచుండెడివారు.

శ్లో॥ రాజామోహంసమాపేదే తత్రై స్త్రీవావస్థితఃక్షణమ్। అమంత్ర్య బ్రాహ్మణంసద్యః ప్రార్థయామాసకన్యకే ॥

తా ॥ అట్టి మిక్కిలి సౌందర్యవతులగు స్త్రీలనుజూచి రాజు మోహముచెంది క్షణకాలమై మరచి పరవశుడై వెంటనే యాబ్రాహ్మణుని బిలచి యాయన కుమార్తెలను తనకిమ్మని యడిగెను.

శ్లో॥ విప్రోపిహృష్టచిత్తోభూత్వా ప్రాదాద్రాజ్ఞేసుతాద్వయం। రాజానంప్రాప్యభర్తారం తేపికన్యేముదాన్వితే॥

తా ॥ ఆస్త్రీలను రాజు కోరుటచే నాబ్రాహ్మణుడు సంతసించినవాడై తన కుమార్తెలను రాజునకిచ్చి పెండ్లి చేసెను.ఆకన్యకలను తమకు రాజుభర్తయగుట వలన మిక్కిలియానందముగలవారైరి.

శ్లో॥ పుత్రపౌత్రాదిసంపన్నే చక్రతుశ్చస్వయంవ్రతం। వ్రతమేతత్సమాఖ్యాతం మునేతవమహోదయమ్॥ యస్యశ్రవణమాత్రేణ సర్వాన్ కామాన వాప్నుయాత్। అనుష్ఠాన ఫలంతస్య కింవర్ణ్యం విధినందన ॥

తా ॥ బ్రహ్మపుత్రుడవగు నోసనత్కుమార! ఆస్త్రీలు అది మొదలుకొని పుత్రులు పౌత్రులు మొదలగు వారితోగూడ ఈవ్రతమును జేసిరి గాన యిట్టివిశేష ఫలదాయకమగు వ్రతమునునీకు జెప్పితిని ఈవ్రతకథను వినినంత మాత్రముననే వ్రతమును చేసిన ఫలమునొంది సమస్తకోరికలను పొందగలడు.

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాస మాహాత్మ్యే ఈశ్వర

సనత్కుమార సంవాదే ప్రకీర్ణక నానావ్రతరవివార

వ్రతాది కథనంనామ పంచమోధ్యాయ

స్సమాప్తః

---

## అథ షష్ఠోధ్యాయః

సనత్కుమార ఉవాచ ॥ శ్లో॥ రవివారస్యమాహాత్మ్యం శ్రుతంమే హర్షకారకమ్ । సోమవారస్య మాహాత్మ్యం శ్రావణేమాసి మేవద॥

తా ॥ ఓసాంబమూర్తి! సంతోషమును కలుగజేసెడి యాదివార వ్రతమును వింటిని శ్రావణ మాసములో సోమవారమునకు నుండెడి మహిమను కూడ చెప్పుమని సనత్కుమారు డడిగెను.

ఈశ్వరఉవాచ ॥ శ్లో ॥ రవిర్నేత్రంయనంతస్య మాహాత్మ్యమిద ముత్తమమ్। ఉమాసహితమన్నామ్న స్తస్యసోమస్యకింపునః ॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాఁడు సూర్యుఁడు నాకు నేత్రము కాఁబట్టి అట్టిసూర్యుని సంబంధమయిన ఆదివారమునకు నిట్టి మహిమ కలిగెనుఇఁక సోమవార మునుగుఱించి చెప్పెదను. (ఉమయాసహితః - సోమః) అని చెప్పబడును. అనఁగా పార్వతీదేవితో కూడినవాఁడు సోముఁడుఅని చెప్పఁబడెను గాన సోమశబ్దము నాయందే వర్తించుటవలన సోమవార మనఁగా నాసంబంధమైన వార మేయగును కాఁబట్టి దానిమహిమను చెప్పుటకునలవియే కాదు.

శ్లో ॥ మాహాత్మ్యం వర్ణయిష్యామి యత్కించిదపితేబ్రువే॥

తా ॥ ఈ సోమవారమును గుఱించి జెప్పదగిన యావత్తు మహిమ నీకు జెప్పెదను.

శ్లో॥ సోమశ్చంద్రోవిప్రరాజస్సోమస్స్యాద్యజ్ఞసాధనమ్ । నిమి త్తానిచతన్నామ్న శ్శృణుమ త్తస్సమాహితః।మత్స్వరూపోయతోవార స్తతస్సోమఇతిస్మృతః॥

తా ॥ సోమశబ్దమునకు నింద్రుడనియు, బ్రాహ్మణోత్తము డనియు, యజ్ఞ మునందుపయోగించు సోమలతయనియు, ననేకయర్థములు కలవు దానియొక్క యథార్థమునంతయు సవిస్తరముగా జెప్పెదనువినుము నాస్వరూపమైనదికాఁబట్టి సోమవారమని చెప్పఁబడియెను.

శ్లో ॥ ప్రదాతాసర్వరాజస్య శ్రేష్ఠశ్చైవతతోహిసః । సహి యజ్ఞస్యఫలదో వ్రతకర్తాహ్యతోహిసః॥

తా ॥ ఈ వ్రతమును జేసినవాడు సమస్త రాజ్యము నిచ్చునట్టి వాడును శ్రేష్ఠుడును సమస్తయజ్ఞముల ఫలమునిచ్చునట్టి వాఁడగును అనఁగా దేవత్వము పొంది సమస్తము నిచ్చువాడగును.

శ్లో॥ తస్యశ్రుణువిధింవిప్ర విస్తరాత్కథయామితే। ద్వాదశేష్వపిమాసేషు సోమవారఃప్రశస్యతే॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! ఆవ్రతమును సవిస్తరముగా జెప్పెదను వినుము పండ్రెండు మాసములయందును సోమవారము మిక్కిలి శ్రేష్ఠమైనదిగా చెప్పబడెను

శ్లో॥ తావత్కాలమశక్తశ్చేచ్ఛ్రావణేమాసికారయేత్। అస్మిన్మాసే వ్రతంకృత్వా హ్యబ్దవ్రతఫలంలభేత్॥

తా॥ పండ్రెండు మాసములయందును సోమవారవ్రతమును చేయలేనివాడు ఒక్కశ్రావణమాసములో చేసినను సంవత్సరమంతయు చేసినఫలమునొందును.

శ్లో॥ శ్రావణేశుక్లపక్షేతు ప్రథమేసోమవాసరే। సంకల్పయేద్వ్రతంసమ్యక్ శివోమేప్రీయతామితి॥

తా॥ శ్రావణశుద్ధములో మొదటిదియగు సోమవారమునందు వ్రతమునారంభించుచు సాంబమూర్తి నాయందు ననుగ్రహము కలవాడైయుండుగాక యని సంకల్పముచేసి యారంభించవలెను.

శ్లో॥ ఏవంచతుర్షువారేషుభవేయుఃపంచవాయది। ప్రాతస్సంకల్పయేత్తత్రినక్తంచశివపూజనమ్॥ ఉపచారైష్షోడశభిస్సాయంచపూజయేచ్ఛివం। శ్రుణుయాచ్చకథాందివ్యామేకాగ్రకృతమానసః॥ సోమవారవ్రతస్యాస్య కథ్యమానంనిబోధమే। శ్రావణేప్రథమేసోమే గృహ్ణీయాద్వ్రతముత్తమమ్॥

తా॥ ఇట్లు శ్రావణమాసములో నాలుగుగాని యైదుగాని వచ్చెడి సోమవారములయందు ప్రాతఃకాలంబున సంకల్పముచేసి రాత్రులయందు షోడశోపచారములచే శివుని పూజించి నిశ్చలమైన మనస్సుతోటి శ్రేష్ఠమైనసోమవారవ్రతకథను వినవలయును. కాబట్టి యీచెప్పబోవు సోమవారవ్రతవిధానమును వినుము శ్రావణమాసములో మొదటిసోమవారమున ప్రారంభింపవలెను.

శ్లో॥ సుస్నాతశ్చశుచిర్భూత్వా శుక్లాంబరధరోనరః। కామక్రోధాద్యహంకారద్వేషపైశున్యవర్జితః॥

తా॥ ప్రాతఃకాలంబున స్నానముచేసి పరిశుద్ధుఁడై తెల్లనివస్త్రములను ధరించి కామము, క్రోధము అహంకారము, ద్వేషము, పిశునత మొదలగు దుష్టగుణములను విడువవలయును.

శ్లో॥ ఆహరేచ్ఛ్వేతపుష్పాణిమాలతీమల్లికాదికాః। అన్యైశ్చ వివిధైఃపుష్పైరభీష్టైరుపచారకైః॥ పూజయేన్మూలమంత్రేణత్ర్యంబకేణతతఃపరమ్॥

తా॥ మాలతి, మల్లిక, మొదలగు తెల్లనిపుష్పములను తెచ్చి త్ర్యంబకం అను మూలమంత్రముచే పూజించి పిమ్మట షోడశోపచారముల చేతను శివునకుముందు చెప్పబోవురీతి పూజచేయవలయును.

శ్లో॥ శర్వాయభవనాశాయ మహాదేవాయధీమహి। ఉగ్రాయ చోగ్రనాథాయ భవాయశశిమౌళినే॥ రుద్రాయనీలకంఠాయ శివాయ భవహారిణే। ఏవంసంపూజ్యదేవేశ ముపచారైర్మనోహరైః। యథా విభవసారేణ తస్యపుణ్యఫలంశృణు॥

తా॥ శర్వాయ, భవనాశాయ, మహాదేవాయ, ఉగ్రాయ, ఉగ్రనాథాయ, భవాయ, శశిమౌళినే, రుద్రాయ, నీలకంఠాయ, శివాయ, భవహారిణే, ఈ మొదలైన రుద్రుని నామములచే తనశక్తికొలది షోడశోపచారములచేసి సాంబమూర్తిని పూజించినయెడల వారికిగలుగు ఫలము చెప్పెదవినుము.

శ్లో॥ సోమవారేయజంతేయే పార్వత్యాసహితంశివమ్ । తే లభంత్యక్షయాన్ లోకానపునరావృత్తిదుర్లభాన్॥

తా॥ పార్వతీసహితుడైన సాంబమూర్తిని సోమవారమునందు పూజించినవారు ఎప్పుడునునశింపనివియు పునరావృత్తి రహితమైన లోకములను పొందుదురు.

శ్లో॥ అత్రనక్తేనయత్పుణ్యం కథయామిసమాసతః। సప్తజన్మార్జితంపాప మభేద్యం దేవదానవైః॥ ప్రణశ్యేన్నక్తభుక్తేన నాత్ర కార్యావిచారణా॥

తా॥ యీ మాసములో నక్తభోజనము చేసినందువలన గలిగెడుపుణ్యమును సంక్షేపముగా జెప్పెదను వినుము ఏడు జన్మములందు చేయబడి నదియు దేవతలు రాక్షసులు మొదలగు వారిచేతనైనను పోగొట్టబడుటకు సాధ్యముకాని పాపమైనను శ్రావణమాసములో నక్తభోజనమువలన నశింపగలదు యీ విషయమైసందేహ మేమియు లేదు.

శ్లో॥ ఉపవాసేనవాకుర్యా ద్వ్రతమేతదనుత్తమమ్। పుత్రార్థీ లభతేపుత్రా న్ధనార్థీ లభతేధనమ్। యంయంచింతయతేకామం తంతంప్రాప్నోతిమానవః॥

తా ॥ శ్రేష్ఠమైన యీ సోమవారవ్రతము నుపవాసముండి చేసిన యెడల పుత్రులను కోరినవాడు పుత్రులను, ధనమును కోరినవాడు ధనమును మరియేయే కోరికలను గోరుచున్నాడో వానినన్నిటిని పొందగలడు.

శ్లో ॥ ఇహలోకే చిరంస్థిత్వా భుక్త్వాభోగాన్యథేప్సితాన్ । విమానవరమారుహ్యరుద్రలోకే మహీయతే ॥

తా ॥ ఈలోకంబున తానుకోరిన కోరికలనన్నియు ననుభవించి చిరకాలము జీవించి జన్మాంతమున శ్రేష్ఠమగుదేవతా విమానము నెక్కి కైలాసము చేరగలడు.

శ్లో ॥ చలంచిత్తం చలంవిత్తం చలంజీవిత మేవచ । ఏవంజ్ఞాత్వాప్రయత్నేన వ్రతస్యోద్యాపనంచరేత్ ॥

తా ॥ బుద్ధి, ధనము, ప్రాణము, ఇవియన్నియు స్థిరములు కానివి కాన బట్టి ఎప్పుడు నశించిపోవునోయని తెలిసికొని సమస్తవిధముల త్వరలో నీవ్రతము నకు నుద్యాపనము చేయవలయును.

శ్లో ॥ ఉమామహేశ్వరౌ హైమౌ రాజతేవృషభేస్థితౌ । యథాశక్త్యాప్రకర్తవ్యౌ చిత్తశాఠ్యంనకారయేత్ ॥

తా ॥ వెండితో వృషభవాహనమును బంగారముతో పార్వతీ పరమేశ్వరుల ప్రతిమలను తనశక్తికొలది చేయించవలయును శక్తియుండగా లోభించగూడదు.

శ్లో ॥ మండలంలింగతోభద్రం దివ్యంవై కారయేచ్ఛుభమ్ । తత్రసంస్థాపయేత్కుంభం శ్వేతవస్త్రయుగాన్వితమ్ ॥

తా ॥ శ్రేష్ఠమైనదియు శుభప్రదమైనదియు లింగాకారముగా నొకమండల మేర్పరచి యచ్చట రెండు తెల్లని వస్త్రములతో జుట్టబడిన కలశము నుంచవలయును.

శ్లో ॥ తామ్రపాత్రంవైణవంవా కుంభస్యోపరివిన్యసేత్ । తస్యోపరిన్యసేద్దేవ ముమయా సహితంశివమ్ ॥

తా ॥ దానిపైన రాగిపాత్రగాని వెదురుపాత్రగానియుంచి పార్వతీ సహితుడైన శివప్రతిమనుంచవలయును.

శ్లో ॥ శ్రుతిస్మృతిపురాణోక్తైర్మంత్రైస్సంపూజయేచ్ఛివం । పుష్పమండపికాంకార్యా వితానంచైవశోభనమ్ ।

తా॥ పుష్పములు మొదలగు వానిచే మంటపమును శుభప్రదమగు చాంతి నియు శేశ్వర విశేషమంత్రములు, స్మృతులు, పురాణములు మొదలగువానిచే జెప్పఁబడిన మంత్రములచే సాంబమూర్తిని యథావిధిగా పూజింప వలయును.

శ్లో॥ రాత్రౌ జాగరణం కార్యం గీతవాదిత్రనిస్వనైః। స్వగృహోక్తవిధానేన తతోఽగ్నింస్థాపయేద్బుధః॥ తతో హోమంచశర్వాద్యై రేకాదశసునామభిః। పాలాశాభిస్సమిద్భిశ్చ హూయాదష్టాధికం శతమ్॥

తా॥ గీతము వాద్యము మొదలగువానిచే రాత్రిజాగరణము చేయవలయును. తమశాఖయందు జెప్పఁబడిన ప్రకారముగా వహ్నిప్రతిష్ఠాపనచేసి శర్వాయ మొదలగు పదునొకండు నామములతోను మోదుగసమిధలనుంచుచు నూటయెనిమిది పర్యాయములు హోమము చేయవలయును.

శ్లో॥ యవవ్రీహితిలాద్యైశ్చ ఆప్యాయస్వేతిమంత్రతః। బిల్వపత్రైస్త్ర్యంబకేణ షడ్వర్ణేనాపివాపునః॥ పూర్ణాహుతిం తతో హుత్వా కృత్వాస్విష్టకృతాదికమ్। ఆచార్యంపూజయేత్పశ్చాద్గాంచ తస్మైప్రదాపయేత్॥

తా॥ ఆప్యాయస్వ, అను మంత్రము నుచ్చరింపుచు యవలు, వ్రీహులు, నువ్వులు, మొదలగువానితోను త్ర్యంబకం, అను మంత్రముగాని ఆఱు అక్షరములుగల శివ పంచాక్షరి మంత్రమును గాని పఠియింపుచు మారేడు దళములతోను హోమముచేసి స్విష్టకృత్తు మొదలగు నవియుజేసి పిమ్మట పూర్ణాహుతిహోమము గావించి పిమ్మట నాచార్యుని పూజించి గోదానము మొదలగు దానములు నివ్వవలయును.

శ్లో॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చా దేకాదశసుసద్గుణాన్। ఏకాదశఘటాన్తేభ్యో వంశపాత్రసమన్వితాన్॥

తా॥ అనంతరము సద్గుణములుగల పదునొకండుగురు బ్రాహ్మణులను భుజింపచేసి వారికి వెదురుపాత్రలతోఁగూడిన పదకొండు కలశముల నివ్వవలయును.

శ్లో॥ సంపూజితంతతో దేవం దేవోపకరణానిచ। ఆచార్యాయ తతోదద్యా త్ప్రార్థనాం తదనంతరం॥ పరిపూర్ణంవ్రతంమేస్యా చ్ఛివోమేప్రీయతామితి। బంధుభిస్సహభుంజీత తతోహర్షపురస్సరం॥

తా॥ అనంతరము పూజింపఁబడిన శివుని ప్రతిమను అక్కడనుంచబడిన యుపకరణములతోఁగూడ నాచార్యునకు దానమిచ్చి యనంతరము నావ్రతము సంపూర్తి యగుగాక శివుఁడు నాయందు సదా ప్రసన్నుఁడై యుండుగాకయని ప్రార్థింపవలయును అనంతరము సంతోషమైన మనస్సుగలవాఁడై బంధువులు మొదలగు వారితోఁగూడి భుజింపవలయును.

శ్లో॥ అనేనైవవిధానేన యయిదంవ్రతమాచరేత్। యంయం చింతయతేకామం తంతంప్రాప్నోతిమానవః॥

తా॥ ఈ ప్రకారముగా నెవఁడీ వ్రతమును చేయుచున్నాఁడో వాఁడు తాను కోరిన కోరికలన్నియు పొందగలఁడు.

శ్లో॥ శివలోకేతతోగత్వా తస్మిల్లోకేమహీయతే। కృష్ణేనాచరితంపూర్వం సోమవారవ్రతంశుభం॥ నృపైశ్చైవ్రిష్ణై స్తథాచీణాఃమాస్త్రికైః ధర్మతత్పరైః। యఇదంశృణుయాన్నిత్యం సోపితత్ఫలమాప్నుయాత్॥

తా॥ అనంతరము కైలాసమును చేరి యచ్చట శాశ్వతముగా నుండగలఁడు. ఈ సోమవార వ్రతమును పూర్వము కృష్ణమూర్తి, మఱియు ధర్మమార్గమునందాసక్తిగల యనేక రాజులు ఆచరించిరి కాఁబట్టి యీ కథను విన్నవారు సోమవార వ్రతమును చేసిన ఫలము నొందువారగుదురు.

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణ మాస మాహాత్మ్యే సోమవార వ్రత
కథనంనామషష్ఠోధ్యాయస్సమాప్తః.

---

## అథ సప్తమో ధ్యాయః.

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ సనత్కుమార వక్ష్యామి భౌమవ్రతమనుత్తమమ్। యస్యానుష్ఠానమాత్రేణ అవైధవ్యంప్రజాయతె॥

తా॥ ఓ సనత్కుమారా! మంగళవార వ్రతము మిక్కిలి శ్రేష్ఠమైనది గాన దానిని గుఱించి చెప్పెదను ఆవ్రతమును చేయుటవలన దీర్ఘకాలము సువాసినిగా నుండ గలదు.

శ్లో॥ వివాహానంతరంపంచ వర్షాణివ్రతమాచరేత్। నామ్నా సౌమ్యంగళగౌరీ వ్రతంపాపప్రణాశనమ్॥

తా॥ సమస్తపాపములు బోగొట్టునట్టి యీవ్రతము మంగళగౌరీ వ్రతమని చెప్పఁబడును ఈవ్రతమును వివాహమైన పిమ్మట నైదుసంవత్సరములవఱకు నాచరింపవలెను.

శ్లో॥ వివాహానంతరంచాద్యే శ్రావణేశుక్లపక్షకే। ప్రథమే భౌమవారేతు వ్రతమేతత్సమాచరేత్॥

తా॥ వివాహమైన మొదటిసంవత్సరములో వచ్చెడి శ్రావణమాసము నందు మొదటి మంగళవారమునందు ఈవ్రతమును యథావిధిగా నాచరింపవలయును.

శ్లో॥ పుష్పమంటపికాకార్యా కదళీస్తంభమండితా॥ నానావిధైః ఫలైశ్చైవ పట్టకూలైశ్చభూషయేత్ ॥

తా॥ అరటిస్తంభములు పుష్పములు, ఫలములు, పట్టువస్త్రములు మొదలగు వానిచే మండపమేర్పరచ వలయును.

శ్లో॥ తత్రసంస్థాపయేద్దేవ్యాః ప్రతిమాంస్వర్ణ నిర్మితాం। అన్యథాతుమయీంవాపి స్వశక్త్యాతత్రపూజయేత్ ॥

తా॥ బంగారముచే జేయంబడిన గౌరీప్రతిమనుగాని లేక తనశక్తిననుసరించి మరియొకలోహంచే జేయఁబడినదిగాని గౌరీప్రతిమను ఆమంటపమునందుంచి యావాహనముజేసి పూజింపవలయును.

శ్లో॥ ఉపచారైష్షోడశభి ర్మంగళగౌరిసంజ్ఞితామ్।దూర్వాదళైః షోడశభిరపామార్గదళైస్తథా ॥ తావత్సంఖ్యైస్తండులైశ్చ చణానాం దళైస్తథా। షోడశోన్మితవర్తిభి స్తావద్దీపాంశ్చదీపయేః॥

తా॥ షోడశోపచారములతోను పదియారు గరికచిగుళ్ల చేతను, పదియారు ఉత్తరేణిదళములచేతను, పదియారు బియ్యపు గింజలచేతను, పదియారు శనగబద్దల చేతను, మంగళగౌరీదేవతను పూజించి పదియారు వత్తులచే దీపము వెలిగించి యాదేవికి సమర్పింపవలయును.

శ్లో॥ దధ్యోదనంచనైవేద్యం తత్రభక్త్యాప్రకల్పయేత్। సమీపే సంస్థాపయేద్దేవ్యా దృషదంచోపలంతథా ॥

తా ॥ ఒకరాయిని కుంకుమపసుపు మొదలగువానిచే నలంకరించి యాదేవీ సమీపమునందుంచి భక్తికలదియై పెరుగుతో కలిపిన యన్నమును నివేదన జేయ వలయును.

శ్లో॥ ఏవంకృత్వాతుపంచాబ్దం తతఉద్యాపనంచరేత్ । మాత్రే దద్యాద్వాయనంతు ప్రకారంశృణుతస్యచ॥

తా ॥ ఈ ప్రకారము అయిదు సంవత్సరములు చేసి పిమ్మట ఉద్యాపనము చేసి వాయనము తల్లికి నివ్వవలయును ఆ విధాన ప్రకారమును చెప్పెదను వినుము.

శ్లో॥ ప్రతిమాంమంగళగౌర్యాః స్వర్ణపలనిర్మితాం । తదర్ధేన తదర్ధేన శక్త్యావాప్యథకారయేత్ ॥

తా ॥ నవటాకుబంగారముతో గాని అందులో సగము గాని నాలుగవవంతు గాని లేక తనశక్తి ననుసరించిన బంగారముతో మంగళ గౌరీదేవి యొక్క ప్రతిమను చేయించవలయును.

శ్లో॥ తండులైః పూరితేభాండే శక్త్యాస్వర్ణాదినిర్మితే। సంస్థాప్యపరిధానంతు రమణీయంచ కంచుకం ॥ తయోరుపరి దేవ్యాస్తు ప్రతిమాంస్థాపయేత్తతః । సమీపభాగేసంస్థాప్య దృషదంచోపలంతథా ॥ రౌప్యేణనిర్మితంమాత్రే దైవందద్యాత్తువాయనం । షోడశాపి సువాసినోర్భోక్త్రీనియాఃపత్నితః॥

తా ॥ బంగారు మొదలగు వానిచే గాని తనశక్తి ననుసరించి యొక భాండమును చేయించి దానిలో నిండుగా బియ్యముపోసి దానికి చీర రవికల గుడ్డయు జుట్టి దానియందు మంగళ గౌరీ దేవి ప్రతిమ నుంచి వెండితో చేయుబడిన సన్నికల్లు రాయి దాని సమీపమందుంచి యది తల్లికి వాయనమిచ్చి పిమ్మట ౧౬ గురు సువాసినీ స్త్రీలకు భోజనము పెట్టవలయును.

శ్లో ॥ ఏవంకృతే వ్రతేవిప్ర సౌభాగ్యంసప్తజన్మసు । పుత్రపౌత్రాదిభిశ్చైవ రమతేసంపదాయుతా॥

తా॥ ఓ మునీశ్వరా! ఈ ప్రకారము వ్రతముచేసిన యెడల నేడు జన్మముల పర్యంతము సువాసినీత్వము నొందుచు పుత్రులు పౌత్రులు గలదియగుచు నైశ్వర్యముతో దులదూగుచు నానందముతో నెల్లప్పుడు విలసిల్లుచుండును.

సనత్కుమార ఉవాచ ॥ శ్లో॥ కేనేదంవ్రతమాచీర్ణం కస్య జాతంఫలంపురా। యథాస్యాత్ప్రత్యయశ్శంభో కృపాంకృత్వాతథావద॥

తా॥ ఓ ఈశ్వరా! పూర్వ మీవ్రతము చేసిన వారెవరో దాని ఫలము నొందిన వారెవరో వారి వృత్తాంతమును వినవలయును కాఁబట్టి నాయందు దయగలవాడవై నాకు నమ్మిక కలుగు నట్లుగా యథార్థమును సంతయును తెలియ పరచి చెప్పుమని సనత్కుమార మునీశ్వరుడు సాంబమూర్తి నడిగెను.

ఈశ్వర ఉవాచ॥ శ్లో॥ కురుదేశేపురారాజా శ్రుతకీర్తిరితిశ్రుతః। బభూవశ్రుతసంపన్నః కీర్తిమాన్హతశాత్రవః॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, పూర్వకాలంబునకురుదేశములో విశేష విద్యాసంపన్నుడును మిక్కిలి కీర్తిగలవాడును శత్రువులను జయించిన వాడును నగు శ్రుతకీర్తియగు రాజుగలడు.

శ్లో॥ చతుష్షష్టికలాభిజ్ఞో ధనుర్విద్యావిశారదః। పుత్రాదన్యచ్ఛుభంసర్వం తస్యరాజ్ఞోబభూవహ॥

తా॥ ఆ రాజు అరువది నాలుగు విద్యలను జదివినవాడును ధనుర్విద్య యందు మిక్కిలి నేర్పుగలవాడునై రాజ్యము చేయుచుండగా నారాజు నకు సమస్త సంపత్తులు కలవాడై యుండెను గాని యనుభవించుటకు సంతానములేదు.

శ్లో॥ సంతానవిషయేణాసౌ బహుచింతాకులోభవత్। దేవ్యా ఆరాధనంచక్రే జపధ్యానపురస్సరమ్॥

తా॥ ఆ రాజు సంతానము లేకపోవుటచే మిక్కిలిపరితాపము నొంది జపమా ధ్యానము మొదలగు వానిచే గౌరీదేవి నారాధించెను.

శ్లో॥ క్రూరేణతపసాతస్య దేవీతుష్టాబభూవహ। ఉవాచవచనం తస్మై వరంవరయసువ్రత॥

తా॥ ఇట్లు మిక్కిలి కఠినమైన తపస్సు చేయగా గౌరీదేవి సంతోషించి యోరాజా! నీ వెందు నిమిత్తము తపస్సు చేసితివో చెప్పుము వరము నిచ్చెదనని గౌరీ దేవి యారాజుతో బలికెను.

శ్లో॥ యదిదేవిప్రసన్నాసి పుత్రంమేదేహిశోభనమ్। అన్యద్దేవి త్వత్ప్రసాదాన్నన్యూనంకించిదస్తిమే॥

తా॥ ఓ గౌరీదేవీ! నీవు అనుగ్రహము గలదానివైనయెడల సుగుణసంపన్నుడైన పుత్రుడు కలుగునట్లు వరమివ్వవలయును, ఓ దేవీ అదియొకటియే లోపము గాని నీ యనుగ్రహము వలన మిగిలిన సమస్తసంపత్తులను సమృద్ధిగా నేయున్నవి.

శ్లో॥ ఇతితస్యవచశ్రుత్వా దేవీప్రాహ శుచిస్మితా । దుర్లభం యాచితంరాజన్ దాస్యేతుభ్యంకృపావశాత్ ॥

తా॥ ఇట్లు పలికిన యా రాజు మాటలను విని గౌరీదేవి చెప్పుచున్నది నీవు కోరిన కోరిక పొంద శక్యముగాని దైనను నీయందుగల ప్రేమచేనిచ్చెదను.

శ్లో॥ పరంశ్రుణుష్వరాజేంద్ర పుత్రశ్చేద్గుణవత్తరః। ఈప్సితశ్చేత్షోడశాబ్దం జీవిష్యతినచాధికమ్॥ రూపవిద్యావిహీనశ్చేచ్చిరజీవీభవిష్యతి। ఇతిదేవ్యావచశ్శ్రుత్వా నృపశ్చింతాతురోభవత్ ॥ భార్యయా సహసంమంత్ర్య యయాచేగుణభూషితమ్ । సర్వలక్షణసంపన్నం షోడశాబ్దాయుషంసుతమ్॥

తా॥ ఓ రాజా అయినను మఱియొకటి చెప్పెదను వినుము సమస్తగుణ సంపత్తిగల కుమారుని కావలయు నంటివేని అట్టివాడు పదియారు సంవత్సరములు బ్రతుకును అంతకు పైన జీవింపడు రూపము విద్య మొదలగు సుగుణము లేవియు లేనివాడు చిరకాలము జీవించును కాబట్టి యెటువంటివాడు కావలయునో కోరుమని గౌరీదేవి పలికిన వాక్యమును యా రాజు విని విచారగ్రస్తుడై తన భార్యతో కూడ ఆలోచించి సర్వలక్షణములు కలిగి సుగుణ సంపత్తిగల కుమారుడు పదియారు సంవత్సరములు జీవించు వాడైనను అట్టి వానినే యివ్వమని రాజుకోరెను.

శ్లో॥ ఆజ్ఞాపయామాసతదా దేవీభక్తంనరాధిపమ్। అమ్రవృక్షోమమద్వారే వర్తతేనృపనందన॥ తస్యైకంఫలమాదాయ పత్నైదేహిమమాజ్ఞయా। భక్షణాత్తేంచసాదధ్రి గర్భంసద్యోనసంశయః॥

తా॥ అప్పుడు గౌరీదేవి చెప్పుచున్నది ఓ రాజా నా యాలయ ద్వార సమీపమునొక మామిడిచెట్టుకలదు దానియందుండు పండ్లలో నొకపండును తీసుకొనివెళ్లి నీభార్యకునివ్వగా నామెయాపండును నాయాజ్ఞను సారముగా భక్షించినయెడల వెంటనేగర్భోత్పత్తి కలదియగును. సందేహము లేదని భక్తుడగు ఆరాజునకుగౌరీ దేవియాజ్ఞాపించెను.

శ్లో॥ హృష్టోరాజాతథాచక్రే పత్నీగర్భంచ సాదధౌ । దశమే మాసిసుషువే పుత్రం దేవసుతోపమమ్॥

తా॥ ఇట్లు గౌరీదేవి చెప్పినందు వలన ఆ రాజు సంతసించి ఆప్రకారమే చేయఁగా నాతనిభార్య గర్భవతియై పదియవ మాసంబున దేవతులతో సమానమగు కుమారునికనెను.

శ్లో॥ జాతకర్మాదికంచక్రే హర్షశోకసమన్వితః। చిరాయురితి నామాస్య పితాచక్రే శివంభజన్॥

తా॥ సంతానము కలుగుటవలన సంతోషమును అల్పాయుర్దాయము కలవాడగుటచే విచారమునుకలవాడై యారాజు సాంబమూర్తిని ధ్యానించుచు నాపిల్లవానికి చిరాయువుఅని నామకరణముచేసిన వాడాయెను

శ్లో॥ ప్రాప్తేషుషోడశేవర్షే చింతామాపసభార్యకః। తతశ్చక్రే విచారంస కష్టలబ్ధోహ్యయంసుతః॥ స్వసమీపేకథంమృత్యు ద్రక్ష్యే దుఃఖదోస్యతు। కాశీంప్రస్థాపయామాస మాతులేనసమంవిభుః॥

తా॥ ఆపిల్లవానికి పదియారు సంవత్సరములురాగానే మృత్యువు సమీపించినదనే యభిప్రాయముచే తాను భార్యయువిచారగ్రస్తులై తపస్సులు, వ్రతములు మొదలగువానిచే విశేష ప్రయాసము వలన ఈపిల్లవాడు మనకుగలిగెనుగదా అట్టివానికిమృత్యువు మనయెదుటనే సంభవించి నయెడల నట్టి దుఃఖమును భరింపజాలమని తలచినవాడై యారాజుతన కుమారుని మేనమామతోకూడ కాశీపట్టణము పంపుటకు నుద్దేశించెను.

శ్లో॥ భ్రాతరంప్రార్థయామాస రాజపత్నీయశస్వినీ। ధృత్వా కార్పటికంవేషం కాశీంప్రతిసుతంనయ॥ మృత్యుంజయఃప్రార్థితో స్తి పుత్రార్థంతుమయాపురా । ప్రేషయిష్యామివిశ్వేశ యాత్రార్థం చజగత్పతేః॥ తస్మాన్నేయస్సుతోమేద్య పాలనీయశ్చయత్నతః । ఇతి శ్రుత్వాస్వసుర్వాక్యం స్వస్రీయేనసమంయయౌ॥

తా॥ అట్టిసమయములో రాజుభార్యతన సహోదరునితో చెప్పుచున్నది ఓతమ్ముడా! నీకాశీకావడి మోసుకొనిపోవువాని వేషముధరించినవాడవై నాకుమారుని కాశీపట్టణమునకు తీసుకొనివెళ్లుము పూర్వము సంతానము కొఱకు కాశీవిశ్వేశ్వరుని ప్రార్థించితిని ఇప్పుడు నీమేనల్లునకు ఆయుర్దాయము సమీపించినది

కాఁబట్టి జగద్రక్షకుండైన యావిశ్వేశ్వరుని దర్శనార్థమై యీపిల్లవానిని తీసికొనివెళ్లి సమస్తవిధముల పిల్లవానిని రక్షించుమని చెప్పిన తోఁబుట్టువుమాటలను విని వానిమేనమామ పిల్లవానిని తీసుకొని కాశికివెళ్లెను.

శ్లో॥ దినానికతిచిద్గచ్ఛ న్నానందనగరంయయౌ । తత్రరాజా వీరసేనో నామ్నాసర్వసమృద్ధిమాన్॥

తా ॥ అప్పుడు వారిద్దరుకలసి కొన్నిదినములకు ఆనందనగరమను పట్టణమునకువెళ్లిరి ఆపట్టణపురాజు సమస్తైశ్వర్యములతోఁ గూడి వీరసేనుఁడను పేరుచే ప్రసిద్ధికెక్కియుండెను.

శ్లో॥ తత్కన్యామంగళగౌరీ సర్వలక్షణసంయుతా। వయోమధ్యగతారమ్యా రూపలావణ్యశాలినీ॥

తా ॥ ఆరాజుయొక్క కుమార్తె మంగళగౌరియను పేరుగలదియు సౌందర్యాది సమస్తలక్షణములుగలిగి యౌవనముతోఁగూడి మిక్కిలిమనోహరముగా ప్రకాశించుచుండెను.

శ్లో॥ ఉపమానానిసర్వాణి తుచ్ఛీకృత్యోదయంగతా । నగరోపవనేరమ్యే సఖీభిఃపరివారితా॥

తా ॥ ఆచిన్నది పద్మము, చంద్రుఁడు, మొదలగు సౌందర్యమునకు పోల్పఁబడువస్తువులన్నిటిని తిరస్కరించి మిక్కిలిసౌందర్యముకలిగి పెరుగుచు నొకప్పుడు పట్టణమునకు సమీపమున నుండు ఉద్యానవనములో తనచెలికత్తెలతో నాడుకొనుచుండెను.

శ్లో॥ తతస్తావపిసంప్రాప్తౌ చిరాయుర్మాతులశ్చసః । విశ్రాంతిం ప్రాపతుస్తత్ర తౌసాందర్శనలాలసౌ॥

తా ॥ అనంతరము చిరాయువు, అయనమేనమామయును. నిద్దరు నలసటజెంది మార్గాయాసము దీర్చుకొనునిమిత్తమా యుద్యానవనములోనికిజని యాస్త్రీలను జూచుచుండిరి.

శ్లో॥ క్రీడంతీనాంవినోదేన కుపితాతత్రకాచన । ఉవాచరాజతనయాం సారండేత్యతిదుర్వచః॥

తా ॥ అచ్చటవినోదార్థముగా సాడుకొనుచుండెడి యాస్త్రీలలోనొకతె యాటలయందు లోపముచే రాజకుమార్తెను ఓవిరండా! అనికఠినముగా బలికెను.

శ్లో॥ శ్రుత్వాతదశుభంవాక్య మువాచనృపనందినీ। అయోగ్యం భాషసేత్వంకిం మత్కులేనైవతద్విధా॥

తా ॥ ఇట్లుపలికిన అశుభమైన మాటను ఆరాజకుమార్తె విని ఓచెలియా! నీవు అయోగ్యమైన మాటపలికితివి మావంశమున అయోగ్యమైన వైధవ్యమాట పుట్టదు.

శ్లో॥ ప్రసాదాన్మంగలాగౌర్యా స్తద్వ్రతస్యప్రభావతః। మత్కరాదక్షతాయస్య పతిష్యంతిమూర్ధని॥ వివాహేసచిరాయుస్స్యా దల్పాయురపిచేత్సహి। తతస్సమస్తాస్తాః కన్యా స్స్వంస్వం వేశ్మయయుస్తదా॥

తా ॥ మంగళగౌరీదేవియనుగ్రహమువలనను గౌరీదేవియొక్క వ్రతమహిమవలనను నావివాహకాలమందు నా చేతిమీదుగా తలంబ్రాలు యెవరు శిరస్సున నుంచ బడునో అట్టివాడు అల్పాయుర్దాయము కలవాడైనను చిరకాలము జీవించును అని రాజకుమార్తె పలికెను పిమ్మట నా స్త్రీలందరు వారివారి గృహములకు వెళ్లిరి.

శ్లో॥ తస్మిన్నేవదినేరాజ కన్యాయాఃపాణిపీడనే। రాజ్ఞోబాహ్లీకదేశస్య దృఢవర్మాభిధస్యవై॥ సుకేతునామ్నపుత్రాయ దాతుంసానిశ్చితాభవత్। సుకేతురప్యవిద్యశ్చ కురూపోబధిరస్తథా॥ తతస్తేమంత్రయామాసు స్నేహోనోద్యవరఃపరః। అథసిద్ధేవివాహేతు సుకేతుస్తత్రగచ్ఛతు॥

తా ॥ ఆ రాజకుమార్తె యొక్క వివాహ విషయములో మొదట బాహ్లీకదేశపు రాజయిన దృఢవర్మ యొక్క కుమారుడు సుకేతువు యను వానికి నిశ్చయించిరి పిమ్మట విచారించగా సుకేతువు చదువురానివాడును వికారరూపుగలవాడును చెవిటివాడును అయియున్నందువలన మఱియొక వరుని విచారించి పెండ్లి చేయవలెయును పిమ్మట సుకేతువు వచ్చినను వచ్చుగాక యని నిశ్చయించుకొనిరి.

శ్లో॥ తతశ్చిరాయుషంగత్వా యాచిరేమాతులంప్రతి। దేహో స్మభ్యమయంబాలః కార్యసిద్ధిర్హిణోభవేత్ ॥ పరోపకారతుల్యోహి

ధర్మోనాన్యః పరోభువి। మాతులస్తద్వదశ్శ్రుత్వా చాంతహృష్టమనా హ్యభూత్ ॥

తా ॥ అనంతరము చిరాయువు నను విప్ర దలచిన వారై యాతని మేన మామవద్దకు వచ్చి ఓయీ! మీపిల్లవానిని మాకు నిచ్చిన యెడల నా కుమార్తెను ఆ పిల్లవానికిచ్చి వివాహము చేయుదును నాకార్యము సానుకూలమగును భూమిలో పరోపకారముతో సమాన మగు ధర్మము లేదు అని పలుకగా నా మాటలను మేన మామ విని తనమనస్సులో సంతోషమునొందెను.

శ్లో॥ పూర్వంశ్రుతంచోపవనే కన్యావాక్యమనేనయత్। ఏకవా రంతథావ్యాహ యుష్మాభిర్యాచ్యతేకథం॥ వస్త్రాలంకరణాదీని యాచ్యం కార్యస్యసాధనే। నవరోయాచ్యతేక్వాపి దీయతేగౌరవాద్ధివః॥ వివా హంసాధయామాసు ర్నీత్వాతత్రచిరాయుషమ్। సప్తపద్యాదికేజాతే రాత్రౌగౌరీహరాంతికే ॥

తా ॥ పూర్వ ముద్యానవనములో ఆ చిన్నది పలికిన ప్రకారము గానే యిప్పుడే పెండ్లి చేయుదమని తనమనస్సులో ననుకొని వచ్చి యో రాజా! కార్య సానుకూలము కొఱకు వస్త్రములను ఆభరణములను యాచింతురు గాని పిల్లవానిని యాచింప నవసరములేదు మీయందుగల గౌరముచే పిల్లవానినిచ్చెదనని చెప్పి యా చిరాయువును రాజుగారి యింటికి దీసికొని వెళ్లగా వివాహ విధినంతయుచేసి యా రాత్రి పార్వతీ పరమేశ్వరుల సన్నిధానమందు సప్త పదములు మొదలగు నవియు గావించి సంపూర్తినొందిరి.

శ్లో ॥ సహాసౌమంగళాగౌర్యా సుప్తోహర్షసమన్వితః। తద హ్నిషోడశాబ్దాని సమాప్తానిచిరాయుషః॥

తా ॥ ఇట్లు వివాహము సంపూర్తి యైన పిమ్మట నా చిరాయువు సంతు ష్టాంత రంగుడై యా రాత్రి తాను భార్యయు శయన గృహమునందు శయనించిరి. ఆదినముతో చిరాయువునకు పదియారు సంవత్సరములు సంపూర్తియైనవి.

శ్లో॥ నిశీథేసర్పరూపేణ కాలస్తత్రసమాయివాన్। తదంతరే భూపసుతా జాగ్రతాద్దైవయోగతః॥ సాదదర్శమహాసర్పం చకంపేభ యవిహ్వలా। ధైర్యంకృత్వాతదాబాలా పూజయామాస సోరగం ॥

తా ॥ యిట్లు యా దంపతులిరువురు నిద్రించుచుండగా నర్ధరాత్రియందు పిల్లవానిని జంపుటకు మృత్యుదేవత గొప్పసర్పాకారమును ధరించివచ్చెను ఇంతలో దైవయోగము వలన ఆ చిన్నది మేల్కాంచి యాపామును జూచి భయపడి కొంత వడికి ధైర్యము తెచ్చుకొని యాపామునకు పూజగావించెను.

శ్లో॥ ఉపచారైష్షోడశభి ర్దుగ్ధంపాతుందదౌబహు । ప్రార్థయామాసతంసర్పం దీనవాణ్యాచతుష్టువే॥ యయాచేమంగళాగౌరీ కరిష్యే వ్రతముత్తమమ్।జీవ్యాన్మేపతి రేతస్మాచ్చిరంజీవే త్తదాకురు॥ఏతస్మిన్నంతరేసర్పః కరకేప్రవివేశహ । కంచుక్యాస్వీయయాసాతు చక్రేతన్ముఖబంధనమ్॥

తా ॥ యిట్లు షోడశోపచారములచే పూజగావించి యాసర్పముద్రాగుటకు విశేషముగా పాలునిచ్చెను, మిక్కిలి దీనమగు మాటలతో విశేషముగా నా సర్పమును ప్రార్థించెను ఓ మంగళగౌరీ ! నీవ్రతమును తప్పక జేసెదను నా పెనిమిటి యీ సర్పగండము తప్పించి చిరకాలము జీవించు నట్లుగా జేయుమని గౌరీ దేవిని యాచిన్నది ప్రార్థించగా నంతలో ఆ సర్పము ఒక గిన్నెలో ప్రవేశించిగా నా చిన్నది తన రవికను దీసి సర్పము బయిటకు రాకుండు నట్లుగా గిన్నె మూతికి జుట్టువేసెను.

శ్లో ॥ ఏతస్మింతరేభర్తా అంగమోటనపూర్వకమ్ । జాగృతశ్చాబ్రవీద్భార్యాం క్షుధామాంబాధతేప్రియే॥ మాతుస్సకాశంగత్వా సా చానయామాస పాయసమ్ । లడ్డుకాదిచ తద్దత్తం బుభుజేప్రీతమానసః ॥

తా ॥ యింతలో పెనిమిటి కొంచెము శరీరమునకు బాధకలిగి మేల్కాంచి యోప్రియురాలా! నాకు ఆకలియగుచున్నది తినుటకు నేమైనను తెమ్మనియడుగగా చిన్నది తల్లి వద్దకువెళ్లి పరమాన్నము, లడ్డూలు, మొదలగునవి తెచ్చి పెనిమిటికి నివ్వగా నాతడవిభుజించి సంతసించిన వాడాయెను.

శ్లో॥ హస్తప్రక్షాలనకాలేతు తద్ధస్తాన్ముద్రికాపతత్ । తాంబూలం భక్షయిత్వాతు ప్రసుప్తఃపునరేవసః॥

తా ॥ అనంతరమాతఁడుచేయి కడిగికొను చుండగా నాతనివ్రేలినుండి యుంగర మొకగిన్నెలోపడెను అనంతర మాతఁడు తాంబూలము వేసికొని తిరిగి నిద్ర పోయెను.

శ్లో॥ తతస్సాకరకంత్యక్త మగచ్ఛత్తువిధేర్గతేః । హారకాంతిం బహిస్సృష్ట్వా స్ఫురంతంవిస్మయాంయయౌః। దృష్ట్వాఘటస్థంతంహారం స్వకంఠేచదధారసా । కించిన్నిశావశేషేతు మాతులస్తం నినాయసః॥

తా॥ అనంతరమాచిన్నది యాగిన్నెనుతీసికొని వెళ్లుటకురాగా దైవవశముచే ముత్యాల హారముయొక్క కాంతి బయటికి కనుపించఁగా నాశ్చర్యమునొంది యాగిన్నెమూతికి జుట్టియున్న రవికెను దీసివేసి యందులోనున్న హారమునుతనకంఠమునందు ధరించెను పిమ్మట తెల్లవారుజామున పిల్లవాని మేనమామవచ్చి యాపిల్లవానిని దీసికొనివెళ్లెను.

శ్లో॥ తతస్తేవరపక్షీయా స్సుకేతుంతత్రచానయన్ । దృష్ట్వా తంమంగళగౌరీ ఉవాచాయంనమేపతిః॥

తా॥ అనంతరము సుకేతుసంబంధీకులు సుకేతువుని తీసుకొనివచ్చి నీపెనిమిటిని తీసుకొనివచ్చితిమని యారాజు కుమార్తెయగు మంగళగౌరీతో బల్కఁగా నామె యితను నాపెనిమిటికాడని తిరిగిజవాబుచెప్పెను.

శ్లో॥ తాంమూచుస్తేతతస్సర్వే కిమిదంభాషసేశుభే।పరిచాయకమస్తీహకించిత్తే తద్వదస్వనః॥

తా॥ ఓచిన్నదాన! ఇతను నీపెనిమిటికాడనుటకు నీకేమైన గుర్తుయుండిన చెప్పుమని వారందఱుపలికిరి.

మంగళగౌర్యువాచ॥ శ్లో॥ మేదత్తంయేనరాత్రౌచ నవరత్నాంగుళీయకమ్। అస్యాంగుళౌతన్నిక్షిప్య పశ్యధ్వంపరిచాయకమ్ ॥

తా॥ మంగళగౌరి చెప్పుచున్నది నాపెనిమిటి రాత్రితన వ్రేలియందుండు ఉంగరమునాకిచ్చెను ఆవుంగరము యీసుకేతువు వ్రేలికిపెట్టిచూడవలయును.

శ్లో॥ పత్యాదత్తోస్తిమేహారో రాత్రౌతద్రత్నసంచయః। కిమ్మ శోనేనవాద్యో సౌప్రణిభీరపరాన్వితమ్॥

తా॥ అనేకరత్నములతో గూడినహారము రాత్రి నాపెనిమిటి నాకిచ్చెను ఆహారమునుగురించియు గుర్తులను చెప్పవలెను.

శ్లో॥ కించామ్రిసేచనంరాత్రౌ తత్పదంకుంకుమాన్వితం। ఊరౌమేవర్తతేతచ్చ సర్వేపశ్యతమాచిరమ్॥

తా ॥ మరియు మామిడిచెట్టుకు నీళ్లుపోయుటయు కలదు మరియు కుంకుమతో నలంకరింపఁబడిన యాయన పాదములు నాతొడయందు నుంచినప్పుడు గుర్తుగానుండెను అదియును మీరందఱు చూడవచ్చును.

శ్లో॥ కించరాత్రౌ భాషణాది భక్షణాదిచయత్కృతమ్ । తపనే నచవక్తవ్యం తదాస్యాన్మేపతిస్స్వయమ్॥

తా ॥ మరియు రాత్రినాతో యేయేమాటలను సంభాషించెనో యేయేపదార్థములను భక్షించెనో అదియంతయును నీసుకేతువు యదార్థముగాఁజెప్పినేని యితఁడు నాకుపెనిమిటియని నిశ్చయముగా నొప్పుకొందునని మంగళగౌరిపల్కెను.

శ్లో ॥ ఏవంశ్రుత్వాతుతద్వాక్యం సాధుసాధ్వితిచాబ్రువన్ । ఏకస్యాపినరామాభూత్త దాసర్వైర్నిషేధితః॥

తా ॥ ఇట్లు ఆమంగళగౌరి పల్కఁగా నామాటలను వారందఱువిని యీమె చెప్పినమాటలు బాగుగానున్నవని వారందఱు నొప్పుకొన్నవారై యాసుకేతువునడుగగా నొక్కగుర్తునైనను జెప్పలేకపోయెను అప్పుడు ఆమెకు సుకేతువు పెనిమిటి కాడనిరి

శ్లో ॥ తదాతేవరపక్షీయా జగ్ముస్సర్వేయథాగతమ్ । జనకో మంగళాగౌర్యాశ్శ్రుతకీర్తిఃసుమాద్వహః ॥ అన్నపానాదికం సత్రం చకారసుమహామనాః। వరపక్షస్యవృత్తాంత శ్శ్రుతఃకర్ణోపకర్ణతః॥ స్వరూపస్యసురూపత్వా దానీతఃకశ్చనాదృతః। స్థాపయామాససాధేతు కన్యాంజననికావృతాం॥

తా ॥ అనంతరము సుకేతువుని దీసికొని యాయనసంబంధీకులు వారిండ్లకు వెళ్లిరి పిమ్మట మంగళగౌరియొక్క తండ్రియును కురుదేశాధిపతియునగు శ్రుతకీర్తి మహారాజు నిర్మలమైన మనస్సుగలవాఁడై అన్నపానాదులను సర్వజనులకు నొసగునట్టి సత్రవు నేర్పాటుజేసెను ఇట్లుండఁగా సుకేతువును తీసికొనివచ్చి మంగళగౌరికి పెనిమిటియనుటయు నామెకన పెనిమిటి సుకేతువు కాడనుటవలన వారుతిరిగివెళ్లిపోవుటయు నామంగళగౌరిని యామెతండ్రి మేడయందుంచుటయు నిట్టి సమాచారములను వివాహముజేసికొనిన చిరాయువు నాతని మేనమామయు నితరులవలన వినినవారైరి.

శ్లో॥ ఏవం గతే హాయనే తు యాత్రాం కృత్వా సమాతులః। చిరాయుః ప్రియయా తత్ర కిం జాతమవలోకితుమ్॥

తా॥ ఇట్లు సంవత్సరమైన పిమ్మట చిరాయువు నాతని మేనమామయు కాశీయాత్రను జేసికొనినవారై మంగళగౌరియొక్క వృత్తాంతమేమైనదో తెలిసికొనవలయునని యచ్చటకు వచ్చిరి.

శ్లో॥ తం సా జాలాంతరాద్దృష్ట్వా లోకే త్తరముదాన్వితా। పితరౌ కథయామాస మమ భర్తా సమాగతః॥ సుహృద్గణం సమాహూయ పూర్వోక్తం పరిచాయకమ్। దృష్ట్వా సర్వమపి హ్యస్మై దదౌ కన్యాం శుచిస్మితామ్॥

తా॥ ఆచిరాయువు వచ్చుటచే నామేడయందు తెరచాటునుండి చూచివిశేషమైన యానందముకలదై నన్నువివాహము జేసికొనిన పెనిమిటివచ్చెనని తల్లిదండ్రులతో చెప్పఁగా నప్పుడు తండ్రితన స్నేహితులందఱిని పిలిపించి పూర్వము సుకేతువు నడిగినరీతిగానే యాచిరాయువునుకూడ కొన్నిగుర్తులను జెప్పుమనగానే యన్నిగుర్తులను జెప్పెను అందువలన సంతోషమునొందినవారై యాచిన్నదానిని చిరాయువునకు నప్పగించిరి.

శ్లో॥ శిష్టైః పరిణయోత్సాహం కారయామాస భూపతిః। వస్త్రాణ్యాభరణాదీని సేనామశ్వాన్ గజాన్ రథాన్ ప్రస్థాపయామాస స్నుషా దత్త్వాన్యదపి భూరిశః। పత్న్యా సహ చిరాయుస్స్వమాతులేన సమన్వితః॥ స్వపురం సేనయా సార్ధం జగామ కులనందనః। శ్రుత్వా జనముఖాత్తస్యాగతం పితరౌ ముదా। విశ్వాసం నైవ తౌ చక్రతుర్నైవ స్యాత్కథం త్వన్యథా॥

తా॥ పిమ్మట బంధువులు పెద్దలు మొదలగువారితోగూడి యారాజు కల్యాణమహోత్సవములను గావించి యల్లునకు వస్త్రములు, ఆభరణములు, సేనలు, గుఱ్ఱములు ఏనుగులు, రథములు, మొదలగునవి కానుకలుగానిచ్చి పంపగా నాచిరాయువును తనభార్యను మేనమామను తీసికొని చతురంగబల సమేతుడై మహావైభవముతో నింటికివచ్చుచుండెను ఈవార్తనుజనులవిని యాతనితల్లిదండ్రులతో జెప్పఁగావిని పదునారుసంవత్సరములకంటె నెక్కువజీవించడని భగవంతుడే చెప్పియుండగా దానికి వ్యతిరేకముగా నెట్లుజీవించియుండునని నమ్మకపోయిరి.

శ్లో॥ ఏతస్మిన్నంతరే ప్రాప్తః పితరౌ రంకకమేపసః। పపాతపాదయోర్భక్త్యా పితరౌస్నేహపరిప్లుతౌ॥ మూర్ధ్న్యవఘ్రాయతం పుత్రం పరమానందమాపతుః॥

తా॥ ఇంతలో నాచిరాయువు తల్లిదండ్రుల వద్దకువచ్చి మిక్కిలిభక్తిగలవాడై వారిపాదములకు వందనమాచరింపఁగా వారునువిశేషమైన ప్రేమగలవారై లేవదీసి తొడలయందు కూర్చుండబెట్టుకొని శిరస్సుమూర్కొనిముద్దాడి పరమానందమొందిరి.

శ్లో॥ స్నుషాపిమంగళగౌరీ శ్వశురౌప్రణనామ సా। అంకేనివేశ్యతాం శ్వశ్రూః పప్రచ్ఛాఖిలంతమంజసా॥

తా॥ పిమ్మటకోడలగు మంగళగౌరియు నత్తమామలకు నమస్కరింపఁగా నామెతొడలయందు కూర్చుండబెట్టుకున్నవారై జరిగినవృత్తాంతము నంతయుశీఘ్రముగా జెప్పుమనిరి.

శ్లో॥ స్నుషాపిమంగళాగౌర్యా వ్రతమాహాత్మ్యముత్తమం। కథయామాసతత్సర్వం యథావృత్తంమహామునే॥

తా॥ ఓ మునీశ్వరుఁడా! ఆకోడలును మంగళగౌరీదేవియొక్క శ్రేష్ఠమైన వ్రతమునాచరించుటయు నావ్రతమహిమచే తనపెనిమిటియొక్క ఖండము తప్పిపోవుటయు మొదలగువృత్తాంతము నంతయు సవిస్తరముగా జెప్పెను,

శ్లో॥ ఇత్యేతత్కథితంతుభ్యం మంగళాగౌరికావ్రతమ్। య ఏతచ్ఛృణుయాత్కశ్చి ద్యశ్చాపి పరికీర్తయేత్। మనోరథాస్తస్య సర్వే సిద్ధ్యంత్యత్రనసంశయః॥

తా॥ ఓ మునీశ్వరుఁడా! ఈప్రకారము జరిగియుండెడి మంగళగౌరీ వ్రతమును సవిస్తరముగా నీకు జెప్పితిని కావున యెవడీకథనువినునో చదువునో అట్టివారుకోరిన కోరికలన్నియు పొందగలరు ఇందువిషయమై సందేహములేదు.

సూత ఉవాచ॥ శ్లో॥ సనత్కుమారమిత్యేవం కథయామాస ధూర్జటిః। సచానందంపరం వేభే శ్రుత్వాశ్చర్యకరంవ్రతమ్॥

తా॥ ఓ శౌనకాదిమునులారా! ఈప్రకారము సాంబమూర్తి మంగళగౌరీదేవియొక్క వ్రతవిధానము నంతయు సనత్కుమారునితో జెప్పంగావిని కోరికల

నొసగునదియగుటచే నా సనత్కుమారుడు మిక్కిలియానందము నొందెనని సూతముని శ్వరుఁడుచెప్పెను.

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణమాస మాహాత్మ్యే మంగళగౌరీ వ్రత
కథనంనామసప్తమోధ్యాయస్సమాప్తః.

---

## అథ అష్టమోధ్యాయః

ఈశ్వరఉవాచ ॥ శ్లో॥ బుధగుర్వోర్వ్రతంవక్ష్యే వ్రతంపాపప్రణాశనమ్। యత్కృత్వాశ్రద్ధయామర్త్యః పరాంసిద్ధిమవాప్నుయాత్ ॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాఁడు బుధ గురు వారముల సంబంధమగు వ్రతములను జెప్పెదనువినుము సమస్త పాపములను పోగొట్టునట్టి యావ్రతములను శ్రద్ధగానాచరించిన మనుజుఁడు విశేషమైన కార్యసిద్ధిని పొందగలఁడు.

శ్లో॥ ప్రజాపతిశ్శీతరశ్మిం ద్విజరాజేభ్యషేచయత్ । సకదాచిద్గురోర్భార్యాం తారానామ్నీందదర్శహ ॥ రూపయౌవన సంపన్నాం లావణ్యమదగర్వితామ్ । మోహితోరూప సంపత్త్యా కామబాణవశంగతః॥ స్వగృహేస్థాపయిత్వాతు బలాత్సబుభుజేచతామ్ । ఏవంబహుతిథేకాలే గతేపుత్రోబభూవహ॥

తా ॥ పూర్వము బ్రహ్మదేవుఁడు చంద్రుని ద్విజరాజుఅని యేర్పాటుజేసెను అటువంటిచంద్రుఁడు ఒకానొక సమయంబున రూపము, లావణ్యము, యౌవనము, మొదలగు గుణములచే సమస్తస్త్రీలను మించియున్నదియు తారఅనుపేరుచే బ్రసిద్ధికెక్కియున్న గురుభార్యను చూచినవాడై దానిసౌందర్యాతిశయమువలన మోహము జెంది యామెను తనయింటికి తీసికొనివెళ్లి యామెతో కొంతకాలము సంభోగింపగానామెయందు చంద్రునివలన నొకపుత్రుఁడుదయించెను.

శ్లో॥ బుధోవిద్వాన్ప్రశాలీ సర్వలక్షణసంయుతః । అన్వేషయన్ గురుఃపత్నీం జ్ఞాతవాన్ శశిసద్మని॥ యయాచే దేహిమేభార్యాం

త్వంకథం గురుతల్పగః । గురుతల్ప కృతాత్పాపా న్నిష్కృతి స్తే కథం భవేత్ ॥

తా ॥ ఆపిల్లవాడు సప్తసమలక్షణములుగలవాడును రూపమువిద్య మొదలగు వానిచే ప్రకాశించుచు బుధుడుఅను పేరుచేప్రసిద్ధికెక్కియుండెను ఇట్లుండగా బృహస్పతి తనభార్యను వెదకుచురాగా తారను చంద్రునియింట జూచి యోచంద్రుడా నేనునీకుగురువునుకదా నాభార్యనునీవు తీసుకొనిరాతగునా గురుభార్యతో సంభోగించినవానికి ప్రాయశ్చిత్తములేదుగదా.

శ్లో॥ మహాపాతకసంయోగే కథంతేబుద్ధిరాదృతా । గుప్తమేవప్రయచ్ఛేమాం గురుభార్యాంమమప్రియాం ॥

తా ॥ ఓ చంద్రుడా! ఇట్టిమహా పాతకము చేయుటకు నీకుబుద్ధి యేలాగు కలిగినది కాబట్టి నీకు గురుభార్యయు నాకు ప్రియురాలునగు తారను ఎవరికిని తెలియకమునుపే నాకిమ్ము.

శ్లో॥ ప్రాయశ్చిత్తంచరహసి కృత్వానిలకషోభవ । నోచేదింద్రసమీపేతే అగనంకథయామ్యహం॥

తా ॥ నీవుచేసినపాపమునకు రహస్యముగా నేప్రాయశ్చిత్తము చేసికొనిపవిత్రుడవుగమ్ము ఆలాగున నీవుచేయనియెడల నీవుచేసినఅపరాధమును దేవేంద్రునితో జెప్పెదను.

శ్లో॥ ఇత్యేవంబహుధోక్తోపి నదదౌతాం కలంకితః । తదాదేవసంభాంగత్వా కథయామాసగీష్పతిః॥

తా ॥ ఈప్రకారము బృహస్పతి యనేకవిధములుగా చెప్పినప్పటికియాచంద్రుడు తారయందుగల మోహముచే తారనివ్వలేదు అప్పుడుబృహస్పతి దేవసభకు వెళ్లి యీవృత్తాంతము దేవేంద్రునితో నీవిధముగాజెప్పెను.

శ్లో ॥ చంద్రేణమేహ్యపహృతా భార్యాతాంనదదాతిసః। దేవరాజోసిశక్రత్వం దాపనీయాత్వదాజ్ఞయా॥

తా ॥ ఓయింద్రుడా! నాభార్యను చంద్రుడపహరించెను నేనువెళ్లి నాభార్యనునాకిమ్మని ప్రార్థించిన నివ్వలేదు కాబట్టి నీవు దేవతలకంతికిని ప్రభువుగనుక నీయాజ్ఞప్రకారముగా నాభార్యను నాకిచ్చునట్లు చేయవలయును.

శ్లో॥ నోచేత్త్వాంతత్కృతంపాపం సంక్రమిష్యత్య సంశయమ్ । రాజారాష్ట్రకృతంపాపం భుంక్తేశాస్త్రవినిర్ణయాత్ ॥

తా ॥ ఆలాగు నీవు చేయనియెడల చంద్రుఁడుచేసిన పాపము నీవుపొందగలవు ఎందువల్ల ననగా లోకములో ప్రభువు పాపపుణ్యములను విచారించి దుష్కృతములను చేసినవారికి తగినశిక్షవిధించవలయును అట్లుచేయనిచో ఆదేశవాసుల పాపములను రాజుపొందగలడని శాస్త్రములు నిర్ధారణచేసి చెప్పుచున్నవి.

శ్లో॥ దుర్బలస్యబలంరాజా పురాణేష్వితిభణ్యతే । ఇతిశ్రుత్వా గురోర్వాక్యం చండక్రోధాహ్వయో వాసవః ॥ ఆజ్ఞాపయా మాసరుషా దేహిభార్యాం గురోర్విధో। అన్యదారాభిగమనం సమహాపాతకంభవేత్ । గురుదారాభిగమనం మహాపాతక సంజ్ఞితం । తస్మాచ్చంద్ర గురోర్భార్యాం దేహిత్వమవిచారయన్ ॥

తా ॥ మరియు బలములేనివానికి రాజేబలమని పురాణములయందు చెప్పబడు చున్నది అని యీవిధముగా బృహస్పతి చెప్పిన మాటను దేవేంద్రుడువిని మిక్కిలి కోపముగలవాడై చంద్రునిపిలిపించి యిట్లుచెప్పెను ఓచంద్రుఁడా! ఇతరులభార్యలతో సంభోగము చేసినను విశేషపాపము లేదు గాని గురుభార్యాసంభోగము మహాపాపము కాఁబట్టి నీవువిచారింపక బృహస్పతికి తారనిమ్ము.

శ్లో॥ దేవేంద్రవచనంశ్రుత్వా నిశాపతిరథాబ్రవీత్ । దాస్యేత్వ దాజ్ఞయాభార్యాం పుత్రంనైవదాదామ్యహమ్ ॥

తా ॥ ఇట్లు చెప్పిన దేవేంద్రుని మాటలను చంద్రుడువిని చెప్పుచున్నాడు ఓదేవేంద్రా! నీయాజ్ఞానుసారముగా బృహస్పతికి తారనిచ్చెదను గాని కుమారుడగు బుధునియివ్వను.

శ్లో॥ మత్సకాశాత్సుతోజాతో మమైవభవయుగ్యతః। గీష్పతి స్స్వాహమత్తోభూత్తత్సంశయితాస్సురాః॥ తతస్తేనిర్ణయంచక్రుర్మాతా నానాతిచాంగజమ్ । పప్రచ్ఛుస్తేతదాతారాం కేనాయంగర్భఆహితః॥ సత్యంవదస్వకళ్యాణి నమిధ్యావక్తుమర్హసి । తదాలజ్జాన్వితాతారా జారసోయంవిధోస్సుతః॥

తా ॥ నావలన కుమారుడుకలిగెను కాఁబట్టి నావద్దనే యుండవలెనని చంద్రుఁడుచెప్పెను నావలనకలిగెను కాఁబట్టి నావద్ద యుండవలయునని బృహస్ప

తియున నెను ఇట్లుభయులు వివాద పడుచుండగా దేవతులకుసందేహంకలిగి యిందు విషయమై యథార్థము తల్లికి తెలిసియుండును కాబట్టి యామెనడిగి నిర్ధార ణచేయదలచినవారై తారనుపిలచి యోతారా! ఈపిల్లవాడెవరివలన సంభవించెనో నిజముచెప్పుమని దేవతులడుగగా నప్పుడుతారసిగ్గునుజెంది యీపిల్లవాడుచంద్రుని వలననేకలిగెనని తారపలికెను.

శ్లో॥ గీష్పతేఃక్షేత్రిజత్వాత్తో యోగ్యస్స్యాత్తస్యదీయతాం। శాస్త్రత స్తేవిచార్యాథ దదుశ్చంద్రాయతంబుధమ్॥

తా॥బృహస్పతి క్షేత్రిమునందు బుట్టినవాడు గనుకను చంద్రునకుపుత్రుడు గనుకను ఎవరికినివ్వ వచ్చునని శాస్త్రము విచారించి బుధుని చంద్రునకు నిప్పించిరి.

శ్లో॥ తదాఖిన్నంగురుందృష్ట్వా దదా దేవావరంతదా॥ గచ్ఛ స్వత్వంచంద్రగృహం తవాప్యస్తిసుతోహ్యయమ్॥ చంద్రస్యగీష్పతేశ్చా యం గ్రహత్వంయాత్యసౌసుతః॥

తా॥ అప్పుడు దేవతులు బుధునిచంద్రునకు నిప్పించగా బృహస్పతి చిన్న బోయినమనస్సు గలవాడాయెను. అప్పుడు దేవతులిట్లుచెప్పుచున్నారు బుధుడానీవు చంద్రు నింటికి వెళ్లుము ఆయినను బుధుని విషయములో బృహస్పతికిని చంద్రునకును పుత్రసంబంధముకలదని నుడివిరి.

శ్లో॥ అన్యచ్చాపిసురాచార్య గృహాణేమంవరంశుభమ్। యః కరిష్యతిమేధావీ మిలిత్వా యువయోర్వ్రతమ్। తస్యస్యాత్సకలాసిద్ధి స్సత్యంసత్యంనశంశయః॥

తా॥ ఓ బృహస్పతి మరియొకటి చెప్పెదవినుము నిన్నుబుధుని మీయుభ యులను గూర్చియుకలిపి వ్రతముజేసిన వానికిసమస్తమైన కార్యసిద్ధులు గలుగును సత్యము సంశేహములేదు.

శ్లో॥ శ్రావణేమాస సంప్రాప్తే శంకరస్యమహాప్రియే। బుధ గుర్వోర్వాసరయో ర్యేకరిష్యంతి పూజనమ్॥ నైవేద్యం దధిభక్తేన సాధనే మూలకంభవేత్। యువయోర్మూర్తి మాలిఖ్య స్థానభేదాత్ఫ లంలభేత్।

తా ॥ సాంబమూర్తికి ప్రియకరమగు శ్రావణమాసములో నెవడైనను బుధ గురు వారములయందు బుధుని బృహస్పతి యాకరములను మంటపమునందు వేరు వేరుగా పూజచేసి పెరుగుతో మిళితమైన యన్నమును ముల్లంగి కూరయు నివేదనము చేసినయెడల ఫలమును పొందగలడు.

శ్లో॥ బాలాందోళోపరిస్థానే లిఖిత్వాపూజయేద్యది। సపుత్రం లభతేదీర్ఘా యుష్యంసర్వగుణాన్వితమ్॥

తా ॥ పిల్లలుతిరిగి సంచరించునట్టి గృహమునందు వీరిప్రతిమలనుంచిపూజించినయెడల సమస్తగుణ సంపత్తి కలవాడును దీర్ఘాయువును కలుగునట్టి పుత్రులను పొందును.

శ్లో॥ కోశాగారే లిఖిత్వాతు పూజయేద్యది మానవః। తస్య కోశావివర్ధంతే క్షీయంతేనకదాచన॥

తా ॥ ధనకొట్లయందు ప్రతిమనుంచి పూజించిన యెడల ఎప్పుడు ధనము క్షీణింపక వృద్ధి పొందుచుండును.

శ్లో ॥ పాకాగారేపాకవృద్ధి ర్దేవాగారేతుతత్కృపా। శయ్యాగారేపూజనేతు స్త్రీవినియోగో నకహిచిత్ ॥ ధాన్యాగారే ధాన్యవృద్ధి రేవంతత్తత్ఫలంలభేత్ । సప్తవర్షాణికృత్వైవం తతశ్చోద్యాపనంచరేత్॥

తా ॥ వంటయింటియందుంచి ప్రతిమలను పూజించినయెడల పాకవృద్ధియు దేవతాగృహమందు జరిగినయెడల దేవతుల యనుగ్రహమును, కలుగును పడకయింటియందుంచి పూజించినయెడవ భార్యవియోగమెన్నడును సంభవింపదు ధాన్యకొట్లయందుంచి పూజించినయెడల ధాన్యవృద్ధి కలుగును మరియు నేయేకోరికల నుద్దేశించి పూజించిన నవియన్నియు సఫలమగును ఇట్లు యేడుసంవత్సరములు నాత్రత మాచరించి పిమ్మట యుద్యాపనము చేయవలయును.

శ్లో॥ అధివాస్యాహ్నిపూర్వస్మి న్రాత్రౌజాగరణంచరేత్।సువర్ణ ప్రతిమాంకృత్వా పూజయిత్వా యథావిధి ॥ ఉపచారైష్షోడశభిస్తతోహోమం సమాచరేత్ । తిలైరాజ్యేనచరుణా తద్దైవచసమిచ్ఛయో॥ అపామార్గాశ్వత్థమయై స్తతఃపూర్ణాహుతించరేత్॥ స్వస్తి

యమాతులౌచైవ భోజనీయా ప్రయత్నతః ॥ బ్రాహ్మణో న్భోజయే దన్యా న్భుంజీతస్వాయ మేవచ । ఏవంకృతే సప్తవర్షం సర్వాన్కామానవాప్నుయాత్ ॥

తా ॥ ఒక బంగారపు ప్రతిమను జేయించి దానికిపగలు షోడశోపచారములచే బూజించి రాత్రిజాగరణముచేసి మరునాడుదయము స్నానముజేసి పరిశుద్ధుండై యగ్ని ప్రతిష్ఠాపనముచేసి నువ్వులు, నెయ్యి, అన్నము, ఉత్తరేణి, రావి, సమిధలు మరియు నితరసమిధల చేతను యథావిధిగా హోమముజేసి యనంతరము పూర్ణాహుతిగావించి బంధువులను మేనల్లుడు మేనమామ మొదలగు వారిని ఇతరబ్రాహ్మణులను భుజింపజేసి తానును భుజింపవలయును ఇట్లు యేడు సంవత్సరములు వ్రతమును జేసినవారు సమస్తకోరికలను పొందగలరు.

శ్లో॥ విద్యాకామనయాకుర్యా ద్వేదశాస్త్రార్థవి ద్భవేత్ । బుధతాంవ్రతందద్యాత్ గురుస్తుగురుతాంతథా ॥

తా ॥ విద్యనుకోరి వ్రతమును జేసినయెడల వేదశాస్త్రార్థములను దెలిసినవాడగును బుధుని పూజించుటవలన గౌరవముకలవాడు నగును.

సనత్కుమారఉవాచ ॥ శ్లో ॥ భగవన్యత్త్వయాప్రోక్తం భోజ్యస్వస్రీయ మాతులౌ । ఏతన్నిమిత్తంకథయ యదివక్తుం క్షమం భవేత్ ॥

తా॥ ఓభగవంతుడా! మేనమామను మేనల్లుని భుజింపజేయవలయునని చెప్పితివి దానిని చెప్పుటకు వీలుండునేని దానికికారణము సహేతుకముగా జెప్పవలయును అనిసనత్కుమారు డడిగెను.

ఈశ్వరఉవాచ ॥ శ్లో ॥ పురాకాచిద్ద్విజన్మానౌ దీనౌస్వస్రీయ మాతులౌ। దరిద్రౌపర్యటంతౌ తౌ వుదరార్థంకృతశ్రమౌ ॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు ఓమునీశ్వరా! పూర్వకాలమున బ్రాహ్మణులును దీనులు దరిద్రులునై యుదరపోషణార్థమై చాలాకష్టపడుచుండెడి మేనమామ మేనల్లుడును యిద్దరుకలరు.

శ్లో ॥ కస్మింశ్చిన్నగరేరమ్యే గతౌధాన్యం ప్రయాచితుమ్ గృహేగృహే పశ్యతాంతౌ శ్రావణేమాసిరద్వ్రతమ్।

తా॥ వారిద్దరు ఒకానొకసమయంబున శ్రావణమాసములో నొకమనోహరము గు పట్టణమునకు యాచనచే ధాన్యమును సంపాదించుటకు వెళ్లగా నాయూరిలో ప్రతిగృహమందును బుధ గురువారవ్రతములనే జూచుచుండిరి.

శ్లో॥ చిత్రితద్వారే వ్రతింలిత్త ద్దృష్ట్వా సువర్ణకుబ్జచిత్। అన్యోన్యంతౌ తదాతత్ర విచారంచక్రతుశ్శిరాత్ । వాసరాణాంతు సర్వేషాం వ్రతంసర్వత్రదృశ్యతే। బుధగుర్వోర్వినాతస్మా ద్వాభ్యాం తద్వ్రతం శుభమ్ ॥ అనుష్ఠేయంయతశ్చాస్తి తస్మాత్కర్తవ్యమాదరాత్ । విధ్యజ్ఞానాత్పరంతస్య సంశయంప్రాపతుఃపునః॥

తా॥ అప్పుడు వారిట్లనుకొనిరి అన్నివారములను గురించి వ్రతములను జూచితిమి కాని బుధగురువారవ్రతముల నెచ్చటను జూడలేదు ఇక్కడ ప్రతియింట నాచరించు చుండిరి కాబట్టి మనమును శ్రేష్ఠంబగు నీవ్రతము నాదరముతో నాచరింపవలయునని యన్యోన్యమనుకొనిరి గాని యావ్రతవిధానము దెలియక సందేహము కలవారైరి.

శ్లో॥ తావత్తస్యాంనిశాయాంతు స్వప్నేభూద్విధిదర్శనః। తదాచరితుఃపశ్చాత్పరాంసంపదమాపతుః ॥ ప్రత్యహం వృద్ధిగాచాభూత్సంపత్తిస్సర్వగోచరా। ఏవంకృత్వాసప్తవర్షాణాం పుత్రపౌత్రాది సంయుతౌ॥ సాక్షాద్భూతౌ బుధగురూ వరంచదదతుస్తయోః। యువాభ్యామావయోర్యస్మా ద్వ్రతమేతత్ప్రవర్తితం॥

తా॥ అప్పుడారాత్రియందు భగవంతుని యనుగ్రహమువలన స్వప్నములో నావ్రతవిధాన మంతయును గోచరమయ్యెను అప్పుడు వారిరువురు వ్రతము నాచరించినవారై విశేషమగు నైశ్వర్యము నొందిరి ఆసంపత్తియును దినదినము వృద్ధియగుచుండెను ఇట్లు యేడుసంవత్సరము లాచరించిన వారలై పుత్రులు పౌత్రులు మొదలగు సమస్త సంపత్తులు కలవారైరి. బుధగురు వారవ్రతముల నాచరించి భూలోకములో వ్యాపింపజేయుటవలన బుధుడును బృహస్పతియు సంతసించి వారికి ప్రత్యక్షమై వరములనొసగిరి.

శ్లో॥ ఏవమారభ్యతస్మాద్యః కరిష్యతిశుభంవ్రతం । స్వస్త్రీయమాతులాకేన భోజనీయాప్రయత్నతః । ఏతద్వ్రతప్రభావేన సర్వసిద్ధిఃపరాభవేత్ । అంతేచాస్మల్లోకవాసో యావచ్చంద్ర దివాకరౌ॥

తా ॥ ఓమునీశ్వరా! ఇట్టి వృత్తాంతముజరిగినది కాఁబట్టి యిదిమొదలుకొని బుధగురు వారవ్రతముల నాచరించు వారు మేనమామను మేనల్లుని ముఖ్యముగా భుజింప జేయవలయునని బుధగురువులు చెప్పిరి ఈవ్రతము నాచరించుటవలనసమస్త కోరికలనుపొంది జన్మానంతరమున నాలోకమునకువచ్చి సూర్యచంద్రులుండు నంత కాలము నాలోకములో నివసింతురు.

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాస మాహాత్మ్యే ఈశ్వర

సనత్కుమారసంవాదే బుధగురువారవ్రతకథనంనామ

అష్టమోధ్యాయ స్సమాప్తః

---

## అథ నవమాధ్యాయ ప్రారంభః

ఈశ్వరఉవాచ ॥ శ్లో ॥ అతఃపరంప్రవక్ష్యామి శుక్రవారకథానకమ్। యచ్ఛ్రుత్వాశ్రద్ధయామర్త్యో ముచ్యతేసర్వసంకటాత్ ॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాఁడు ఇకముందు అమృతముతో సమానమగు శుక్రవారకథను చెప్పెదవినుము ఏమనుష్యుడైనను శ్రద్ధగా నాకథను వినినవాడు సమస్త కష్టములవల్లను విముక్తుడగును.

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనమ్। సుశీలో నామరాజాసీ త్పాండ్యవంశసముద్భవః ॥ బహుప్రయత్నశీలోపి హ్యపత్యంనైవచాప్తవాన్। తస్యభార్యాసుకేశీతి నామ్నాసర్వగుణాన్వితా॥

తా ॥ ఓమునీశ్వరా! ఇందునుగురించి పూర్వముజరిగినయొక కథను చెప్పెదను వినుము పూర్వము పాండ్యవంశములోబుట్టిన సుశీలనెడు రాజొకడు ఆయనసంతానము లేనివాడై వ్రతములు, తపస్సులు, మొదలగు ఎన్నిప్రయత్నములు చేసినను సంతానము కలుగలేదు ఆరాజునకు సమస్తగుణ యుక్తురాలగు సుకేశియను భార్య కలదు.

శ్లో॥ అపత్యంనయదాలేభే మహాచింతామవాపసా। స్త్రీస్వభా

వాస్త్రదావస్త్రి ఖండాని ప్రతిమాసికే॥ బధ్వోదరం మహచ్చక్రే మహా సాహసమానసా । అన్యైర్వా యద్గర్భిణీం సా స్వప్రసూత్యనుసారిణీమ్ ॥

తా ॥ ఆరాజు భార్యయును తనకుసంతానము లేకపోవుటచే మిక్కిలివిచారము కలదియగుచు స్త్రీస్వభావముచే నొకసాహస కృత్యమును చేసెను అది యేదియనగా తననడుమునకు గుడ్డపీలికలు జుట్టుకొని తానుగర్భముతో నున్నట్లునటియించుచు ప్రతిమాసమునకును అధికముగా నుండులాగున జుట్టుకొనుచు గర్భముకూడ పెరుగు చున్నట్లు తెలియపరచుచు తనతోకూడ ప్రసవించుటకు సమాన నెలలుకలిగి యథార్థముగా గర్భముతోనున్న స్త్రీయెచ్చట నుండునాయని వెతకుచుండెను.

శ్లో॥ భావినాదైవయోగేన గృహిణీతత్పురోధసః । గర్భిణ్యాసీత్తదారాజ్ఞః పత్నీకపటకారిణీ॥ ప్రసూతికారిణీంకించిత్తత్కాలేప్యసా న్యయోజయత్। దత్వాబహుధనంతస్యై సూతికాయైరహోగతా॥ రాజాచక్రే పుంసవనం తద్దైవానవలోభనమ్ । సీమంతోన్నయనేకాలే మహోత్సవసమన్వితః॥

తా ॥ ఇట్లుండగా దైవవశమున యారాజుగారి పురోహితుని భార్యయు గర్భము కలదాయెను అప్పుడు కపటకృత్యమును చేయదలచినదగుచు మంత్రసానిని బిలచి దానికికొంత ద్రవ్యమునిచ్చి తాను చేయదలచిన కార్యమునందు నియమించి తానంతఃపురమున నుండెను ఆప్పుడు ఆరాజు తనభార్యనిజముగా గర్భిణియనియే తలచి మిక్కిలిసంతోషము కలవాడై పుంసవనము సీమంతము మొదలగు కృత్యముల నాయాకాలముల యందుచేసెను.

శ్లో॥ తస్యాః ప్రసూతిసమయం శ్రుత్వాసాపితథాకరోత్। ఆద్యగర్భవతీయస్మాత్సాపురోధఃకుటుంబినీ ॥ ఆజ్ఞాప్రసూతికాకృత్యేసూతికావచనేస్థితా । తాంసూతికాంవంచయంతీ చక్రేతన్నేత్రబంధనమ్॥ ప్రేషయామాసతంపుత్రం సారాజమహిషీంప్రతి । కస్యచిద్ధస్తతశ్చ్యుత మజ్ఞాతమపికేనచిత్॥ రాజ్ఞీగృహీత్వాతంపుత్రం ప్రసూతాస్మీత్యఘోషయత్ । పురోధస్త్రీనేత్రబంధం మోచయామాససూచికా॥

తా ॥ అనంతరము పురోహితుని భార్యకు ప్రసవ సమయమురాగానే యావార్తను రాజుభార్యవిని మంత్రసానినిబిలచి కొంతకపట యాలోచనచేసి దానితో

చెప్పిపంపగా నామంత్రసాని పురోహితు నింటికివెళ్లి యాయనభార్యతో నీలాగున చెప్పుచున్నది ఓ యమ్మా నీకుయిది మొదటిప్రసవ మగుటవలన నీవుచాలకష్టపడె దవని తలచి రాజుభార్యనన్ను పంపించగా వచ్చితిని నీవు సుఖప్రసవ మగులాగున జేసెదనని చెప్పి నీవుచూచుచుండిన బాధను సహింప జాలవుగాన కండ్లకు గుడ్డకట్ట వలయునని గుడ్డకట్టి ప్రసవమైన పిమ్మట పుట్టిన మగపిల్లవానిని యెవరికిని తెలియనీ యక రహస్యముగా తానునియమించియున్న యొకమనుషిద్వారా రాజుగారిభార్యవద్ద కునంపి పిమ్మట నాబ్రాహ్మణునిభార్య కండ్లకుగట్టిన గుడ్డ నూడదీసెను ఆరాజుగారి భార్యయు నాపిల్లవానిని తీసుకొని తనుప్రసవమైతినని ప్రకటనచేసెను.

శ్లో॥ సహాసీతం మాంసపిండం తస్యైప్రాదర్శయచ్ఛసా । విస్మ
యాచ్చైవభేదంచ స్వీయంచక్రేతదగ్రతః ॥ కిమరిష్టమిదంజాతం పశ్చా
త్కార్యంచశాంతికమ్। సంతతిర్నాస్తిచేన్మాస్తు స్వదిష్ట్యాజీవితాస్మిభోః।
వరంసంచయితాసాసీ త్ప్రసవస్పర్శచింతనాత్ ॥

తా॥ ఈబ్రాహ్మణునిభార్య నిజముగా ప్రసవించియుండగా శిశువుఅచ్చట లేనందుకు నీలాగున మంత్రసాని మాయోపాయము జేసినది అది యేమనగా తాను వచ్చునప్పుడు తెచ్చిన మాంసపు ముద్దనుకనపరచి అమ్మా నీకు జనియించినది యీ మాంసపుముద్దయే యేమినీదురదృష్టము సరియైనశిశువునుజనియింపలేదు ఇట్లు జరిగినం దుకు నీ కెనిమిటిచేతగిన శాంతిని యొనర్పుము సంతానము లేకపోయినను పోనిమ్ము దైవవశముచే నీవైనను బ్రతికితివి అంతేచాలును అనియీరీతిగామంత్రసాని యాశ్చ ర్యము విచారము కలదానివలె కపటముగా నటియించెను ఆబ్రాహ్మణునిభార్యయు తనకుగలిన కొన్నిప్రసవగుర్తులచే నామంత్రసాని మాటనమ్మక సందేహించెను.

శ్లో॥ రాజాశ్రుత్వాపుత్రజన్మ జాతకర్మాద్యకారయత్ । గజా
నశ్వాన్రథాంశ్చైవ బ్రాహ్మణేభ్యోదదౌనృపః॥ బద్ధాన్కారాగృహే
సర్వాన్మోచయామాసహర్షితః । నూతకాంతేనామకర్మసంస్కారా
న్సర్వతోకరోత్ । చక్రేప్రియవ్రతఇతి నామపుత్రస్యభూమిపః ॥

తా॥ అనంతరమారాజు తనకు కుమారుడు కలిగెనని మాటవిని సంతో షము కలవాడై యాశిశువునకుజాతకర్మ మొదలగుక్రియల నాచరించిబ్రాహ్మణులకు ఏనుగులు, గుఱ్ఱములను, రథములను,గోవులను, వెండి,బంగారము, మొదలగునవి కు

దానములనుచేసి చెరసాలలోనుంచబడిన ఖైదీలను విడిపించి పురుడు వెళ్లినపిమ్మట నామకరణమొనరించి యాపిల్లవానికి ప్రియవ్రతుడని పేరుపెట్టెను.

శ్లో॥ శ్రావణేమాసిసంప్రాప్తే పురోధోదయితాసతీ । జీవంతికాంశుక్రవారే పూజయామాస భక్తితః ॥ కుడ్యేవిలిఖ్య తన్మూర్తిం బహుబాలసమన్వితామ్ । పుష్పమాలికయాపూజ్య పంచదీపైరదీపయత్ ॥ గోధూమపిష్టసంభూతైః స్తానభక్ష్యమతస్స్వయమ్ । అక్షతాంశ్చైవచిక్షేపయత్రి మే బాలకోభవత్ ॥ తత్రత్వాయారక్షణీయో జీవంతికరుణార్ణవే। ఇతిప్రార్థ్యకథాంశ్రుత్వా నమశ్చక్రేయథావిధి ॥

తా॥ అనంతరమా బ్రాహ్మణునిభార్యమంత్రసాని చెప్పినమాటలను నమ్మక తన్నుమోసపుచ్చినదని దలచి శ్రావణమాసములో జీవంతికాదేవి వ్రతమునుచేయనిశ్చయించి యామాసము రాగానే యొకగోడమీద జీవంతికాదేవియొక్క యాకారమును మరికొన్నిబాలుల యాకారములను లిఖియించి పుష్పమాలికలతో బూజించి గోధుమపిండితో నైదు జ్యోతులనుచేసి వెలిగించి షోడశోపచార పూజల గావించి నివేదనముచేసి దయాసముద్రురాలవగునోజీవంతికాదేవీ! నాపిల్లవాడెక్కడనుండినను వానిని నీవురక్షింపుచుండుమని ప్రార్థించి దేవిమీద నక్షతల నుంచి యథావిధిగా ప్రదక్షిణ నమస్కారములనుజేసి కథనువిని పూర్వముతాను వెలిగించిన యైదుజ్యోతులను భక్షించెను.

శ్లో॥ జీవంతికాప్రసాదేన దీర్ఘాయుర్బాలకోభవత్ । రరక్షతమహోరాత్రం దేవీతన్మాతృగౌరవాత్ ॥

తా॥ ఇట్లు ఆబ్రాహ్మణునిభార్య చేసినవ్రతమువలన జీవంతికాదేవి యనుగ్రహించి రాత్రింబగల్లును పిల్లవానికి యేమియు నరిష్టము సంభవింపకుండా రక్షింపుచుండెను.

శ్లో॥ ఏవంకాలేగతేరాజా కాలధర్మముపేయివాన్ । పితృభక్త్యోద్ధతత్పుత్ర శ్చక్రేతత్సాంపరాయికమ్ ॥

తా॥ ఇట్లుకొంతకాలము జరిగినపిమ్మట నారాజు మృతినొందగాతండ్రియందు భక్తికలిగినవాడై యాపిల్లవాడు ఆరాజునకు పరలోక కృత్యముల నన్నియు జేసెను.

శ్లో ॥ ప్రియవ్రతోభిషిక్తోథ వా ప్రిజ్యేమంత్రిపురోహితైః। పాలయిత్వా ప్రజారాజ్యం భుక్త్వాసకతిచిత్సమాః॥

తా ॥ తండ్రి పోయిన పిమ్మట మంత్రులు, పురోహితులు, మొదలగు వారు కుమారుడగు ప్రియవ్రతునకు పట్టాభిషేకము గావించగా నాతండును ననురాగము ప్రజలకు ననురాగము కలవాడై పాలించుచు కొన్ని సంవత్సరములు రాజ్యము జేసెను.

శ్లో॥ పిత్రృణస్యవిమోక్షాయ గయాంగంతుంపరిచక్రమే। రాజ్యభారమమాత్యేషు స్థాప్యవృద్ధేషుభక్తితః॥

తా ॥ ఇట్లు కొంతకాలము రాజ్యముజేసి తండ్రియొక్క ఋణమును తీర్చుకొనుటకు గయలో పిండమువేయ దలచిన వాడై వృద్ధులును, యోగ్యులగుమంత్రులకు రాజ్యము నప్పగించెను.

శ్లో ॥ రాజభావంపరిత్యజ్య వేషంకార్పటికందధే। మార్గమధ్యేక్వచిత్పుర్యాం కస్యచిద్గృహమేధినః॥ చక్రేనివాసంగృహేతస్య ప్రసూతాగృహిణీత్వభూత్। పురావష్ట్యాః పంచమేహ్ని తత్పుత్రాః పంచమారితాః ॥

తా ॥ అనంతర మారాజు తనరాజువేషమునువిడిచి కాశీయాత్రకు వెళ్లేవాని వేషము నవలంబించి కొంతదూరము వెళ్లగా నొకగ్రామములో నొకగృహస్థు నింట నొకదినమున నుండెను ఆగృహస్థుని భార్యయు ప్రసవించి యాదినమునకు నైదుదినములాయెను ఆగృహస్థుని భార్యయు ఇదివరలో నైదు పర్యాయములు ప్రసవించుటయు ప్రసవించి యైదవదినమందు షష్ఠియను బాలగ్రహమువచ్చి పిల్లవానినిజంపుటయు ప్రతి ప్రసవమునకు జరుగుచుండెను,

శ్లో ॥ తదాపిపంచమదిన మాసీత్తత్రనృపోగతః। రాత్రౌసుప్తేనృపేషష్ఠీ బాలంనేతుంసమాగతా ॥ జీవంత్యావారితాసాతు నృపము ల్లంఘ్యమావ్రజ। షష్ఠీనిషేధాజ్జీవంత్యా సాజగామయథాగతా ॥

తా ॥ ఆరాజు వెళ్లినదినము ప్రసవించిన దినమునకు నైదవ దినమై యుండుటవలన పూర్వము వలెనే పిల్లవానిని జంపుటకు రాజు నిద్రించుచుండగా షష్ఠియను బాలగ్రహమువచ్చినది అప్పుడు జీవంతికాదేవి వచ్చియచ్చట ప్రియవ్రతుడను

రాజుపరుండి యున్నాఁడు ఆయనను అతిక్రమించి నీవువెళ్ల కూడదు అనిజీవంతికా దేవి యాటంకపెట్టగా ఆబాలగ్రహము పిల్లవానిని జంపక తిరిగివెళ్లెను.

శ్లో॥ జీవితంపంచమదినే బాలంతేభేగృహాధిపః । ఏతత్ప్రభావః ప్రాయోయం ప్రార్థయామాసతంనృపమ్॥

తా ॥ పూర్వముప్రతి ప్రసవమునకు నైదవదినమందే శిశువు మరణించుటయు నిప్పుడుఆవిధముగా జరుగక జీవించియుండుట జూచి యిదియంతయుమనయింటికి వచ్చిన యీరాజుగారి మహిమయనితలచి యిట్లుప్రార్థింప మొదలిడిరి,

శ్లో ॥ రాజన్నద్యతనేచాహ్ని తవవాసోస్తుమేగృహే । తవప్రసాదాన్మేబాల షష్ఠోయంజీవితఃప్రభో॥

తా ॥ ఓరాజా! యీదినమందు మాగృహంబున నివసించి వెళ్లవలయును ఏలనవగా ఇదివరలో ప్రసవించిన నైదవదినమందు పిల్లవాడు మరణించుచుండెను ఈప్రకారమైదు పర్యాయములు జరిగెను ఇప్పుడు ఆఱవపిల్లవాడు రాత్రితమరు మా గృహంబున నివసించి యుండుటచే నరిష్టమును జెందక సుఖముగా జీవించుచున్నాడు అనియాగృహస్థులు రాజునుప్రార్థించిరి.

శ్లో॥ ఏవంసంప్రార్థితస్తేన ఉవాచకరుణానిధిః । తతోగత్వాగయాంరాజా ప్రవృత్తఃపిండపాతనే॥ విష్ణుపాదేతత్రకించి ద్దత్వాశ్చర్యమభూత్తదా। పిండస్యగ్రహణార్థంహి నిస్సృతంతుకరద్వయమ్॥పరంవిస్మయమాపన్న స్సంశయంప్రాపభూపతిః । బ్రాహ్మణానుమతఃపశ్చాత్పిండంవిష్ణుపదేదదౌ॥

తా ॥ ఇట్లు రాజును స్తుతియింపఁగా నారాజు యిదియంతయు నీశ్వరుని యనుగ్రహమేకాని నాశక్తికాదనిచెప్పి గయకు వెళ్లి విష్ణుపాదమునందు పిండము వేయుగా నాపిండమును గ్రహించుటకు రెండుచేతులు సాచబడెనుఅదిజూచి రాజు ఆశ్చర్యమును పొంది సందేహము కలవాడై యచ్చట కర్మను చేయించుచుండెడి బ్రాహ్మణుని ఇదియేమి యాశ్చర్యముగా నున్నదని యడుగగా నాబ్రాహ్మణుఁడు తిరిగి పిండము వేయుమనిచెప్పెను ఆరాజుతిరిగి పిండమువేసెను.

శ్లో॥ సప్రచ్ఛబ్రాహ్మణంకంచిత్ జ్ఞానినంసత్యవాదినం। సచాహబ్రాహ్మణస్తస్మై పితృద్వయకరావిమౌ॥ కిమిదంత్వద్గృహేగత్వా

మాత్రే పృచ్ఛపదిష్యతి । తతశ్చింతాతురో దుఃఖీ హృదినానావిచారయత్॥

తా ॥ అనంతరమారాజు సత్యసంధుడును జ్ఞానియునైన యొక బ్రాహ్మణునితో పిండములకు రెండుచేతులు సాచబడుటయను వృత్తాంతమును చెప్పఁగావిని యిద్దరుతండ్రులకు బుట్టిన వానికి నీవిధముగా జరుగును. దీని యథార్థము నీతల్లికి తెలియును కావున యింటికి వెళ్లి నిజము తెలిసికొనుమని యాబ్రాహ్మణుఁడు చెప్పఁగా వినియు రాజు మనస్సున దుఃఖముకలవాడై విశేషముగా విచారపడెను.

శ్లో ॥ యాత్రాంకృత్వాత్రయాణో యత్రాసౌజీవితశ్శిశుః । తదాపిపంచమదిన మాసీత్తైవప్రసూతికా॥ ద్వితీయోప్యభవత్పుత్రో రాత్రౌషష్ఠిసమాగతా। పునశ్చజీవంతికయా నిషిద్ధాసాబ్రవీచ్ఛతామ్॥ ఏతస్యావశ్యకంకింతే ఏతన్మాత్రాచకింవ్రతమ్। క్రియతేహియతస్త్వంచ ఏనంరక్షస్యహర్నిశమ్॥

తా ॥ ఇట్లు ఆరాజు యాత్రలన్నియు సేవించుకొని తిరిగియింటికి వెళ్లుటకు బయలుదేరుసరికి కొన్ని సంవత్సరములు పట్టెను తిరిగిపూర్వపు మార్గమునే వచ్చుచు పూర్వందిగిన బ్రాహ్మణుని యింటికే వచ్చెను అప్పుడును ఆబ్రాహ్మణుని భార్యప్రసవించిన యైదుదినములాయెను రెండవకుమారుడు కలిగెను పూర్వమువలెనే షష్ఠియను బాలగ్రహము పిల్లవానిని జంపుటకు రాగానే జీవంతికయను దేవతవచ్చి యాటంకపరచెను అప్పుడు బాలగ్రహము జీవంతికనడుగుచున్నది ఏమి నేను ఎన్నిపర్యాయములు పిల్లలను జంపుటకు వచ్చినప్పటికి నాటంకపరచెదవు ఈరాజు వినయమై యింతప్రేమయేల ఈతనితల్లి యేమివ్రత మాచరించినదని యడిగెను.

శ్లో॥ షష్ఠీవాక్యమితిశ్రుత్వా జీవంతీప్రాహసుస్మితా। తన్నిమిత్తే నిశిద్రష్టుం జాగ్రదాసీన్నృపాస్వపన్॥ సంవాదముభయోరాజా శుశ్రావసకలంతదా। శ్రావణేభృగువారేతు ఏతన్మాతామమార్చనే॥

తా ॥ ఇట్లు పలికిన షష్ఠీవాక్యమును విని జీవంతిక చెప్పుచున్నది వీరుభయులు మాట్లాడుచుండగా నారాజు నిద్రపోవు వానివలె వీరి మాటలను వినుచుండెను అప్పుడు జీవంతిక చెప్పిన దేమనగా ఈరాజుయొక్క తల్లి శ్రావణమాసములో శుక్రవారమునందు నన్ను పూజించుచుండును.

శ్లో॥ వ్రతస్యనియమంసర్వం కురుతేతంవదామితే । హరిద త్తే నవసనం హారితంకంచుకంతథా ॥ నధారయతితద్వర్ణం కాచకంకణ కంకరే । కదాపినోల్లంగయతి తండులక్షాళనోదకమ్ ॥ నైవగచ్ఛేత్తధ స్తాచ్చహరిత్పల్లవమండపమ్ । కృకలస్యచశాకంనానాశ్నాతి హరివర్ణత:॥ సర్వమేవ మమప్రీత్యై మారయిష్యామి మాసుతమ్ । శ్రుత్వా సర్వంనృపః ప్రాత ర్జగామస్వపురంప్రతి॥

తా॥ ఆ చిన్నది వ్రత మాచరింపుచు చేసెడి నియమము లను చెప్పెదను వినుము, ఆకుపచ్చ వర్ణముగల బట్టను రవికెను ధరియింపదు, అట్టి వర్ణము గల గాజులను తొడుగుకొనదు, బియ్యం కడిగిన నీళ్లను దాటదు ఆకు పచ్చనిచిగుళ్లతో చేర్చరచిన మంటపము క్రిందుగా దూరి వెళ్లదు, పచ్చని వర్ణము కలుగుట వలన ఆకుకూరలను భక్షింపదు, ఈ ప్రకారము సమస్తము నాకు ప్రీతికరముగాజేయును కాంబట్టి ఆపిల్లవాడిని చంపకుండా రక్షించెదను, యిట్లు జీవంతిక బాల గ్రహముతోను చెప్పిన మాటలను వినెను తర్వాత రాజు ఉదయమున లేచి తన పట్టణమునకు తాను వెళ్లెను.

శ్లో॥ ప్రత్యుద్గతానాగరికా ద్విశికాస్సర్వ ఏవహి। సప్రచ్ఛమాతరంరాజా త్వయాజీవంతికావ్రతమ్॥ క్రియతేతుకథంమాత నవేద్మీతి చసాబ్రవీత్। సాద్గుణ్యార్థంతు యాత్రాయాం బ్రాహ్మణాంశ్చసువాసినీః॥ ఇచ్ఛన్నృపోభోజయితుం వ్రతంచాపిపరీక్షితుం । సువాసినీభ్యో వస్త్రాణి కంచుక్యఃకంకణానిచ॥ ఆగంతవ్యంభోజనార్థం సర్వాభీరాజ సద్మని । తతఃపురోధసఃపత్నీ తత్రిదూతమువాచహ॥

తా॥ యిట్లు రాజు తన పట్టణమునకు వచ్చు సరికి ఆ పట్టణమున నుండు వారు ఆ చుట్టు ప్రక్కల వారు వందరు నెదురుగా వచ్చియింటికి తీసికొని వెళ్లిరి. అనంతరము ఓ తల్లీ! నీవు జీవంతికా వ్రతమును చేసితివా యని రాజు అడుగగా నేను చేయలేదని తల్లి చెప్పెను అప్పుడు పరీక్షించి వ్రతమును జేసిన వారిని తెలిసి కొన దలచిన వాడై రాజు కాశీయాత్ర చేసికొని వచ్చెనుగాన దానికి సఫలంగా బ్రాహ్మణులకు సమారాధన జేసి బ్రాహ్మణులకు వస్త్రములను సువాసినీ స్త్రీలకు చీరెలను రవికలను కంకణములను నిచ్చునుగాన అందరును రావలసినదని చాటింపు వేయగా నప్పుడు పురోహితునిభార్య దూతతోనిట్లు చెప్పెను.

శ్లో॥ హరిద్వర్ణాంమయాకించి ద్దృష్ట్వాతేనకదాచన॥ దూతో నివేదయామాస రాజ్ఞేతస్యాఃప్రభాషితమ్॥

తా ॥ ఓయీ! ఎప్పుడును ఆకు పచ్చని వర్ణముగల వస్తువులను నేను ధరించనని యాదూతతో చెప్పఁగా నామాటను విని దూత రాజుతో బ్రాహ్మణుని భార్య చెప్పిన మాటలన్నియు జెప్పెను.

శ్లో॥ రాజాసర్వాంరక్తవర్ణాం తస్మైసంప్రేష యచ్ఛుభమ్ । అంగీకృత్యచతత్సర్వం సాపిరాజగృహంయయౌ ॥

తా ॥ అప్పుడు రాజు ఆ బ్రాహ్మణుని భార్యకు నెఱ్ఱని వర్ణము గలవస్తువులను పంపగా నవితీసికొని రాజు గారి గృహమునకు వెళ్లెను.

శ్లో ॥ పూర్వద్వారేతండులానాం దృష్ట్వాక్షాలనజంజలం। మంటపంచహారిద్వర్ణం దృష్ట్వాన్యద్వారతోయయౌ ॥

తా ॥ అప్పుడు రాజు పరీక్షార్థమై తూర్పు వాకిటను ఆకుపచ్చని చిగుళ్లు మొదలగు వానితో మంటపమును కట్టించి యా వాకిటనే బియ్యము కడిగిన నీళ్లు పోయించగా నాపురోహితుని భార్య యానీళ్లను త్రొక్కి యామంటపము గుండా వెళ్లుటకు నిష్టములేక మఱియొక ద్వారముగుండా లోపలికి వెళ్లెను.

శ్లో॥ రాజాపురోధసఃపత్నీం నత్వాపప్రచ్ఛచాఖిలమ్।నిమిత్తం నియమస్యాస్య సాప్రోవాచవ్రతంభృగో॥

తా ॥ యిది యంతయు రాజు చూచి యా బ్రాహ్మణుని భార్యకు నమస్కరించి ఆకు పచ్చని రంగుల వస్తువులను ధరించక పాపుటయు కడిగిన నీళ్లను దాటకుండుటయు మొదలగు నియమములను నీ వేల నవలంబించితి వని యడుగగా నేను శుక్రవారము నందు జీవంతికా వ్రతమును చేయుదును గనుక పూర్వము చెప్పిననియమముల నవలంబించితినని యామె చెప్పెను

శ్లో ॥ తంచదృష్ట్వాతునాదాత్కాంతం పస్రుతౌ తత్పయోధరౌ । రాజాసంతంసిషిచతు ధారాభిస్సర్వతిస్తనౌ ।

తా ॥ మఱియు నారాజును చూడగానే యా పురోహితుని భార్యయొక్క స్తనముల వలన పాలు స్రవించు చుండెను.

శ్లో॥ గయాయాంకరద్వయుగ్మేన దేవ్యాస్సంపాదత స్తదా। స్తనయోః ప్రస్రవాచ్చైవ రాజా ప్రత్యయమాపసః॥ పాలికామాతరంగత్వా పప్రచ్ఛవినయాన్వితః। మాభైర్మాతర్బ్రూహిసత్యం వృత్తాంతంమమ జన్మనః॥

తా॥ గయలో పిండమును గ్రహించుటకు రెండు చేతులు సాచుట వలనను జీవంతిక యొక్కయు బాలగ్రహము యొక్కయు సంభాషణ వలనను తన్నుచూడగానే పురోహితుని భార్యకు పాలు స్రవించుట వలనను నమ్మకముకలిగి పెంపుడు తల్లి యొద్దకు వెళ్లి వినయముతోగూడి యోతల్లీ! నీవు భయపడవద్దు నాజన్మ మెటువంటిదో సత్యముగా చెప్పుమని రాజు అడిగెను.

శ్లో॥ శ్రుత్వాసుకేశినీప్రాహ యాథాతథ్యేనసర్వశః। హృష్టోభూత్వానమశ్చక్రే పితరౌస్వస్యజన్మదౌ॥ సంపత్త్యా వర్ధయామాస తౌపరాంముదమాపతుః। ఏకస్మిన్దివసేరాజా జీవంతీంప్రార్థయన్నిశి॥ జీవత్యాయంజన్మదోమే గయాయాంచకరౌకథమ్। తదాస్వప్నగతా దేవీ ప్రాహసంశయనాశకమ్॥ మయాత్వత్ప్రియయార్థేయం మాయాం కృత్వానసంశయః॥ ఏతత్తేసర్వమాఖ్యాతం శ్రావణేభృగువాసరే। ఏతద్వ్రతమనుష్ఠాయ సర్వాన్కామానవాప్నుయాత్॥

తా॥ యిట్లు రాజు పలుకగా నా మాటలను విని రాజుగారి భార్య యగు సుకేశిని తాను చేసిన కపట కృత్యమునంతయు యథార్థముగా జెప్పెను అప్పుడు రాజు సంతసించి తనయొక్క జన్మకు కారణ భూతులయిన తలి తండ్రు లకు మనస్సున నమస్కారము గావించి యా తలితండ్రులకును విశేషమగు ధన ధాన్య సంపత్తుల నొసగగా వారును మిక్కిలి సంతోషించిరి, అనంతర మొకనాటి రాత్రిజీవంతికా దేవిని మనస్సున ధ్యానించి యోతల్లీ ! ఈ బ్రాహ్మణుని భార్య నా యొక్క జన్మకు కారణమై యుండగా నిట్లు రెండవ వారికి కూడ నాకు తలితండ్రు లనుగా నెట్లు చేసితి వని తలపగా నా రాజు యొక్క స్వప్నములో జీవంతికా దేవి కనబడి నీకు మేలు చేయు నిమిత్తమై యిదియంతయు నామాయచే జేయబడినదని చెప్పి యం

రాజుయొక్క సందేహమును పోగొట్టెను కాబట్టి ఓయీ మునీశ్వరా! శ్రావణ శుక్రవారమున జీవంతికా వ్రతమును చేయువాడు సమస్త కోరికలను పొందును.

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే

శ్రావణమాస మాహాత్మ్యే శుక్రవారజీవంతికా

వ్రత కథనంనామ నవమోధ్యాయః

సమాప్తః.

---

అథ దశమాధ్యాయ ప్రారంభః

ఈశ్వరఉవాచ ॥ శ్లో॥ అతఃపరం ప్రవక్ష్యామి మందవారవిధిం తవ। సనత్కుమారయత్కృత్వా మందత్వంనైవజాయతే ॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓసనత్కుమారా ఇక ముందు శనివార వ్రత విధిని చెప్పెదను వినుము ఆ వ్రతము నాచరించుటచే మాంద్యము పోయి చురుకుగానుండును.

శ్లో॥ శ్రావణేమాసి దేవానాం త్రయాణాంపూజనంశనౌ । నృసింహస్యశనేశ్చైవ అంజనీనందనస్యచ॥

తా ॥ శ్రావణమాసములో శనివారమునందు నృసింహమూర్తి, శనైశ్చరుడు, ఆంజనేయులు అను ముగ్గురియొక్కయు పూజను చేయవలయును.

శ్లో॥ కుడ్యే స్తంభేథవాలిఖ్య నృసింహ ప్రతిమాంశుభాం । హరిద్రాయుక్చందనేన లక్ష్మ్యాసహ జగత్పతిమ్ ॥ సంపూజ్యనీల పుష్పైశ్చ రక్తైః పీతైశ్చశోభనైః । నైవేద్యంఖచ్ఛడీసంజ్ఞం శాకంకుంజారసంజ్ఞితమ్॥ స్వయంచైవతదశ్నీయా ద్బ్రాహ్మణాంశ్చైవభోజయేత్ । తిలతైలంఘృతస్నానం నృసింహస్యప్రియంభవేత్ ॥

తా ॥ గోడమీదగాని స్తంభముమీదగాని జగత్ప్రభువగు నృసింహమూర్తి యొక్క ప్రతిమను లక్ష్మీదేవిప్రతిమను పసుపుకలిపిన మంచిగంధముతో లిఖించి శుభప్రదములగు నల్లనిపుష్పములు, యెఱ్ఱనిపుష్పములు, మొదలగువానిచే పూజించి

ఖర్జూరాయలుం,చక్కెరములు,నివేదనజేసి ఆపిండివంటకములచే తాను అనుభవించవలయును బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును నూనెతోను నేతితోను అభ్యంగనము జేయుట నృసింహమూర్తికి ప్రియమగును.

శ్లో॥ శనైశ్చరదినే తైలం ప్రశస్తం సర్వకర్మసు । అభ్యజ్యబ్రాహ్మణాం స్తద్వత్సువాసిన్యస్తు తైలతః ॥ స్వయమభ్యజ్య చస్నాయాత్కుటుంబసహితశ్శనౌ। మాషాన్నంచప్రకర్తవ్యం ప్రీణాతినరకేసరీ॥

తా॥ శనివారమునందు అన్ని కర్మలయందును నూనె యుపయోగించుట ముఖ్యము కాఁబట్టి బ్రాహ్మణులకు సువాసినీస్త్రీలకును నూనెతో నభ్యంగము జేయించవలయును శనివారమునందు తానును కుటుంబ సహితముగా నూనెతో నభ్యంగనము చేయవలయును గారెలతోకూడ యన్నమును నివేదన చేసినయెడల నృసింహమూర్తి సంతోషించును.

శ్లో॥ ఏవంచతుష్షువారేషు శ్రావణేమాసితద్వ్రతమ్ । కుర్వీత స్తస్యసదనే లక్ష్మీః స్థిరతరాభవేత్ ॥ ధనధాన్యసమృద్ధిశ్చ అపుత్రః పుత్రవాన్భవేత్ ।ఇహలోకేసుఖంభుక్త్వా అంతేవైకుంఠమాప్నుయాత్ ॥

తా॥ ఈప్రకారము శ్రావణమాసములో నాలుగుశనివారములయందు వ్రతముచేసినయెడల వానియింట లక్ష్మీదేవి స్థిరముగా నివసించి యుండును ధనము, ధాన్యము, సమృద్ధిగానుండును పుత్రులులేనివాడు పుత్రులుకలుగువాడగును ఈలోకంబున సమస్తసుఖముల ననుభవించి యంత్యకాలమందు మోక్షమునొందును.

శ్లో॥ దిగ్వ్యాపినీచసత్కీర్తి నృసింహస్యప్రసాదతః ! ఏతత్తే కథితంసౌమ్య నృసింహవ్రతముత్తమమ్॥

తా॥ నృసింహమూర్తి యనుగ్రహమువలన పది దిక్కులయందు వ్యాపించునట్టి కీర్తిగలవాడగును ఇది శ్రేష్ఠమైనది కాఁబట్టి నృసింహ వ్రతమును నీకు జెప్పితిని.

శ్లో॥ ఏవంశనిప్రీణనయా కర్తవ్యంతచ్ఛృణుష్వభో । ఖంజం బ్రాహ్మణమేకంతు తదభావేతు కంచన ॥ అభ్యజ్యతిలతైలేన స్నాపయేదుష్ణవారిణా। నృసింహోక్తేనచాన్నేనభోజయేచ్ఛ్రద్ధయాన్వితః॥

తా॥ ఈప్రకారముగానే శనైశ్చరుని యొక్కయు ప్రీతికొరకు చేయదగిన వ్రతమును జెప్పెదవినుము ఒకకుంటి బ్రాహ్మణునిగాని లేకకుంటిలేని బ్రాహ్మణుని గాని తీసుకొనివచ్చినువ్వులనూనెతో తలంటి వేడినీళ్లుపోసి స్నానముచేయించవలెను.

శ్రద్ధ గలవాడై నృసింహ వ్రతము నకు చేసిన పదార్థములనే చేసి భుజింప చేయవలయును.

శ్లో॥ తైలంలోహంతిలాన్మాషా న్దద్యాత్కృష్ణజలమేవచ। శనైశ్చరప్రీణనాయ శనిశ్చప్రీయతామితి॥

తా ॥ శనైశ్చరుఁడు నాయందు దయగలవాఁడుగా నుండవలయునని శనిసంతోషించుట కొరకు నువ్వులనూనె, యినుము, నువ్వులను, మినుములు, కంబళి, మీట్ల సుదాన మియ్యవలయును.

శ్లో ॥ శనైశ్చరస్యాభిషేకం తిలతైలేన కారయేత్ । పశ్చస్తాఅక్షతా స్తస్య పూజనేతిలమాషయోః॥

తా ॥ నువ్వులనూనెతో శనైశ్చరునకు నభిషేకము చేయవలయును శనిని పూజించుటకు నువ్వులను, మినుములను, అక్షతలుగా నుపయోగింప వలయును.

శ్లో॥ ధ్యానంతస్యచవక్ష్యామి శృణుష్వావహితోమునే । శనైశ్చరఃకృష్ణవర్ణో మందః కాశ్యపగోత్రజః ॥ సౌరాష్ట్రదేశ సంభూత స్సూర్యపుత్రో వరప్రదః । దండాకృతిమండలేస్యా దింద్రనీలసమద్యుతిః ॥ బాణబాణాసనధరశ్శూల భృద్గృధ్రవాహనః । యమాధిదైవత శ్చైవ బ్రహ్మప్రత్యధిదైవతః॥ కస్తూర్యగురుగంధస్స్యా త్తథాగుగ్గులు ధూపకః। కుసురాన్నప్రియశ్చైవం విధోస్యపరికీర్తితః ॥

తా ॥ ఓమునీశ్వరుఁడా! ఈశనైశ్చరుని ప్రార్థన జేయు విధానమును జెప్పెదను సావధానుడవై వినుము నల్లనివర్ణముగలవాఁడును, మెల్లగా నడచువాఁడును, కాశ్యపగోత్రుఁడును, సౌరాష్ట్రదేశాధిపతియు, సూర్యుని కుమారుఁడును, వరములనిచ్చువాఁడును, దండకార మండలంబున నుండువాఁడును, ఇంద్రనీల మణులతో సమాన కాంతిగలవాఁడును, బాణములను ధనుస్సును ధరించువాఁడును, శూలమును ధరించువాఁడును, గద్దవాహనము గలవాఁడును అధిదైవతయముఁడును, ప్రత్యధిదైవత బ్రహ్మయుగలవాఁడును, కస్తూరి అగరు మిళితమైన గంధమును పూసికొనినవాఁడును, గుగ్గులుధూపముగా గలవాఁడును, పులగమునందు ప్రీతిగలవాఁడునగు శనైశ్చరుఁడు నన్ను రక్షించుగాకయని ధ్యానముజేయవలయును.

శ్లో॥ ప్రతిమాపూజనేచాస్య కార్యాలోహమయీశుభా। అస్యోద్దేశేనపూజాయాం దానంకృష్ణంద్విజోత్తమ ॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! శనైశ్చరుని పూజించుటకు యినుప ప్రతిమ చేయించుటముఖ్యము శనిని యుద్దేశించి పూజింపునప్పుడు నల్లని వస్త్రములను దానమియ్యవలయును.

శ్లో॥ కృష్ణవస్త్రయుగం దద్యా ద్దద్యాద్గాం కృష్ణవత్సకామ్। ఏవం సంపూజ్య విధివ త్ప్రార్థయేచ్ఛ స్తువీత చ॥

తా॥ రెండు నల్లని వస్త్రములను, నల్లని ఆవును దూడను, దానమియ్యవలయును ఈ ప్రకారము యథావిధిగా పూజించి ప్రార్థించవలయును స్తోత్రమును జేయవలయును.

శ్లో॥ యః పురర్నష్టరాజ్యాయ నలాయ పరితోషితః । నిజంద దౌ మహారాజ్యం స మే సౌరిః ప్రసీదతు ॥

తా॥ రాజ్యభ్రష్టుడైన నలమహారాజు పూజింపఁగా సంతోషించి తిరిగినల మహారాజునకు స్వకీయమైన రాజ్యమునిచ్చునట్లుగాచేసిన శనైశ్చరుఁడు నన్ను అనుగ్రహించుగాక.

శ్లో॥ శనిం నీలాంజనప్రఖ్యం మందచేష్టాప్రసారిణమ్। ఛాయామార్తాండసంభూతం తం నమామి శనైశ్చరమ్ ॥

తా॥ నల్లనికాటుకవంటి యాకారము గలవాడును మెల్లని నడకచే సంచరించు వాడును సూర్యుని వలన ఛాయాదేవియందు పుట్టిన వాడునగు శనైశ్చరునకు నమస్కారము చేయుచున్నారము.

శ్లో॥ నమస్తే కోణసంస్థాయ పింగలాయ నమోఽస్తు తే । ప్రసాదం కురు దేవేశ దీనస్య ప్రణతస్య చ॥

తా॥ కోణములయందు నుండువాడును పింగళవర్ణము గలవాడు నగుచూ శనైశ్చరుఁడా! నీకు నమస్కారము చేసెదను దీనుడనై నీకు నమస్కరించితిని గాన నాయందనుగ్రహము కలవాడగుము.

శ్లో॥ ఏవం స్తుత్వా ప్రార్థయిత్వా ప్రణమేచ్ఛ పునః పునః। పూజనే వైదికో మంత్రః శ్శంనో దేవీరితీహవై ॥ తైత్రివర్ణానాంచ శూద్రాణాం నామమంత్రః ప్రకీర్తితః । య ఏవం విధినా మందం పూజయేత్సుసమాహితః ॥ తదీయం తు భయం తస్య స్వప్నేపి న భవిష్యతి । ఏవ

మేతద్వ్రతంవిప్ర యేకరిష్యంతిమానవాః ॥ వాసరేవాసరేప్రాప్తే శ్రావణేమాసిభక్తితః। తేషాంశనైశ్చరకృతః పీడాలేశోపినోభవేత్ ॥

తా ॥ యీ ప్రకారము స్తోత్రము ప్రార్థనచేసి మాటిమాటికి నమస్కరింప కలయును బ్రహ్మ క్షత్రియ వైశ్యులనెడు మూడు వర్ణముల వారును పూజించు నప్పుడు ( శంనోదేవీ రభిష్టయే ) అను వేదోక్త మంత్రముచే పూజింప కలయును శూద్రులు శనైశ్చర నామమంత్రముచే పూజింపకలయును స్థిరచిత్తము కలవాడయి యీ ప్రకారముగా శనైశ్చరుని పూజించిన వానికి స్వప్నమందైనను శని వలన భయము కలుగదు ఓ బ్రాహ్మణుడా! యీ ప్రకారము శ్రావణ మాసములో ప్రతి శనివారమునందును భక్తితో పూజించి శనైశ్చరుని గురించిన వ్రతమును చేయువానికి శనైశ్చరుని వలన గలిగే అరిష్టములు కొంచెమైనను కలుగవు.

శ్లో॥ ప్రథమేవాద్వితీయేవా చతుర్థేవా పంచమేపివా। సప్తమే చాష్టమేవాపి నవమేద్వాదశేపివా ॥ జన్మాశేఃస్థితోమందః పీడాంచ కురుతేసదా। శమగ్నిరితిమంత్రస్య తత్ప్రసాదేజపోమతః ॥ ఇంద్రనీల మణేర్దానం ప్రదద్యాత్తస్యతుష్టయే। అతఃపరం ప్రవక్ష్యామి హనుమ త్తుష్టయేవిధిమ్॥

తా ॥ తన జన్మరాశియందు గాని అది మొదలు రెండింట నాలుగింట ఐదింట ఏడింట ఎనిమిదింట తొమ్మిదింట పండ్రెండవ స్థానము, యీ చెప్పబడిన స్థానముల యందు శని యున్న యెడల పీడను కలుగ చేయును ఆ శనైశ్చరుడు సంతోషించి పీడను పోగొట్టుటకు ( శమగ్నిః ) అను మంత్రముచే జపముచేసి యింద్రనీల మణిని దానమిచ్చిన యెడల శనిసంతోషించి పీడను పోగొట్టును యిక ముందు ఆంజనేయు లకు ప్రీతికరమగు పూజావిధిని జెప్పెను.

శ్లో॥ శనివారేశ్రావణేచ అభిషేకంసమాచరేత్। రుద్రమంత్రేణతైలేన హనుమత్ప్రీణనాయచ॥

తా ॥ శ్రావణ మాసములో శనివారము నందు రుద్రసూక్తము జెప్పుచు నూనెతో నభిషేకము చేసినయెడల ఆంజనేయులు సంతోషించును.

శ్లో ॥ తైలేనమిశ్రితసిందూర లేపంతస్యసమర్పయేత్ । జపాకుసుమమాలాభి రర్కమాలాభిరేవచ ॥ మాలాభిర్మాందరాభిశ్చ వట శానాంతథైవచ। పూజయేదంజనీపుత్రం తథాన్యైరుపచారకైః॥యథా

విధియథావిత్తం శ్రద్ధాభక్తిసమన్వితః । జపేద్ద్వాదశనామాని హనుమత్ప్రీతయేబుధః॥

తా ॥ నూనెలో సిందూరము కలిపి సమర్పించవలయును జాసాన పుష్పమాలికలు, జిల్లేడుపువ్వుల మాలికలు, మందారపుష్పముల మాలికలు, వడపప్పులు మొదలగు వానిచే పూజింపవలయును,మరియు శ్రద్ధాభక్తులు కలవాడై శక్తి కొలది షోడశోపచారములచే పూజించిన ఆంజనేయులు సంతసించును మరియు విద్వాంసుడు ఆంజనేయద్వాదశ నామములను జపింపవలెను.

శ్లో॥ హనుమానంజనీసూను ర్వాయుపుత్రో మహాబలః। రామేష్టఃఫాల్గునసఖః పింగాక్షోమితవిక్రమః ॥ ఉదధిక్రమణశ్చైవ సీతాశోకవినాశకః। లక్ష్మణప్రాణదాతాచ దశగ్రీవస్యదర్పహా॥ ద్వాదశైతాని నామాని ప్రాతరుత్థాయయఃపఠేత్ । నాశుభంజాయతేతస్య సర్వసంపత్ప్రజాయతే ॥

తా ॥ హనుమాన్, అంజనీసూనుః, వాయుపుత్రః, మహాబలః, రామేష్టః, ఫల్గునసఖః, పింగాళః అమితవిక్రమః, ఉదధిక్రమణః, సీతాశోకవినాశకః,లక్ష్మణప్రాణదాతా, దశగ్రీవదర్పహా, అని చెప్పబడు ఆంజనేయుని పండ్రెండు నామములను ప్రాతః కాలంబున పఠియించువానికి నశుభము కొంచమైనను కలుగదు వానికి సమస్తసంపదలు కలుగుచున్నవి.

శ్లో॥ శ్రావణేమందవారేతు ఏవమారాధ్యవాయుజమ్। వజ్రతుల్యశరీరస్స్యా దరోగోబలవాన్నరః॥

తా ॥ శ్రావణమాసములో శనివారమునందీ ప్రకారముగా ఆంజనేయులను పూజించిన మనుష్యుడు వజ్రముతో సమానమగు శరీరము గలవాడును రోగము లేనివాడును బలవంతుడునగును.

శ్లో॥ వేగవాన్కార్యకరణె బుద్ధిమైభవభూషితః । శత్రునిస్సంక్షయమాప్నోతి మిత్రవృద్ధిఃప్రజాయతే ॥

తా ॥ విశేషమగు బుద్ధిగలవాడై మిక్కిలిచురుకుగా కార్యములను సాధించును శత్రువులు నశించెదరు మిత్రులు వృద్ధినొందెదరు.

శ్లో ॥ వీర్యవాన్కీర్తిమాంశ్చైవ ప్రసాదాదంజనీజనేః । ఆంజనేయాలయేలక్షం హనూమత్కవచంపఠేత్ ॥ అణిమాద్యష్ట సిద్ధీనాం

సాధకస్స్వామితామిమాత్ । యక్షరక్ష సభేతాలా దర్శనాత్తస్య వేగతః॥ పలాయంతేదశదిశః కంపితాభయవిహ్వలాః ॥

తా॥ ఆంజనేయుల యనుగ్రహముతోలవ కీర్తిగల వాడును, పరాక్రమవంతుడును నగును, మరియు నాంజనేయుని యాలయము నందు గూర్చుండి ఆంజనేయుని కవచము లక్షపర్యాయములు పారాయణ చేసిన వాడు అణిమాద్యష్ట సిద్ధులు కలిగి ప్రభువగును, వానిని చూడగానే యక్షులు, రక్షస్సులు, భేతాళములు,పిశాచములు మొదలగునవి భయంనొంది గడగడ వడకుచు వేగముగాపారిపోవును.

శ్లో॥ అశ్వత్థాలింగనంచైవ అశ్వత్థస్యచపూజనమ్ । మందఖిన్నైసకతజ్ఞావ్య స్స్పర్శోశ్వత్థస్యసత్తమ । శనావాలింగనంతస్య సర్వసంపత్సమృద్ధిదమ్। పూజనంసప్తవారేషు తతాపిశ్రావణేధికమ్ ॥

తా॥ ఓ సనత్కుమారుడా! శనివారమునందు రావి చెట్టునకు పూజచేయుటయు ప్రదక్షిణము చేయుటయు మంచిది బుద్ధిమాంద్యము కలవాడు ముఖ్యంగా చేయ వలయును యిట్లు ఏడు వారములు రావిచెట్టు నకు ప్రదక్షిణలుచేసిన యెడల సమస్తసంపదలు కలుగును శ్రావణమాసములో చేసిన మిక్కిలి ముఖ్యము.

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాస మాహాత్మ్యే ఈశ్వర
సనత్కుమార సంవాదే శనివార వ్రతకథనం నామ
దశమోధ్యాయ స్సమాప్తః

---

## అథ ఏకాదశాధ్యాయప్రారంభః

సనత్కుమారఉవాచ ॥ శ్లో॥ వారవ్రతానిసర్వాణి త్వత్తోదేవ శ్రుతానిమే । తవవాగమృతంపీత్వా తృప్తిర్మేనైవజాయతే॥ శ్రావణేనసమోమాసో నాస్త్యన్యః ప్రతిభాతిమే । అథాంతస్తిథి మాహాత్మ్యం కథయస్వజగత్ప్రభో ॥

తా॥ ఓ జగద్రక్షకా! ఏడు వారములను గురించిన వ్రతములను నీవుచెప్పగావింటిని అమృత తుల్యములగు వాక్యము లెంత వినినను నాకు తృప్తి తీరలేదు

నీమాటల వలన శ్రావణ మాసముతో సమానమగు మాసము మఱియొకటి లేదని నాకు తోచుచున్నది. అందువలన శ్రావణమాసములో తిథులయందుండు మహిమను కూడ విన వలయునని యున్నది కాబట్టి వాటి మహిమను కూడా చెప్పుమని సాంబమూర్తిని సనత్కుమారుడడిగెను.

ఈశ్వర ఉవాచ ॥ శ్లో ॥ మాసానాం కార్తికశ్శ్రేష్ఠ స్తస్మాన్మాఘః పరోమతః। తతోపిమాధవశ్శ్రేష్ఠ స్సహాశ్చాపి హరిప్రియః ॥ విశ్వరూపేణచత్వారో మాసాశ్చేతేమమప్రియాః। ద్వాదశస్వపిమాసేషు శ్రావణశ్శివరూపకః॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు ఓ మునీశ్వరా! మాసములలో కార్తికము శ్రేష్ఠమైనది, దానికంటె మాఘమాస ముత్తమ మయినది దానికంటె వైశాఖ మధికమైనది మాఘశీర్షము విష్ణు ప్రీతి కరమైనది నేను ప్రపంచ స్వరూపుడను కాబట్టి యీ నాలుగు మాసములు నాకు ప్రీతికర మైనవి, మఱియు పండ్రెండు మాసములలోను శ్రావణమాసము శివస్వరూప మైనది

శ్లో॥ తిథయశ్శ్రావణేమాసి సర్వాశ్చవ్రతసంయుతాః। ప్రాధాన్యత స్తథాపిత్వాం వచ్మికాశ్చిత్సుశోభనాః॥

తా॥ శ్రావణ మాసములో తిథు లన్నియు వ్రతములు కలవియే యగును వినను శ్రేయస్సు నొసగునట్టి ప్రధానమగు కొన్నితిథులను గుఱించిచెప్పెదవినుము.

శ్లో॥ తిథివారవిమిశ్రంతు వ్రతంమాసేవదామితే। ప్రతిపచ్ఛ్రావణెమాసి యదాసోమయుతాభవేత్॥ సోమవార స్తదాపంచ పతంత్యత్రహిమాసికే। రోటకాఖ్యంవ్రతంతత్ర కర్తవ్యంశ్రావణేనరైః॥

తా॥ ఈ శ్రావణమాసములో నేవారముతో నేతిథి గూడిన నే వ్రతమును చేయ వలయునో చెప్పెద వినుము శ్రావణ మాసములో సోమవారము పాడ్యమి యందు వచ్చిన యెడల నా మాసమునందైదు సోమవారములు వచ్చును కాబట్టి పాడ్యమి సోమవారంబున రోటకమను వ్రతమును మనుష్యులు చేయవలసియున్నది.

శ్లో॥ సార్ధమాసత్రయంవాపి రోటకాఖ్యం వ్రతంభవేత్। లక్ష్మీవృద్ధికరంప్రోక్తం సర్వకామార్థసిద్ధిదమ్॥

తా॥ అది మొదలు మూడుమాసముల పదిహేను దినముల పర్యంతము రోట

కమను వ్రతమును చేయవలయును అట్లు చేసిన లక్ష్మీ ప్రీతమనియు సమస్త కోరికల నిచ్చుననియు చెప్పఁబడెను.

శ్లో॥ విధానంతస్యవక్ష్యామి శృణుష్వావహితోమునే । శ్రావణస్యసితేపక్షే ప్రతిపత్సోమవాసరే ॥ ప్రాతస్సంకల్పయేద్విద్వాన్ కరిష్యేరోటకవ్రతం । అద్యారాభ్యసురశ్రేష్ఠ కృపాంకురుజగద్గురో ॥

తా॥ ఓ మునీశ్వరుడా! ఆ వ్రతముయొక్క విధానమును చెప్పెదను సావధాన చిత్తముగలవాడవై వినుము వ్రతమును చేయదలచినవాడు శ్రావణశుద్ధపాడ్యమి సోమవార ముదయమున యిది మొదలు ప్రారంభించి రోటక వ్రతమును జేసెదను ఓ జగద్గురువా! నాయందు దయగలవాడగుమని ప్రార్థనచేసి సంకల్పము చేయవలయును.

శ్లో॥ దినేదినేప్రకర్తవ్యాయా పూజా దేవస్యశూలినః। బిల్వపత్రైరఖండైశ్చ తులసీపత్రకైస్తథా॥ నీలోత్పలైశ్చకమలైః కల్హారైః కుసుమైస్తథా। చంపకైర్మాలతీపుష్పైః కువిందైరర్కపుష్పకైః ॥ అన్యైర్నానావిధైఃపుష్పైః ఋతుకాలోద్భవైశ్శుభైః । ధూపైర్దీపైశ్చ నైవేద్యైః ఫలైర్నానావిధైరపి॥ నైవేద్యమర్పయేన్ముఖ్యం రోటకానాంవిశేషతః। కర్తవ్యారోటకాఃపంచ పురుషాహారమానతః॥ద్వౌతు విప్రాయదాతవ్యౌ ద్వాభ్యాంవై భోజనంమతమ్ । ఏకోదేవాయదాతవ్యో నైవేద్యార్థంసదాబుధైః॥

తా॥ భగ్నముగాని మారేడు దళములు, తులసీ దళములు, నల్లకలువలు, పద్మములు, ఎఱ్ఱ కలువలు, సంపంగి పువ్వులు, జాజి పువ్వులు, గోరింట పువ్వులు, జిల్లేడు పువ్వులు, మఱియు ఆయాఋతువులయందు కలిగెడు శుభప్రదములగు నితర పువ్వులు మొదలగు వాని చేతను సాంబమూర్తిని నిత్యము పూజచేసి ధూపదీపముల నొసగి యనేక విధములగు ఫలములను నివేదన చేయవలయును మఱియు పురుషుడు భుజించునట్టి యాహార పరిమితి గల ఐదు రొట్టెలను చేసి వానిలో నొకటి దేవునకు నివేదనచేసి రెండు రొట్టెలను బ్రాహ్మణున కిచ్చి రెండు రొట్టెలను తాను భక్షింపవలయును.

శ్లో॥ శేషపూజాంవిధాయాథ అర్ఘ్యందద్యాద్విచక్షణః। రంభాఫలంనారికేళం జంబీరంబీజపూరకం॥ఖర్జూరీకర్కటీద్రాక్షా నారిం

గాఽమాతులుంగకమ్ । అక్షోటకంచ దాడింబం యచ్చాన్యదృతుసంభవమ్॥ తత్తత్ఫలాని దేవాయ యథాశక్త్యా నివేదయేత్ ॥

తా ॥ మిగిలిన పూజనంతయు చేసి యర్ఘ్యమును విడువవలయును నివేదన చేయుటకు అరటిపండ్లు, కొబ్బరికాయలు, నిమ్మపండ్లు, మాదీఫలములు, ఖర్జూరపండ్లు, దోసపండ్లు ద్రాక్షపండ్లు, నారింజపండ్లు, జామపండ్లు, పనస పండ్లు, దానిమ్మపండ్లు మొదలగునవి ఆ ఋతువునందు సంభవించిన ఫలము లన్నియు నివేదనకు నుపయోగింప వలయును.

శ్లో॥ ప్రశస్తమర్ఘ్యదానం స్యాత్ తస్యపుణ్యఫలంశృణు। సప్తసాగరపర్యంతాం భూమిందత్వాతుయత్ఫలమ్ ॥ తత్ఫలంసమవాప్నోతి వ్రతంకృత్వావిధానతః।పంచవర్షం ప్రకర్తవ్యం మతులంధనమీప్సుభిః॥

తా ॥ అర్ఘ్య ప్రదానము చేయుట ముఖ్యమైనది అందు వలన కలిగెడు పుణ్యఫలమును చెప్పెదవినుము సప్తసముద్రముల పర్యంతముండునట్టి భూమిని దానమిచ్చిన ఫలమున్నూయథావిధిగా వ్రతము చేసినందువలన పొందును, మఱియు విశేషముగు ధనమును కోరువాడీవ్రతము నైదు సంవత్సరములు చేసిన యెడల సంపూర్ణ ధనవంతు డగును.

శ్లో॥ పశ్చాదుద్యాపనంకుర్యాద్రోటకాఖ్యవ్రతస్యతు । ఉద్యాపనేతుకర్తవ్యౌ హేమరూప్యౌచరోటకౌ॥

తా ॥ అనంతరముద్యాపన చేయవలయును రోటక వ్రతమునకు నుద్యాపన చేయునప్పుడు బంగారముతోను వెండితోను రెండురోటకములను చేయించవలెను.

శ్లో ॥ పూర్వేద్యురధివాస్యాథ ప్రాతర్హోమం సమాచరేత్ । సర్పిషాశివమంత్రేణ బిల్వపత్రైశ్చశోభనైః॥

తా ॥ పూర్వ దినమున మంటపారాధనము చేసిన మరునాడుదయమున శివసంబంధమగు మంత్రముచే నేతితోటి శుభప్రదములగు మారేడుదళములతోటిహోమమును చేయవలయును.

శ్లో ॥ ఏవంకృతేవ్రతేతాత సర్వాన్కామానవాప్నుయాత్ । సనత్కుమారవక్ష్యామి ద్వితీయంవ్రతంశుభమ్ ॥ యత్కృత్వాశ్రద్ధయామర్త్యో లక్ష్మీవాన్పుత్రవాన్భవేత్। ఔదుంబరాభిదంచైవ తద్వ్రతంపాపనాశనమ్॥

తా ॥ ఓ సనత్కుమారుడా! ఈ ప్రకారము రోటక వ్రతమునకు నుద్యాపన చేసిన యెడల సమస్త కోరికలను పొందును మరియు విదియయందు చేయ తగిన విదియ శుభప్రద మగునదియు పాపములను పోగొట్టు నదియు నైన ఔదుంబరమను వ్రతమును చెప్పెదను ఆ వ్రతమును శ్రద్ధతో చేసిన మనుజుడు లక్ష్మీ సంపన్నుడును పుత్రులు గలవాడగును.

శ్లో॥ శ్రావణేమాసిసంప్రాప్తే ద్వితీయాయాంశుభేతిథౌ। ప్రాతస్సంకల్ప్యవిధివ ద్వ్రతంకుర్యాద్విచక్షణః॥

తా ॥ శ్రావణమాసము రాగానే శుభప్రదమగు విదియయందు నుదయమున స్నానముచేసి పరిశుద్ధుడై సంకల్పించి వ్రతముచేయవలయును.

శ్లో॥ నారీవాథనరోవాపి పాత్రంస్యాత్సర్వసంపదామ్। సాక్షాదుదుంబరఫూజ్య స్తదభావేతుకుడ్యకే॥ లిఖిత్వాపూజయే త్తత్ర చతుర్భిర్నామమంత్రకైః। ఉదుంబరనమస్తుభ్యం నమస్తే హేమపుష్పక॥ సజంతుఫలయుక్తాయ నమోరక్తాండశాలినే। తత్రాధిదేవతేపూజ్యే శివశ్శుక్రస్తథైవచ॥

తా ॥ యీ వ్రతమును చేసిన పురుషుడుగాని, స్త్రీగాని, సమస్తసంపదలను పొందును. ప్రత్యక్షముగా మేడి చెట్టు సంభవించిన యెడల దానికి పూజ చేయవలయును లేనియెడల గోడయందు దాని రూపమును లిఖియించి నాలుగు నామములచే పూజించవలెను. అవి యేవియనగా, ఉదుంబర, హేమపుష్పక, జంతుఫల, రక్తాండశాలి, అను నామములచే పూజింపవలయును దానికి అధిదేవతలగు శివుని శుక్రుని ఆ ప్రకారముగానే పూజింపవలెను.

శ్లో॥ త్రయంత్రింశత్ఫలాన్యస్య గృహీత్వాభాగమాచరేత్। ఏకాదశబ్రాహ్మణాయ దద్యాత్తాంవంతిదైవతే॥ తావంతిస్వయమశ్నీయా న్నాన్నహారస్తు తద్దినే। శివంశుక్రంచ సంపూజ్య రాత్రౌజాగరణంచరేత్॥

తా ॥ ముప్పదిమూడు పండ్లను తీసుకొనివచ్చి మూడు భాగములు చేసి పదకొండుపండ్లు దేవతకు నివేదన చేయవలెను పదకొండు పండ్లు బ్రాహ్మణునకు దానమియ్యవలయును. పదకొండు పండ్లు తాను భుజింపవలయును గాని యా దినంబున

నన్నము తినకూడదు మఱియు శివుని శక్తిని పూజించి యా రాత్రి యంతయుజాగరణము చేసి గడపవలయును.

శ్లో॥ ఏవంకృత్వావ్రతంతాత వర్షాణ్యేకాదశైవతు। పశ్చాదుద్యాపనంకుర్యా ద్వ్రతసంపూర్ణ హేతవే॥

తా॥ ఓ మునీశ్వరా! యీ ప్రకారము పదకొండు సంవత్సరములు వ్రతము చేసి యనంతరము వ్రత సంపూర్తికొఱకు నుద్యాపనము ముఖ్యముగా చేయవలెను.

శ్లో॥ ఉదుంబరస్సువర్ణేన ఫలపుష్పదళాన్వితః। తత్రసంపూజయేద్విద్వా న్ప్రతిమేశివశక్తియోః॥ ప్రతిహోమం చరేచ్చైవ ఉదుంబరఫలైశ్శుభైః। కోమలైరల్పమాత్రైశ్చ సంఖ్యయా ష్టోత్తరం శతమ్॥ ఉదుంబరసమిద్భిశ్చ తిలైరాజ్యైశ్చ హోమయేత్। ఏవంసమాప్యహోమంతు ఆచార్యంపూజయేత్తతః॥

తా॥ ఆకులు, పువ్వులు, కాయలు, కలుగునట్లుగా బంగారముతో మేడి చెట్టును చేయించి యా ప్రతిమను శివశక్తుల ప్రతిమలను పూజింపవలయును మఱి నాడుదయమున మేడి పండ్లతోను లేక మృదువైన చిన్న కాయలతో గాని నూట యెనిమిది పర్యాయములు హోమము చేయవలయును మఱియు మేడి సమిధలతోను నువ్వులు నేతి మొదలగు వానితో హోమముచేసి సంపూర్తి నొందించి పిమ్మట నాచార్యుని పూజించ వలయును.

శ్లో॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చా చ్ఛతంశక్త్యాదశాథవా। ఏవం వ్రతేకృతేవత్స ఫలంయత్స్యాచ్ఛృణుష్వతత్॥ బహుజంతు ఫలాః వృక్షో యథాయం సాధకస్తథా। భవేదనేకసుతవాన్వం శవృద్ధిస్తథా భవేత్॥

తా॥ అనంతరము శక్తి యున్న యెడల నూరుగురు బ్రాహ్మణులకు గాని లేక పదిమందికిగాని భోజనము పెట్టవలెను ఓచిన్నవాడా! ఈ ప్రకారము వ్రతము చేసినందువలన గలిగెడు ఫలమును వినుము, మేడి వృక్షము విశేష ఫలములు గల దగుచు నన్ని కర్మలకు నెట్లుపయోగించునో ఆ ప్రకారముగానే యనేక పుత్రులు కలిగి వంశవృద్ధికలవాడగును.

శ్లో॥ హేమపుష్పైర్యథావృక్ష స్తథాలక్ష్మీప్రదోభవేత్ ।అద్యా వధికస్యాపి వ్రతమేతత్ప్రకాశితమ్॥ గోప్యాద్గోప్యతరంచైవ తవాగ్రే కథితంమయా। నైవాత్రసంశయఃకార్యో భక్త్యాచైత ద్వ్రతంచరేత్॥

తా॥ మేడి వృక్షము బంగారము వంటి పుష్పములచే ప్రకాశించి నట్లుగా యీ వ్రతమును చేసినవారు లక్ష్మీ సంపన్నులై యుందురు యింత వరకు యీ వ్రతమును యెవరికిని తెలియ పరచలేదు మిక్కిలి రహస్య మయిన యీ వ్రతమును నీవు భాగ్యుడవైనందున నీకొక్కనికే జెప్పితిని నీవు యెంతమాత్రము సంశయింపక భక్తిగల వాడవై ముఖ్యముగా నీ వ్రతమును చేయు మని సాంబమూర్తి సనత్కుమారుని తో చెప్పెను.

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణమాస మాహాత్మ్యే ప్రతి పద్రోటకవ్రత
ద్వితీయోదుంబర వ్రత కథనంనామైకా
దశోధ్యాయస్సమాప్తః.

---

## అథ ద్వాదశోధ్యాయ ప్రారంభః

ఈశ్వర ఉవాచ ॥ శ్లో ॥ అతఃపరం ప్రవక్ష్యామి స్వర్ణగౌరీ వ్రతంశుభమ్। శ్రావణేశుక్లపక్షేతు తృతీయాయాంవిధాత్మజ॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు ఓ సనత్కుమారుడా! ఇక ముందు శుభప్రదమగు స్వర్ణగౌరీవ్రతమును చెప్పెదను వినుముఆవ్రతము శ్రావణశుద్ధతదియ యందు చేయవలయును

శ్లో ॥ ప్రాతస్స్నాత్వానిత్యకర్మ కృత్వాసంకల్పమాచరేత్। పార్వతీశంకరౌపూజ్యౌ షోడశైరుపచారకైః॥

తా॥ ఉదయమున స్నానం చేసి సంధ్యావందనాది నిత్య కృత్యములను నెరవేర్చుకొని సంకల్పము చేసి పార్వతీ పరమేశ్వరులను షోడశోపచారములచే పూజ చేయవలయును.

శ్లో ॥ దేవదేవసమాగచ్ఛ ప్రార్థయేహంజగత్పతే। ఇమాం మయాకృతాంపూజాం గృహాణసురసత్తమ॥

తా ॥ ప్రపంచము నకు ప్రభువును దేవతలలో నుత్తముడవు నగు సాంబమూర్తీ! నేను చేయునట్టి పూజను గ్రహించుము నీ జేయు పూజాస్థలమునకు వచ్చి నివసింపుమని ప్రార్థింపవలెను

శ్లో ॥ వాయనానిప్రదేయాని దంపతీభ్యస్తుషోడశ। భవాన్యాశ్చ మహాదేవ్యా వ్రతసంపూర్ణహేతవే॥

తా ॥ మహాదేవి యగు పార్వతీ దేవి యొక్క తృప్తి కొఱకును వ్రతంసంపూర్తి నొందుటకును పదహారు వాయనములను దంపతుల కొఱకు నివ్వవలెను

శ్లో ॥ ప్రీతయేద్విజవర్యాయ వాయనం ప్రదదామ్యహమ్ । ధాన్యాషోడశపక్వాన్నైః ర్వేణుపాత్రాణిషోడశ॥ కుర్యాద్వస్త్రాదిభిర్యుక్తా నాహూయద్విజదంపతీః। వ్రతసంపూర్ణతార్థంతు బ్రాహ్మణేభ్యో దదామ్యహమ్ । స్వలంకృతాస్సువాసిన్యః పాతివ్రత్యేనభూషితాః । మమకార్య సమృద్ధ్యర్థం ప్రతిగృహ్ణంతు శోభనాః ॥ ఏవంషోడశవర్షాణి అష్టౌచత్వారివాపునః । ఏకవర్షంతు సద్యోవా కృత్వాచోద్యాపనంచరేత్ ॥

తా ॥ బ్రాహ్మణులు సంతోషించుట కొఱకు వాయనముల నిచ్చుచున్నానని సంకల్పించేసి బ్రాహ్మణులను బిలచి వేపుడు బియ్యం పదహారు పిండివంటలతో నిండియున్నవియు నూతన వస్త్రములతో జుట్టబడినవియు పదహారు వెదురు పాత్రలను వ్రతం సంపూర్తి నొందుటకు సర్వాలంకార భూషితులును పతివ్రతలు నగు సువాసినీ స్త్రీలకు నిచ్చుచున్నాను నా కార్య సమృద్ధి నిమిత్తమై వారు గ్రహింతురుగాక యని నివ్వవలయును. యిట్లు పదహారు సంవత్సరములు గాని యెనిమిది సంవత్సరాలు గాని, నాలుగు సంవత్సరాలు గాని, ఒక్కసంవత్సరంగాని, తత్కాలమందుగాని, చేసి పిమ్మట నుద్యాపనం చేయవలెను

శ్లో॥ పూజాంతేచకథాంశ్రుత్వా వాచకంసంప్రపూజయేత్ ॥

తా ॥ పూజ చేసిన పిమ్మట కథను చెప్పిన వానిని పూజింపవలెను,

సనత్కుమారఉవాచ ॥ శ్లో॥ కేనచీర్ణంవ్రతమిదం మాహాత్మ్యంచాస్యకీదృశమ్। ఉద్యాపనంకథంకార్యం తత్సర్వంవదమేప్రభో॥

తా ॥ ఓ స్వామీ ! యీ వ్రతమును పూర్వంచేసిన వారెవరు దీని మహిమ యెటువంటిది ఉద్యాపనంచేయు విధ మెట్టిది దీనినంతయు సవిస్తరంగాచెప్పుమని సాంబమూర్తిని సనత్కుమారుడడిగెను.

ఈశ్వరఉవాచ॥ శ్లో ॥ సాధుష్పృష్టంమహాభాగ కథయామితవా వ్రతః । స్వర్ణగౌరీవ్రతంనామ సర్వసంపత్కరంనృణామ్॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు ఓ మునీశ్వరా ! నీవు చేసిన ప్రశ్న యోగ్యంగానున్నది కాబట్టి దాని వివరమంతయు నీకు చెప్పెదను వినవలయును, స్వర్ణగౌరీవ్రతం మనుష్యులకు సమస్త సంపదలనిచ్చును.

శ్లో॥ పురాసరస్వతీతీరే సువిలాఖ్యామహాపురీ । తత్రచంద్రప్రభోనామ రాజాసీద్ధనదోపమః॥

తా ॥ పూర్వకాలంబున సరస్వతీ నదీతీరంబున సువిలమను నొక పట్టణం కలదు ఆ పట్టణంబున కుబేరునితో సమాన సంపదగల చంద్రప్రభుడను నొక రాజు కలడు,

శ్లో ॥ తస్యాస్తాంరూపలావణ్యే సౌందర్యస్మరవిభ్రమే । మహాదేవీవిశాలాఖ్యే ద్విభార్యేకమలేక్షణే ॥ తయోః ప్రియతరాజ్యేష్ఠాత స్యాసీన్నృపతేస్తదా । సకదాచిద్వనంభేజే మృగయాసక్తమానసః॥ సింహశార్దూలవారాహా వనమాహిచకుంజరాన్ । హత్వాబభ్రామ తృష్ణార్త స్సరాజావిపినంమహత్ ॥

తా ॥ ఆ రాజు సకు సౌందర్యంచే మన్మధుని తిరస్కరించు నట్టి రూపలావణ్యం కలవారును, పద్మముల వంటి నేత్రములు కలవారును,మహాదేవి విశాల యను పేర్లుగల యిద్దరు భార్యలుకలరు వారియిరులో పెద్దభార్య యందు మిక్కిలి ప్రేమ గలవాడై యుండెను, ఆ రాజు యొకనాడు వేటాడుట యందాసక్తి గలవాడయి యడవికి వెళ్లి క్రూరమృగములగు సింహములను, పెద్దపులులను, అడవి పందులను, అడవి దున్నలను, ఏనుగులను, సంహరించి యలసినవాడై దప్పికచే పీడింపబడి జలం నిమిత్తమై యాయడవి నంత యుండిరిగెను.

శ్లో॥ చక్రకారండవాకీర్ణం చంచరీకవికాకులమ్ । ఉత్ఫుల్లమల్లికాజాతి కుముదోత్పలమండితమ్ ॥ అపూర్వమవనీశోసౌ దదర్శాప్సరసాంసరః । సమాసాద్యసరస్తీరం పీత్వాజలమనుత్తమమ్। భుక్త్వా

గౌరీమర్చయంతం దదర్శాప్సరసాంగణమ్ । కిమేతదితిపప్రచ్ఛ రాజా రాజీవ లోచనః ॥

తా ॥ పద్మములవంటి నేత్రములుగల యారాజు యిట్లు వనమంతయు తిరుగగా చక్రవాకములు, కారండవములు, కుక్కుటాదులు, కోయిలలు, మొదలగు పక్షులతో వ్యాప్తమైనదియు, వికసించిన పద్మములు, మల్లెలు,జాజులు, తెల్ల కలువలు, నల్ల కలువలు, మొదలగు పుష్పములతో నిండియున్నదియు మనోహరమగు నొకదేవతుల కొలను కనుపింపగా దానివద్దకు వేగి జలమును పానముచేసి యొడ్డున భక్తితో పార్వతీ దేవిని పూజింపు చున్న యప్సరస్త్రీలను జూచి మీరు చేయుచున్న వ్రతమేమి యని యా స్త్రీలనడిగెను.

శ్లో ॥ స్వర్ణగౌరీవ్రతమిదం క్రియతేస్మాభిరుత్తమమ్ । సర్వసంపత్కరంన్రూణాం తత్కురుష్వనృపోత్తమ॥

తా ॥ ఓ రాజా! మేము చేయునది స్వర్ణగౌరీ వ్రతము శ్రేష్ఠమైనది మనుష్యులకు సమస్త సంపదల నొసగును కాబట్టి నీవును ఈ వ్రతమును చేయుమని యా స్త్రీలు చెప్పిరి.

రాజోవాచ॥ శ్లో॥ విధానంకీదృశంచాత్ర కింఫలంవిస్తరాన్మమ। తాఊచురోష్యషితస్సర్వా స్త్వతీయాయాంనభోయుజి॥ కర్తవ్యంవ్రతమేతద్ధి స్వర్ణగౌరీతిసంజ్ఞితమ్ । పార్వతీశంకరౌపూజ్యౌ భక్త్యాపరమాయాముదా ॥

తా ॥ యీ వ్రతము నేవిధిగా చేయవలయును చేసినందు వలన ఫలమేమి కలుగును దీనినంతయు సవిస్తరముగా జెప్పుమని రాజు ప్రశ్నచేయగా నప్సరస్త్రీలు చెప్పుచున్నారు శ్రావణ మాసములో తదియదినంబున యీ స్వర్ణగౌరీవ్రతమును చేయవలయును యీ వ్రతమునందు పార్వతీ పరమేశ్వరులను మిక్కిలి భక్తి కలిగి సంతోషముతోగూడి పూజింప వలయును.

శ్లో॥ తోరకంషోడశగుణం బధ్నీయాద్దక్షిణే కరే।నరోవామేతు నారీణాం గళేవాబంధనంమతమ్॥

తా॥ అనంతరము పదహారు పోసలు పోసిన తోరమును మగవాడు కుడిచేతికిని ఆడది యెడమ చేతికిని కట్టుకొన వలెను లేక తోరమును కంఠమునందైనను ధరింపవచ్చును అని స్త్రీలుచెప్పిరి.

శ్లో ॥ తత్కృత్వాసోపిజగ్రాహ వ్రతంనియమమానసః।గుణై
ష్షోడశభిర్యుక్తం దోరకందక్షిణేకరే ॥ బధ్నామి దేవదేవేశి ప్రసాదం
కురుమేవ్రతం । ఏవం దేవ్యావ్రతంకృత్వా ఆజగామనిజంగృహమ్॥

తా ॥ అనంతర మారాజు నియమముగల మనస్సుతో గూడిన వాడై యా
స్వర్ణగౌరీ వ్రతమును చేసి పదహారు పోగులుగల తోరమును కుడిచేతికి కట్టుకొని
దేవతలలో నుత్తమురాలవగు యో గౌరీ నీ వ్రతమును చేసి తోరమును గట్టుకొం
టిని కాబట్టి నాయందు ననుగ్రహము కలదానివగు మని ప్రార్థించి వ్రతమును
పూర్తిచేసి యింటికి వెళ్లెను.

శ్లో ॥ పప్రచ్ఛ దోరకంహస్తే దృష్ట్వాజ్యేష్ఠాతికోపనా । త్రోటయి
త్వాచచిక్షేప బాహ్యేశుష్కతరూపరి ॥ నకర్తవ్యంనకర్తవ్య మితిరా
జ్ఞివదత్యపి। తేనసంస్పృష్టమాత్రేణ తరుఃపల్లవితోభవత్ ॥

తా॥ ఆ రాజింటికి వెళ్లగానే కుడిచేతియున్న తోరమును జూచి పెద్దభార్య
మిక్కిలి కోపము కలదగుచు రాజు వలదు వలదన్నను వినక రాజుచేతినుండెడి తోర
మును త్రెంచివేసి యింటికి వెలుపల నుండెడి యెండిన చెట్టు మీద పారవేయగా
నా చెట్టునకు తోరము తగిలినమాత్రములోనే యా చెట్టు చిగుళ్లు పుష్పములు కలదాయెను.

శ్లో ॥ తద్ద్వితీయాతతోదృష్ట్వా విస్మయాకులితాభవత్। తత్ర
స్థందోరకంఛిన్నం గృహీత్వా సాబబంధహి । తత స్తన్మాస మాసమా
హాత్మ్యాత్పత్యుఃప్రియతరాభవత్॥

తా ॥ యిదియంతయు రెండవ భార్య చూచి మిక్కిలి యాశ్చర్యముకలదై
వ్యాకులము జెంది తెగిపోయి అక్కడ పడియున్న తోరమును తీసుకొని తనహస్త
మును కట్టుకొనగా ఆ వ్రత మహిమ వలన ఆ రెండవ భార్యయందు మిక్కిలి ప్రేమ
గలవా డాయెను,

శ్లో॥ జ్యేష్ఠావ్రతాపచారేణ సాత్యక్తాదుఃఖతావనమ్ । ప్రయ
యౌసామహాదేవీం ధ్యాయంతీమనసాచసా ॥ మునీనామాశ్రమేపుణ్యే
నివసంతీక్వచిత్క్వచిత్॥ నివారితామునివరై ర్గచ్ఛసాపేయథాసుఖం ।
ధావంతీవిపినంఘోరం నిర్విణ్ణానిమసాదసా॥

తా ॥ వ్రతము నుల్లంఘన చేయుటచే రాజు కోపించి పెద్దభార్యను వెడలు
గొట్టగా నామె యడవులయందు దిరుగుచు దేవిని ప్రార్థించుచు నక్కడనక్కడ

కనపడిన మునుల యాశ్రమము లకు పోగా వారు ఓ పాపాత్మురాలా! యెడవులం కెలతిరిగెదవు యింటికి పొమ్ము అని పలికినప్పటికి వినక మహాఘోరమగు నాయడవి యందే తిరుగుచు నలసి విచారపడుచు నొకచోటున కూర్చుండెను.

శ్లో॥ తత స్తత్కృపయా దేవి ప్రాదురాసీ త్తదగ్రతః। తాం దృష్ట్వా దండవద్భూమౌ నత్వా స్తుత్వా నృపప్రియా ॥ జయ దేవీన ముస్తుభ్యం జయ భక్తవరప్రదే। జయశంకరవామాంగే జయమంగళమంగళే॥ తతో భక్త్యావపంలబ్ధ్వా గౌరీమభ్యర్చ్య యద్వ్రతమ్। చక్రేతస్య ప్రభావేన భర్త్రా తాం చనయద్గృహమ్॥

తా॥ అనంతరము గౌరీదేవి యా రాజుయొక్క భార్యయందు దయకలిగి యెదుట ప్రత్యక్షముకాగానే యా రాజు భార్య గౌరీ దేవినిచూచి సాష్టాంగ దండ ప్రణామము చేసి ఓ దేవీ! భక్తవరదే! శంకరవామాంగే! మంగళమంగళే నీకు నమస్కారము అని యీ ప్రకారము ప్రార్థించి యా గౌరీ దేవి వలన స్వర్ణగౌరీ వ్రతమును దెలిసికొని భక్తితో యథావిధిగా నాచరింపగా గౌరీదేవి సంతోషించి వరముల నిచ్చెను అనంతరమామె యింటికి వెళ్లగా వ్రతమహిమచే తనభర్త తిరిగి తనయింట నుంచుకొని పూర్వము వలెనే ప్రేమతో నుండెను,

శ్లో॥ తతో దేవ్యాః ప్రసాదేన సర్వాన్కామానవాపసా। తత స్తాభ్యాం నృపోరాజ్యం చక్రేసర్వసమృద్ధిమాన్ । అంతే శివపదంప్రాప కాంతాభ్యాంసహితో నృపః॥

తా॥ అనంతరమారాజు పెద్దభార్య గౌరీ దేవియొక్క యనుగ్రహము వలన సమస్త కోరికలను పొందెను యిట్లు ఆ రాజు యిద్దరు భార్యలయందు సమానప్రేమ గలవాడయి సమస్త సంపదల ననుభవించి కొంతకాలము రాజ్యము చేసి అత్యకాలమందు నాయిద్దరు భార్యలతోగూడ కైలాసము చేరెను.

శ్లో॥ యశ్చైభవంవ్రతమిదం కురుతేశివాయాః కుర్యాన్నమప్రియతనో భవితాచగౌర్యాః । ప్రాప్యశ్రియంసమధికాం భువిశత్రుసంఘం నిర్జిత్య నిర్మలపదం సశివస్యయాతి॥

తా॥ ఓ మునీశ్వరుడా! శుభప్రదమగు నీ స్వర్ణగౌరీ వ్రతమును చేసినవాడు నాకును గౌరీదేవికిని ప్రియుడైన వాడగుచు విశేషమగు సంపదను పొంది శత్రువుల నందరిని జయించి శ్రేష్ఠంబగు శివుని నివాసస్థానమైన కైలాసమును చేరుదురు.

శ్లో॥ ఏతస్యోద్యాపనవిధిం సావధానమనాశ్శృణు। శుభేతిథౌ శుభేవారే చంద్రేతారాబలాన్వితే॥ మండపేష్టదళేపద్మే కుంభంధాన్యే పరిన్యసేత్। పూర్ణపాత్రంతామ్రమయం పలషోడశనిర్మితమ్॥ తిలపూర్ణంతత్రదేవీ శంకరప్రతిమేన్యసేత్। శ్వేతవస్త్రయుగచ్ఛన్నం శ్వేతయజ్ఞోపవీతినమ్॥ వేదోక్తేనప్రతిష్ఠాచ కర్తవ్యాహియథావిధి। సమ్యక్పూజాంతుసంపాద్య రాత్రౌజాగరణంచరేత్॥

తా॥ ఓ మునీశ్వరుడా! యీ స్వర్ణగౌరీ వ్రతమునకు నుద్యాపన విధానమును జెప్పెదను సావధానముతో వినుము యోగ్యమైనతిథి వారములు గల దినమందు తారాచంద్ర బలయుక్తముగా నుండు నప్పుడు చేయదలచినవాడై మంటపము నేర్పరచి యష్ట దళములుగల పద్మమును లిఖించి నచ్చట ధాన్యమును రాశిగా బోసి దాని పయిన పదహారు నరటూకుల యెత్తుగల రాగి కలశమును నువ్వులతో నింపించి యందుంచి దానిపైని పార్వతీ పరమేశ్వరుల ప్రతిమలనుంచి వేదోక్తమంత్రములచే నావాహనాదులనుగావించి రెండు తెల్లని వస్త్రములను యజ్ఞోప వీతముల నుంచి యథావిధిగా పూజనంతయు గావించి యారాత్రి జాగరణము చేయవలెను.

శ్లో॥ ప్రాతః పూజాంతతఃకృత్వా తతోహోమం సమాచరేత్। గ్రహహోమంపురాకృత్వా ప్రధానంజుహుయాత్తతః॥

తా॥ అనంతరము మరునాడుదయమున ప్రాతఃకాలపూజగావించి ముందుగా నవగ్రహ హోమముచేసి పిమ్మట ప్రధానదేవతకు హోమము చేయవలెను.

శ్లో॥ తిలాశ్చయవసంమిశ్రా ఆజ్యేనచపరిప్లుతాః। ద్రవ్యప్రధానేసంఖ్యాతు సహస్రమథవాశతమ్॥ ఆచార్యంపూజయేత్పశ్చాద్వస్త్రాలంకారధేనుభిః। వాయనానిచదేయాని బ్రాహ్మణాంశ్చైవ భోజయేత్॥ దంపతీన్భోజయేచ్చైవ సంఖ్యయాషోడశైవతు! భూయసీందక్షిణాందద్యాత్స్వస్యవిత్తానుసారతః। బంధుభిస్సహభుంజీత హర్షోత్సవ సమన్వితః॥

తా॥ నువ్వులు బియ్యము నెయ్యి కలిపి హోమంచేసి ధనవంతుడుగానుండెనేని విశేషముగాచేయవలెను లేక వెయ్యిపర్యాయములుగాని నూరుపర్యాయములుగాని హోమము చేసిన పిమ్మట నాచార్యునకు వస్త్రములు ఆభరణములు ఆవులు మొదలగువానినిపూజించియిచ్చిపదహారుగురుదంపతులకు వాయనదానమిచ్చిపిమ్మటబ్రాహ్మ

ఱులనుభుజింపజేసి తనశక్తికొలది వారికివిశేషదక్షిణల నిచ్చియానందముతోగూడినవాడై బంధువులతోగూడ యనంతరము తాను భుజింప వలయునని సాంబమూర్తి సనత్కుమార మునీశ్వరునితో చెప్పెను.

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాస మాహాత్మ్యే ఈశ్వర
సనత్కుమార సంవాదే తృతీయా తిథౌ స్వర్ణగౌరీ
వ్రతకథనంనామ ద్వాదశోధ్యాయ స్సమాప్తః

---

## త్రయోదశోఽధ్యాయప్రారంభః

సనత్కుమారఉవాచ॥ శ్లో॥ కేనవ్రతేనభగవన్సౌభాగ్యమతులంభవేత్ । పుత్రపౌత్రధనైశ్వర్యం మనుజస్సుఖమేధతే । తన్మేవద మహాదేవ వ్రతానాముత్తమంవ్రతమ్॥

తా ॥ ఓ భగవంతుడా! మనుష్యుడేవ్రతమునుచేసిన అమితమగు సౌభాగ్యమును పుత్రులను పౌత్రులను ధనమును ఐశ్వర్యమును పొందునో వ్రతములో శ్రేష్ఠంబగు నటువంటి వ్రతమును జెప్పుమని సనత్కుమారుడు సాంబమూర్తి నడిగెను.

ఈశ్వరఉవాచ॥ శ్లో ॥ అస్తిదూర్వాగణపతే ర్వ్రతంత్రైలోక్య విశ్రుతమ్॥ భగవత్యాపురాచీర్ణం పార్వత్యాశ్రద్ధయాసహ । సరస్వత్యామహేంద్రేణ విష్ణునాధనదేనచ॥అన్యైశ్చ దేవై ర్మునిభిర్గంధర్వైః కిన్నరైస్తథా। చీర్ణమేతద్వ్రతంసర్వైః పురాభూన్మునిసత్తమ ॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ మునీశ్వరుడా ! దూర్వా గణపతి యను నొక వ్రతము మూడు లోకముల యందు ప్రసిద్ధికెక్కి యున్నది ఆ వ్రతము పూర్వంబున పార్వతీదేవి, సరస్వతి,ఇంద్రుడు, విష్ణువు,కుబేరుడు, మొదలగువారిచే శ్రద్ధతో చేయబడినది మఱియు నితర దేవతులు. మునీశ్వరులు, గంధర్వులు, కింకరులు మొదలైన వారిచేతను నాచరింపబడి యున్నది.

శ్లో॥ చతుర్థీయాభవేచ్ఛుద్ధా నభోమాసిసుపుణ్యదా।తస్యాం వ్రతమిదంకుర్యా త్సర్వపాపౌఘనాశనమ్ ॥

తా ॥ శ్రావణ మాసములో చవితి విద్ధ మొదలగు దోషములు లేక పూర్ణముగానుండునది పుణ్య ప్రదమైనదిగాన ఆదినంబున సమస్తపాపములను పోఁగొట్టునట్టి దూర్వాగణపతి వ్రతమును చేయవలయును.

శ్లో ॥ గజాననంచతుర్బాహుంతు ఏకదంతవిపాటితమ్ । విధాయహేమ్నావిఘ్నేశం హేమపీఠాసనేస్థితమ్॥ తథాహేమమయీదూర్వా తదాధారేవ్యవస్థితమ్ । సంస్థాప్యవిఘ్నహర్తారం కలశేతామ్రభాజనే॥ వేష్టితే రక్తవస్త్రేణ సర్వతోభద్రమండలే । పూజయేద్రక్తకుసుమైః పత్రికాభిశ్చవంచభిః॥అపామార్గశంకేమీదూర్వా తులసీపత్రకైస్తథా। అన్యైస్సుగంధైః కుసుమై ర్యథాలబ్ధైస్సుగంధిభిః॥

తా ॥ ఒక్కదంతము పెరికి వేయుటచే నొక్కదంతముతో నొప్పుచుండెడి విఘ్నేశ్వరుని యొక్క బంగారపు ప్రతిమను బంగారపు పీఠము నందుండునట్లుగా అట్టి పీఠమును బంగారపు గరికెలుమీద నుండునట్లుగాను చేయించి యట్టి విఘ్నేశ్వరుని ప్రతిమను ఎఱ్ఱని వస్త్రములచే జుట్టబడిన రాగి కలశము నందుంచి యాకలశము సర్వతోభద్రమనెడు మండలమును లిఖియించిదానియందుంచవలెను అనంతరం ఎఱ్ఱని పుష్పములతోను ఉత్తరేణి, జమ్మిగరిక, తులసి దళములు, మొదలగు నైదు విధములగు పత్రములచేతను మఱియు నితర మయిన సువాసనగల పుష్పముల చేతను పూజింపవలెను.

శ్లో॥ ఫలైశ్చమోదకైః పశ్చా దుపహారంప్రకల్పయేత్ ।యథావదుపచారైశ్చ పూజయేద్గిరిజాసుతమ్॥

తా ॥ అనంతరము ఫలములు ఉండ్రాళ్లు భక్ష్యములు మొదలగు నవి ఫలహార ములుగా సమర్పించి యథా విధిగా షోడశోప చారముల చేతను వినాయకుని పూజ చేయ వలయును.

శ్లో ॥ ప్రతిమాయాం స్వర్ణమయ్యాం నిర్మితాయాం యథావిధి। ఆవాహయామివిఘ్నేశ మాగచ్ఛతుకృపానిధిః ॥

తా ॥ బంగారపు ప్రతిమయందు వినాయకుని యథా విధిగా నావాహనం చేసితిని కాఁబట్టి దయా సముద్రుడవగు విఘ్నేశ్వరుడు వచ్చి యీ ప్రతిమ యందు నివసించు గాక.

శ్లో॥ రత్నస్యూతమిదంహైమం సింహాసనమనుత్తమం । ఆసనార్థమిదందత్తం ప్రతిగృహ్ణాతువిశ్వరాట్ ॥

తా ॥ రత్నఖచితమైన యీ బంగారపు సింహాసనమును, కూర్చుండుటకు నుంచితిని కాబట్టి విఘ్నేశ్వరుడు గ్రహించుగాక

శ్లో ॥ ఉమాసుతనమస్తుభ్యం విశ్వవ్యాపిస్సనాతన । విఘ్నౌఘుంఛిందిసకలం మమపాద్యందదామితే॥

తా ॥ పార్వతీదేవి కుమారుడును విశ్వవ్యాపకుడవును సనాతనుడవు నగు యో విఘ్నేశ్వరా ! నా సమస్త విఘ్నములను పోగొట్టుము నీకు పాద్యము నిచ్చుచున్నాను గ్రహింపుము.

శ్లో॥ గణేశ్వరాయ దేవాయ ఉమాపుత్రాయ వేధసే । అర్ఘ్యంగృహాణ...మేతత్ప్రియచ్ఛామి గృహాణభగవన్నమ ॥ వినాయకాయ శూరాయ వరదాయనమోనమః। ఇదమాచమనీయంతే దదామిప్రతిగృహ్యతాం॥

తా ॥ దేవుండును పార్వతీ దేవి కుమారుడును బ్రహ్మ స్వరూపుండు నగు గణాధిపతికి నర్ఘ్యము నిచ్చుచున్నాను ఓ భగవంతుడా ! నీవు గ్రహింపుము శూరుండును వరదుడునగు వినాయకునకు నమస్కారము ఓ వినాయకా నాచేనివ్వబడు యీ ఆచమనమును నీవు గ్రహింపుము.

శ్లో॥ గంగాదిసర్వతీర్థేభ్యో మయాప్రార్థనయాహృతమ్। స్నానార్థంతేమయాదత్తం గృహాణసురపుంగవ ॥ సింధూరేణయథాలక్ష్మ కుంకుమైరంజితంమయా। వస్త్రయుగ్మమిదందత్తం గృహాణత్వాం నమోస్తుతే ॥

తా॥ దేవోత్తమా ! గంగాది సమస్తనదులను ప్రార్థించి తీసికొనిరాబడిన జలమును స్నానార్థ మిచ్చితిని కాబట్టి గ్రహింపుము సిందూరము కుంకుమచే నలంకరింప బడిన వస్త్రముల నిచ్చితిని కాబట్టి యో వినాయకా నీకు నమస్కారముచేసెదను గ్రహింపుము.

శ్లో॥ లంబోదరాయ దేవాయ సర్వవిఘ్నాపహారిణే । ఉమాంగమలసంభూత చందనంప్రతిగృహ్యతాం ॥ అక్షతాశ్చసురశ్రేష్ఠ రక్తచందనచర్చితాః। మయానివేదితాభక్త్యా గృహాణసురసత్తమ ॥

తా ॥ దేవుండును సమస్త విఘ్నములను పోగొట్టువాడును లంబోదరుడు నగు పార్వతీదేవి కుమారునకు గంధము నిచ్చితిని కాబట్టి గ్రహించుగాక ఓ దేవో

త్తమా ! ఎఱ్ఱని గంధముతో మిశ్రితము లగు నక్షతలను భక్తితో నిచ్చితిని కాఁబట్టి వానిని గ్రహింపుము.

శ్లో ॥ చంపకైః కేతకీపత్రైః జాజీపాటలమల్లికైః । గౌరీపుత్రం పూజయామి ప్రసీదస్వ గణాధిప ॥ అనుగ్రహాయ లోకానాం దానవానాం వధాయచ । అవతీర్ణాయ స్కందగురు ధూపం గృహాణ తు మే ముదా ॥

తా ॥ సంపంగి పువ్వులు, మొగలి పువ్వులు, దాసాని పువ్వులు, మొదలగు వానిచే పార్వతీదేవి కుమారుని పూజచేయుచుంటిని కాఁబట్టి నాయందు ననుగ్రహముంచుగాక, లోకములను రక్షించుటకును రాక్షసులను సంహరించుటకును నవతరించిన కుమారస్వామికి నన్నయగు వినాయకుడు నాచే నివ్వబడిన ధూపమును సంతోషముతో గ్రహింపుగాక.

శ్లో ॥ పరంజ్యోతిః ప్రకాశాయ సర్వసిద్ధిప్రదాయచ । దీపం తుభ్యం ప్రదాస్యామి మహాదేవాత్మ నేనమః ॥ గణానాం త్వేతి నైవేద్య మర్పయేన్మోదకాదికమ్ । అన్నం చతుర్విధం చైవ పాయసం లడ్డుకాదికం ॥

తా ॥ పరంజ్యోతి స్వరూపుడును సమస్త సిద్ధుల నిచ్చువాడును మహాదేవ స్వరూపుడవు నగు నీకు దీపమును సమర్పించుచున్నాడను, కుడుములు పరమాన్నం అప్పాలు మొదలగు భక్ష్యములతో గూడిన నాలుగు విధము లగు నన్నముతో గూడ (గణానాంత్వా) అనుమంత్రం జెప్పి నీకు నివేదనం చేయుచున్నాను.

శ్లో ॥ కర్పూరైలాదిసంయుక్తం నాగవల్లీదళాన్వితమ్ । తాంబూలం తే ప్రదాస్యామి ముఖవాసార్థమాదరాత్ ॥

తా ॥ ఓ వినాయకా! కర్పూరం, లవంగములు, ఏలకులు, పోకచెక్కలు, తమలపాకులు మొదలగు వానితో గూడిన తాంబూలమును ముఖము నందు సువాసన కొఱకు నాదరముతో నీకునిచ్చుచున్నాను

శ్లో ॥ హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః । దక్షిణాం తే ప్రదాస్యామి స్వతః శాంతిం ప్రయచ్ఛమే ॥ గణేశ్వరగణాధ్యక్ష గౌరీపుత్ర గజానన । వ్రతం సంపూర్ణతాం యాతు త్వత్ప్రసాదాదిభానన ॥

తా ॥ ఓ వినాయకా ! బ్రహ్మయొక్క హృదయమునం దున్నదియు నగ్నికి కారణమైన బంగారపు దక్షిణ నిచ్చుచుంటిని కాఁబట్టి నాకు శాంతిని కలుగఁజేయుము పార్వతియొక్క కుమారుడును ఏనుగు ముఖము కలవాడును గణాధిపతియు

నగు రో విఘ్నేశ్వరా! నీ యనుగ్రహము వలన నే చేసినవ్రతము సంపూర్ణమయిన దని యగుగాక,

శ్లో॥ ఏవంసంపూజ్యవిఘ్నేశం యథావిభవవిస్తరైః । సోపస్కరంగణాధ్యక్ష మాచార్యాయ నివేదయేత్॥

తా ॥ యీ ప్రకారము తనశక్తికొలది విఘ్నేశ్వరుని పూజించి యావిఘ్నేశ్వర ప్రతిమను అక్కడ నుంచ బడిన యావత్తు ద్రవ్యములో కూడ ఆచార్యునకు దానపూర్వకముగా సమర్పించవలెను.

శ్లో॥ గృహాణభగవన్బ్రహ్మన్ గణరాజంసదక్షిణం। ఏతత్త్వద్వచనాదస్య పూర్ణతాంయాతుమేవ్రతమ్॥ ఏవంయః పంచవర్షాణి కృత్వోద్యాపనమాచరేత్ । ఈప్సితాన్ లభతేకామాన్ దేహాంతేశంకరంపదమ్॥ యద్యావర్షత్రయంకుర్యా త్సర్వసిద్ధి మవాప్నుయాత్। ఉద్యాపనంవినాయస్తు కరోతివ్రతముత్తమం॥ సర్వంనిష్ఫలతాంయాతి యథావిధ్యపి యత్కృతమ్ । ఉద్యాపన దినేప్రాత స్తిలైస్స్నానం సమాచరేత్॥

తా ॥ భగవత్స్వరూపుడవగు నో బ్రాహ్మణోత్తమా! దక్షిణ సహితముగా నేనిచ్చునట్టి విఘ్నేశ్వరప్రతిమను గ్రహింపుము మీవచన ప్రకారముగానే చేసిన వ్రతము సంపూర్ణము నొందు గాక యని దాన మియ్య వలయును, యీ ప్రకార మైదు సంవత్సరములు వ్రతము చేసి పిమ్మట నుద్యాపనము చేసిన యెడల నీ లోకంబున సమస్తకోరికల ననుభవించి దేహాంతమందు కైలాసమును బొందును లేకమూడు సంవత్సరములు చేసినను సమస్త కోరికలను పొందును, ఉద్యాపనం చేయకవ్రతము మాత్రమునే చేసిన యెడల వాడు యథా విధిగా చేసినను వ్రతము నిష్ఫల మగును, కాబట్టి యుద్యాపన దినమునం దుదయమున నూనెతో తలంటి పోసుకొన వలెను.

శ్లో॥ హేమ్నఃపలార్ధదర్ధార్ధా త్కృత్వాగణపతింబుధః।పంచగవ్యైస్తుసంస్నాప్య దూర్వాభిస్తుప్రపూజయేత్॥

తా ॥ విద్వాంసుడు పలమునుగాని, దానిలో సగముగాని, పాతికపలంబుగాని, బంగారముతో విఘ్నేశ్వర ప్రతిమను చేయించి పంచ గవ్యములతో స్నానంచేయించి గరికెలు మొదలగు వానితో పూజింపవలెను.

శ్లో॥ మంత్రైస్తుదశభిర్భక్త్యా శ్రద్ధయాసహితోనరః॥ గణాధీశ నమస్తుభ్య ముమాపుత్రాఘనాశన॥ వినాయకేశపుత్రేతి సర్వసిద్ధిప్రదాయక। ఏకదంతేభవక్త్రేతి॥ తథామూషకవాహన॥ కుమారగురవే తుభ్య మితినామపదైఃపృథక్। పూర్వేద్యురధివాసైశ్చ ప్రాతర్హోమంసమాచరేత్॥ దూర్వాభిర్మోదకైశ్చైవ గ్రహహోమపురస్సరం। పూర్ణాహుతింతతోహుత్వా చాచార్యాదీన్ప్రపూజయేత్ ॥

తా॥ ముందు చెప్పబడెడు పదిమంత్రములచేతను ప్రతి మనుష్యుడును శ్రద్ధగా పూజింపవలెను, గణాధీశ, ఉమాపుత్ర, అఘనాశన, వినాయక, ఈశపుత్ర, సర్వసిద్ధి ప్రదాయక, ఏకదంత, ఇభవక్త్ర, మూషక వాహన, కుమారగురో, నీకు నమస్కారము అని యీ పది నామములచేతను వేరువేరుగా పూజింపవలయును. పూర్వదినమునందు మంటపారాధనముచేసి మరునా డుదయమున గరికలు కుడుములు మొదలగు వానిచే గ్రహములకు ప్రధాన దేవతలకును హోమముచేసి యనంతరం పూర్ణాహుతిని గావించి పిమ్మట నాచార్యుడు మొదలగువారిని పూజింపవలెను.

శ్లో॥ గాంసవత్సాంఘటోధ్నీంచ దద్యాద్విత్తానుసారతః। ఏవం కృతేవ్రతేవత్స సర్వాన్కామానవాప్నుయాత్ ॥

తా ॥ ఓ చిన్నవాడా! కడవతో సమానమగు పొదుగు గలదియు దూడగలదియు నగు ఆవును గోదానమును, మఱియు తన శక్తి కొలది నితర దానము లను చేయవలయును యిట్లు వ్రతమును చేసిన యెడల సమస్తకోరికలనుపొందును.

శ్లో॥ మదీయప్రియపుత్రస్య వ్రతేనాహంచతోషితః । భువిదత్వాసర్వభోగం దదామ్యంతేచసద్గతిమ్॥

తా ॥ నాకు ప్రియమైన కుమారుడగుట వలన గణపతి వ్రతం చేయుటచే నేను సంతోషించి భూలోకము నందుండు నంతకాలము సమస్త భోగముల నిచ్చి యంత్య కాలమునకు కైలాస మిచ్చెదను.

శ్లో॥ యథాశాఖాప్రశాఖాభి దూర్వావృద్ధిగతాభవేత్।తథైవ పుత్రపౌత్రాది సంతతిర్వృద్ధిగామినీ॥

తా ॥ దూర్వములు వాటివాటికి శాఖలచే నేరీతిగా వృద్ధి పొందునో ఆరీతిగానే దూర్వాగణపతి వ్రతమును చేసినవాడు పుత్రులు పౌత్రులు. మొదలగు సంతానంచే వంశవృద్ధి గలవాడగును.

శ్లో॥ ఇత్యేతత్కథితంగుహ్యం దూర్వాగణపతివ్రతమ్। శ్రేష్ఠాచ్ఛ్రేష్ఠతరంచైవ కర్తవ్యంసుఖమీప్సుభిః॥

తా॥ ఓ మునీశ్వరులారా! రహస్యంగా నుండు నట్టి దీనిని మిక్కిలి శ్రేష్ఠంబయిన దూర్వా గణపతి వ్రతమును నీకు చెప్పితిని యిట్టి వ్రతమును సుఖము నపేక్షించు వారందరు నాచరింపవలయును,

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాస మాహాత్మ్యే ఈశ్వర
సనత్కుమార సంవాదే దూర్వాగణపతివ్రతకథనం
నామ త్రయోదశోఽధ్యాయ స్సమాప్తః

---

## అథ చతుర్దశోఽధ్యాయ ప్రారంభః

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి శ్రావణేశుక్లపక్షకే। పంచమ్యాంయచ్చకర్తవ్యం తచ్ఛృణుష్వమహామునే॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓమునీశ్వరా! యిక ముందు శ్రావణ శుద్ధ పంచమీ దినంబున చేయతగిన వ్రతంచెప్పెదను,

శ్లో॥ చతుర్థ్యామేక భుక్తంతు నక్తంస్యాత్పంచమీదినే। కృత్వాస్వర్ణమయంనాగ మథవారౌప్యసంభవమ్। కృత్వాదారుమయంవాపి అథవామృన్మయంశుభం। పంచమ్యామర్చయేద్భక్త్యా నాగంపంచఫణాన్వితమ్। ద్వారస్యోభయతోలేఖ్యా గోమయేనవిషోల్బణాః। పూజయేద్విధివచ్చైవ దధిదూర్వాంకురైశ్శుభైః॥ కరవీరైర్మాలతీభిజాతి పుష్పైశ్చచంపకైః। తథాగంధైరక్షతైశ్చ ధూపైదీపైర్మనోహరైః॥

తా॥ చవితియందు నొక్కసారి భుజించి పంచమీదినంబున రాత్రి భుజింపవలయును బంగారంతోగాని వెండితోగాని కొయ్యతోగాని మట్టితో గాని యైదు పడగలుగల సర్పం చేర్పరచి దానిని పంచమీ దినంబున పూజింప వలయును మరియు ద్వారమునకు రెండు ప్రక్కలను విషముతో నధికంగా నుండు సర్పములను

గోమయంతో లిఖియించి గరిక చిగుళ్లు కరవీర పుష్పములు, కన్నెరు పుష్పములు, జాజిపువ్వులు, సంపంగి పువ్వులు, గంధం, అక్షతలు. మొదలగు వానిచే పూజించి ధూప దీపాదుల నివ్వవలయును,

శ్లో॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్ఘృతమోదక పాయసైః॥ అనంతంవాసుకింశేషం పద్మనాభంచకంబలమ్॥ తథాకర్కోటకంనామ నాగమశ్వతథాష్టమమ్। ధృతరాష్ట్రంశంఖపాలం కాళీయంతక్షకంతథా॥ హరిద్రయాచందనేన కుడ్యేనాగకులాధిపాః। సవర్ణమాన్త్రింశ్చసంలిఖ్య పూజయేత్కుసుమాదిభిః॥

తా॥ అనంతరము నెయ్యి, పరమాన్నము, కుడుములు, మొదలగు వానిచే బ్రాహ్మణులను భుజింపచేయవలయును మఱియు అనంతరము వాసుకి, శేషుడు, పద్మనాభుడు, కంబలుడు, కర్కోటకుడు, నాగుడు, ధృతరాష్ట్రుడు, శంఖపాలుడు, కాళీయుడు, తక్షకుడు, మొదలగు సర్పరాట్టులను మఱియు నితరసర్పములను గోడయందు పసుపుతోటి మంచిగంధముతోటి యాకారములను లిఖియించి పుష్పములు మొదలగు వానిచే పూజింప వలయును.

శ్లో॥ వల్మీకేపూజయేన్నాగాన్దుగ్ధంచైవహిపాయయేత్। ఘృతయుక్తంశర్కరాదియథేష్టంచార్పయేద్బుధః॥

తా॥ పుట్టయందు పూజచేసి దానిలోనుండు సర్పములు త్రాగుటకు పాలు పోయవలయును మఱియు నేతితో మిళితమైన పంచదార మొదలగు మధురపదార్థముల నిష్టమైనట్లుంచవలయును

శ్లో॥ లోహపాత్రేపోళికాది నకుర్యాత్తద్దినేనరః। గోధూమపాయసంకుర్యాన్నైవేద్యార్థంతుభక్తితః॥

తా॥ ఆదినంబున పోళీలు మొదలగునవి చేయగూడదు యినుము పాత్రను వాడగూడదు నివేదనకు పరమాన్నమును భక్తితో నుంచవలయును

శ్లో॥ భర్జితాశ్చణకాశ్చైవ వ్రీహయోయావనాలికాః। అర్పణీయాశ్చసర్వేభ్యస్స్వయంచైవతుభక్షయేత్॥

తా॥ వేయించిన శనగలును బియ్యమును జొన్నలును సర్పములకు నివేదన చేయవలయును వానినే తాను భుజింపవలయును

శ్లో ॥ బాలకేభ్యోర్పణీయాశ్చ దృఢాదంతా భవంతిహి। వల్మీకస్యసమీపేతు గాయనంవాద్యమేవచ ॥ స్త్రీభిఃకార్యం భూషితాభిః కార్యశ్చైవోత్సరోమహాన్ । ఏవంకృతేకదాచిచ్చ సర్పతోనభయం భవేత్ ॥

తా ॥ ఆనివేదన చేయబడిన శనగలు మొదలగువానిని పిల్లలకు పెట్టవలెను, వానిని భుజించిన పిల్లలు దంతపుష్టి గలవారగుదురు మఱియు స్త్రీలు అలంకరించుకొని పుట్టవద్ద సంగీతము పాడుటయు వాద్యములను వాయించుటయు విశేషమహోత్సవములను జరుపుటయు చేయువలయును యిట్లు చేసిన యెడల వానికి నెప్పటికిని సర్పముల వలన భయము కలుగబోదు

శ్లో ॥ అన్యచ్చశ్రుణు యూద్విప్ర లోకానాంహితకామ్యయా। కథయిష్యామికించిత్తే తచ్ఛృణుష్వమహామునే॥

తా ॥ ఓ మునీశ్వరుడా ! ప్రపంచమునకు మేలు కొఱకు మఱియొక సంగతిని నీకు తెలియ పరచెదను దానినివినుము.

శ్లో ॥ నాగదష్టోనరోవత్స ప్రాప్యమృత్యుంవ్రజత్యధః । అధోగత్వాభవేత్సర్ప స్తస్మాదిహావ్రతంచరేత్ ॥

తా ॥ ఓ చిన్నవాడా! సర్పముచే కరవబడినవాడు మృత్యువునొంది యధోగతుడై తిరిగి సర్పముగా బుట్టును కాఁబట్టి యట్టి దోషము లేమియు పొందకుండుటకుగాను నాగపంచమీ వ్రతమును చేయువలెను

శ్లో॥ పూర్వోక్తవిధినాసర్వ మేకభుక్తాదికారయేత్ । నాగనిర్మాణపూజాది విప్రైస్సహతథాదరాత్ ॥

తా ॥ కాఁబట్టి పూర్వము చెప్పిన రీతిగా ఒక్కసారి భుజించుటయు బ్రాహ్మణులతోగూడ సర్పపూజ గావించుటయు చేయువలెను

శ్లో॥ ఏవంద్వాదశమాసేషు మాసిమాసివ్రతంచరేత్ । పంచమ్యాంశుక్లపక్షస్య పూర్ణేసంవత్సరేపునః ॥ బ్రాహ్మణాంశ్చ యతీంశ్చైవ నాగానుద్దిశ్య భోజయేత్ । ఇతిహాస విదేనాగం కాంచనంరత్నచిత్రితమ్ ॥ గాంచదద్యాత్సవత్సాంవై సర్వోపస్కర సంయుతామ్। స్వర్ణశృంగీంరౌప్యఖురాం బహుక్షీరప్రదాయినీమ్ ॥

తా ॥ ఈ ప్రకారము పండ్రెండు మాసములలో ప్రతి మాసము నందును వ్రతమాచరింపవలయును సంవత్సరము పూర్తికాగానే శుక్ల పక్ష పంచమీదినంబున సర్పముల తృప్తికొఱకు బ్రాహ్మణులను యతీశ్వరులను భుజింప చేయవలెను, కథలను వినిపించిన వానికి రత్నములతో గూర్చబడినబంగారపు నాగప్రతిమను, దూడ గలదియు బంగారపు కొమ్ములు గలదియు వెండి డెక్కలు గలదియు విశేషముగా పాలు నిచ్చునదియు నైన గోవును దానమియ్యవలయును

శ్లో ॥ దానకాలేపఠేదేవం హి స్మరన్నారాయణంవిభుమ్ ॥ సర్వగంసర్వదాతార మనంతమపరాజితమ్ ॥ యేకేచిన్మేకులేసర్ప దష్టాః ప్రాప్తాహ్యధోగతిమ్ । వ్రతదానేనగోవింద ముక్తిభాజో భవంతుతే॥ ఇత్యుచ్చార్యాక్షతైర్యుక్తం సితచందనమిశ్రితమ్ ॥ వాసుదేవాగ్రతో భక్త్యా తోయంవినిక్షిపేత్ ॥

తా॥ దానమిచ్చు సమయంబున సమస్తమును వ్యాపించినవాడును సమస్తము నిచ్చువాడును ఎవనిచే జయింపబడని వాడును నగు భగవంతుని స్మరింపుచు నిట్లు చెప్పవలెను ఓ భగవంతుడా ! నావంశంబున సర్పదష్టులై మృతినొంది యధోగతులయియుండిరేని వారందరు నిప్పుడు నే జేసిన వ్రత ప్రభావముచే ముక్తి నొందుదురు గాకయని చెప్పి మంచి గంధముతో కలిపిన యక్షతల నుదకముతోగూడభక్తి పూర్వకముగా భగవంతు నెదుట నుదకములో విడువవలెను

శ్లో॥ అనేనవిధినాసర్వే నోమరిష్యంతిమానవాః।సర్పతస్తేవ భియాప్స్యంతి స్వర్గతింమునిసత్తమ॥

తా॥ యీ ప్రకార వ్రతమాచరించినరెుడల నిదివరలో మృతినొందిన వారు ముందు మృతి నొందెడి వారును సర్పముల వలన భయము నొందక స్వర్గమును పొంద గలరు

శ్లో ॥ ఏవంసర్వాన్సముద్ధృత్య కులజాన్కులనందన । ప్రయాతి శివసాన్నిధ్యం సేవ్యమానోప్సరోగణైః । విత్తశాఠ్యవిహీనోయ స్సర్వమేతత్ఫలంలభేత్ ॥

తా ॥ ఓ మునీశ్వరుడా ! ఈ ప్రకారము తన వంశస్థుల నందరిని తరింప జేసి తానును అప్సర స్త్రీలచే సేవింపబడుచు శివలోకమును పొందును తనకు శక్తి కొలది లోభింపక వ్రతమును చేసిన వాడు పూర్వం చెప్పబడిన ఫలమునుపొందును,

శ్లో ॥ నక్తేనభక్తిసహితా స్సితపంచమీషుయే పూజయంతిసు భగాన్ కుసుమోపహారైః । తేషాంగృహేష్వ భయదాహిభవంతి సర్వాహిపాః న్విళామణిమయూఖవివిభాసితాంగాః ॥

తా ॥ భక్తి కలవారై శుక్లపక్షపంచమీలయందు సర్పములను పుష్పములచే పూజించుచు నక్తభోజనము చేసిన వారియొక్క గృహముల యందు భయము నెంత మాత్రము కలుగ నీయక సర్పములు మణుల కాంతులతో ప్రకాశించుచు సంతోష ముతో తిరుగుచుండును.

శ్లో॥ ప్రతిగ్రిహంయేచకురుర్యై గృహదానస్య బాడబాః ॥ ప్రయాంతిసర్పతాం తేపి ఘోరాంభుక్త్వాతుయాతనామ్॥

తా॥ యీ వ్రతము నాచరింపని బ్రాహ్మణులు గృహదానమును స్వీకరించినయెడల విశేష నరకము ననుభవించి సర్పరూపులగుదురు

శ్లో ॥ అంతకాలేచయేకేచి న్నాగహత్యావశాదిహ । మృతా పత్యాఅపుత్రావా భవంతిమునిసత్తమ ॥

తా ॥ యెవరైనను సర్పములనుజంపి లేని వారు మృతినొందినపిమ్మట రెండవ జన్మమునందుపుట్టిన సంతానమునశించువారుగాని పుత్రులులేనివారుగాని కాగలరు.

శ్లో॥ కార్పణ్యావశతస్త్రీణాం సర్పతాంయాంతికేచన । విక్షేపా నృతవాదాచ్చ కేచిత్సర్పాః భవంతిహి॥

తా ॥ స్త్రీలయందు కార్పణ్యముగా నున్నట్టివారును ఆక్షేపణలను చేసిన వారును అబద్ధము పలికినవారును సర్పములుగా పుట్టుదురు

శ్లో॥ అన్యైశ్చాపినిమిత్తైర్యే సర్పతాంయాంతిమానవాః। ఉపాయోయంవినిర్దిష్ట స్సర్వేషాంనిష్కృతౌపరః ॥

తా ॥ మఱియు నితరములగు నానేక కారణముల వలన సర్ప స్వరూపము లుగా పుట్టెదరు కాబట్టి అట్టి సమస్తదోషములకును ఈచెప్పబడినవ్రతము మిక్కిలి ప్రాయశ్చిత్తముగా చెప్పబడెను

శ్లో॥ విత్తశాఠ్య విహీనేన కృతాచేన్నాగ పంచమీ । తద్ధితా ధరాంహారింశేషః సర్వనాగాధిపోవిభుమ్ ॥ బద్ధాంజలిః ప్రార్థయతే వాసుకిశ్చసదాశివం। శేషవాసుకివిజ్ఞప్త్యా శివవిష్ణుప్రసాదితౌ ॥ మనోరథాం స్తస్యసర్వా న్కురుతః పరమేశ్వరా । నాగలోకేతుతాన్భోగా

స్భుక్త్వాతువివిధాన్భహూన్ ॥ తతోవైకుంఠమాసాద్య కైలాసంవాపి శోభనమ్। శివవిష్ణు గణోభూత్వా లభతేపరమంసుఖమ్ ॥

తా॥ ద్రవ్యలోపం లేకుండా నాగపంచమీ వ్రతమును చేసినయెడల సమస్త సర్పములకు నధిపతిలగు శేషుడును వాసుకియు సంతృప్తులై వ్రతము చేసిన వానికి మేలు చేయుట కొఱకు దోసిలి పట్టుకొని ప్రభువులగు విష్ణుమూర్తిని సాంబమూర్తిని ప్రార్థించెదరు సర్వదేవతా సార్వభౌములగు శివకేశవులు శేషవాసుకులవిజ్ఞాపనచే సంతుష్టాంత రంగులై సమస్త కోరికల నొసగు చున్నారు యిట్లువారొసగిన సమస్తకోరికల నిహలోకంబున ననుభవించి పిమ్మట నాగలోకమున కేగి నచ్చట పంభవించిన సమస్తభోగముల ననుభవించి యనంతరం మంగళ ప్రదములగు వైకుంఠము కైలాస లోకములకేగి నచ్చట శివ విష్ణువులకు భృత్యగణములతో చేరి సేవ చేయుచు ననంతరం పరమసుఖకరమగు ముక్తినొందెదరు.

శ్లో॥ ఏత త్తేకధితంవత్స నాగానాంపంచమీవ్రతమ్। అతఃపరం కిమన్య త్త్వం శ్రోతుమిచ్ఛసితద్వద॥

తా॥ ఓ చిన్నవాడా! యిట్టి శ్రేయస్కరమగు నాగపంచమీ వ్రతమును నీకు జెప్పితిని మఱియు నింతకంటె మఱియొకవ్రతం జేదియైనను నీవు వినదలచితి వేని దాని నడుగుము చెప్పెదను అని సాంబమూర్తి సనత్కుమారునితో చెప్పెను.

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాస మాహాత్మ్యే ఈశ్వర
సనత్కుమార సంవాదే నాగపంచమీవ్రతకథనం
నామ చతుర్దశోధ్యాయ స్సమాప్తః

---

## పంచదశోధ్యాయ ప్రారంభః

సనత్కుమారఉవాచ॥ శ్లో॥ శ్రుతమాశ్చర్యజనకం నాగానాం పంచమీవ్రతం । షష్ఠ్యాంకథయ దేవేశ కింవ్రతంకోద్యశోవిధిః॥ ఈశ్వర ఉవాచ ॥ శ్లో॥ శుక్లపక్షేశ్రావణేతు షష్ఠ్యాంకార్యం వ్రతంశుభమ్। సూపౌదనాఖ్యంవిప్రేంద్ర మహామృత్యువినాశనమ్ ॥

తా ॥ ఓస్వామీ ! ఆశ్చర్యమును కలుగచేసెడి నాగపంచమీ వ్రతమును వింటిని ఇక ముందు షష్ఠీ తిథియందు ఏ వ్రతమును చేయవలయునో యేవిధిగాచేయవలయునో దానిని చెప్పుమని సనత్కుమారు డడుగగా సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ బ్రాహ్మణోత్తమా! శ్రావణశుద్ధషష్ఠియందు సూపౌదనమనే వ్రతమును చేయవలయును ఆవ్రతమును చేసిన యెడల అపమృత్యువు తొలగుటయే గాక మహామృత్యువైనను తొలగిపోవును.

శ్లో॥ శివాలయేగృహేవాపి శివంసంపూజ్యయత్నతః । సూపౌదనస్యనైవేద్య మర్పయేద్విధిసంయుతః॥

తా ॥ శివాలయమునందు గాని తన గృహమునందు గాని శివుని యథావిధిగా పూజించి పప్పు అన్నమును నివేదన చేయవలెను.

శ్లో ॥ ఆమ్రస్యలవణంశాకం సాధనేపరికల్పయేత్ । నైవేద్యస్యపదార్థైస్తు వాయనంబ్రాహ్మణస్యచ ॥

తా ॥ ఉప్పుకలిపిన మామిడికాయ కూరను దానికి సాధనముగా నుపయోగింపవలయును ఏ పదార్థములు దేవునకు నివేదనము చేయుచున్నారో ఆ పదార్థములనే బ్రాహ్మణులకు వాయనమివ్వవలయును.

శ్లో॥ యఏతద్విధినాకుర్యా త్తస్యపుణ్యమనంతకమ్। అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనమ్॥

తా ॥ యీ విధముగా వ్రతమును చేసినవానియొక్క పుణ్యము విశేషముగానుండును యిందును గురించి పూర్వము జరిగిన కథయొకటి కలదు దానిని జెప్పెదను సావధానముగా వినుము.

శ్లో॥ రాజాసీద్రోహితోనామ బహుకాలమపుత్రవాన్। పుత్రార్థీసతపశ్చక్రే మహత్పరమదారుణమ్॥

తా॥ పూర్వకాలంబున రోహితుడను రాజు కలడు ఆయనకు చాలాకాలము వఱకు సంతానం లేక పోవుటచే పుత్రులను పొందవలయుననే కోరికచే మిక్కిలి ఘోరమైన తపస్సుచేసెను,

శ్లో॥ ప్రారబ్ధేనాస్తితేపుత్రో బోధితోపిసవేధసా । నిర్బంధాన్ననివృత్తోభూ త్తపసస్సోతిలాలసః ॥

తా ॥ యిట్లు తపస్సు జేయగా బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై మోరాజా నీవు జేసిన పూర్వ కర్మలలో కుమారుడు కలుగు నట్టి యోగ్యతలేదు కాబట్టి తపస్సును చాలింపుమని యెంత చెప్పినను వినక సంతానమును పొందవలయునను కోరికచే తపస్సును చాలించలేదు,

శ్లో ॥ తతస్సంకటమాపన్నో వేధాః ప్రాహ పురభూత్స్వనః। పుత్రో దత్తస్తవమయా హ్యల్పాయుస్సభవిష్యతి ॥

తా ॥ యిట్లు తీవ్రమగు తపస్సుచేయుటచే కష్టముతోచి బ్రహ్మదేవుడు తిరిగి ప్రత్యక్షమై మోరాజా! నీకు పుత్రునిచ్చితిని కాని యాతడు త్వరలోనే మృతినొందును అని బ్రహ్మదేవుడు చెప్పెను

శ్లో॥ పత్నీ రాజామంత్రయేతాం వంధ్యాత్వంతుగమిష్యతి। అపుత్రిత్వాపవాదశ్చ అలమిత్యేవజాతుతామ్॥ తతో బ్రహ్మవరాత్పుత్రో హ్యషశోక పరోభవత్ । జాతకర్మాది సంస్కారాం శ్చక్రే రాజా యథావిధి ॥

తా ॥ అనంతర మారాజు రాజుగారిభార్యయు నీ విధముగా నాలోచించిరి సంతానము లేకుండుటచే పుత్రులు లేరనియు గొడ్డురా లనియు లోకులు చెప్పు కొందురు పుట్టి గతించినప్పటికి అట్టి యపవాదకలుగదు గాన స్వల్పాయుర్దాయం కలవాడయినను పుత్రు నిమ్మని వారు కోరగా నాప్రకారమే బ్రహ్మదేవుడు పుత్రు నొసగెను, ఆ పుత్రుడు కలిగినందు కలవ సంతోషమును, అల్పాయుర్దాయవంతు డగుటచే విచారమును కలవాడై యారాజు పుట్టిన పిల్లవానికి జాతకర్మాది సంస్కారముల నన్నియు యథావిధిగా చేసెను

శ్లో॥ రాజ్ఞీ సాదక్షిణానామ రాజాచైవసరోహితః । శివదత్త ఇతిప్రేమ్ణా చక్రతుర్నామతస్యతౌ ॥

తా॥ దక్షిణయను పేరుగల రాజు గారి భార్యయు రోహితుడను రాజును ఆ పుట్టిన పిల్లవానికి శివదత్తుడను పేరుపెట్టిరి.

శ్లో॥ ఉపనీతశ్చతనయో రాజ్ఞాతుభయచేతసా । వివాహంనచకారాస్య భూమిపాలోమృతేర్భయాత్ ॥

తా॥ అనంతర మారాజు పిల్లవానికి వయస్సురాగానే ఉపనయనముమాత్రం చేసెను అల్పాయుర్దాయము కలుగుటచే మృతినొందు ననే కారణముచే నితనికి వివాహము చేయలేదు.

శ్లో॥ తదాషోడశవర్షేణ సో మరణంప్రాప్తపుత్రకః । చింతామాపపరాంరాజా బ్రహ్మచారీమృతింస్మరన్॥ యేషాంకులేబ్రహ్మచారీ నిధనంప్రాప్నుయాద్యది । తత్కులంక్షయమాయాతి సోపిదుర్గతిమాపతేత్ ॥

తా ॥ అనంతర మా పిల్లవాడు పదియారవ సంవత్సరము నందు మరణము నొందెను ఎవని వంశములో బ్రహ్మచారిగానుండి మరణమునొందునో వానివంశము అంతరించుటయే గాక అట్టివాడును దుర్గతి నొందును అని యారాజు తన కుమారుడు బ్రహ్మచారిగానుండి మృతినొంది నాడని మిక్కిలి దుఃఖము నొందెను.

సనత్కుమార ఉవాచ ॥ శ్లో ॥ దేవదేవ జగన్నాథ పరిహారో స్తివానవా। అస్తిచేచ్ఛవదస్వాద్య దోషశాంతిర్యథాభవేత్॥

తా ॥ దేవదేవుండవును జగత్ప్రభువునగు సాంబమూర్తీ! యిట్టి దోషం పోవుటకు పరిహార మేదైన నున్నదా లేదా, ఉన్నయెడల అటువంటి దోష మేవిధముగా నివర్తించునో చెప్పవలయును

ఈశ్వరఉవాచ ॥ శ్లో ॥ స్నాతకో బ్రహ్మచారీచ నిధనంప్రాప్నుయాద్యది । సయోజ్యశ్చార్కవిధినా సంయోజ్యౌపరస్పరమ్ ॥

తా ॥ ఇట్లు సనత్కుమార మునీశ్వరుడడుగగా సాంబమూర్తి చెప్పుచున్నాడు ఓ మునీశ్వరా ! దీనికి ప్రతిక్రియను చెప్పెదను వినుము స్నాతకమైనవాడును బ్రహ్మచారియు మృతినొందిన యెడల అర్కవివాహ విధిగా వివాహము చేసి పరస్పరము కూర్చవలెను

శ్లో॥ దేశకాలౌసంకీర్త్య ముకగోత్రాదినామతః। వ్రతంనా సర్గికంకుర్యా మృతస్యబ్రహ్మచారిణః॥

తా ॥ దేశకాలములను స్మరించి మృతినొందిన బ్రహ్మచారి యొక్క గోత్ర నామములను జెప్పి స్వభావసిద్ధమగు గోదానాది వ్రతవిధులనన్నియు యథాప్రకారముగా జరుపవలెను.

శ్లో॥ హేమ్నాభ్యుదయికంకృత్వా ప్రతిష్ఠాప్యచపావకమ్ । ఆఘారాంతంచసంపాద్య చతుర్వ్యాహృభిర్హునేత్ ॥

తా ॥ బంగారముతో నభ్యుదయ కర్మను చేసి యగ్ని హోత్రమును ప్రతిష్ఠించి ఆఘారాదిహోమమును గావించి పిమ్మట ఘారాదిచతుర్వ్యాహృతుల హోమమును చేయవలయును.

శ్లో॥ వ్రతపత్న్యగ్నయేచైవ వ్రతానుష్ఠానసత్ఫలమ్ । సంపాద నాయవిశ్వేభ్యో దేవేభ్యశ్చహుతేద్ఘృతమ్ ॥

తా ॥ బ్రహ్మ చర్యాశ్రమము యొక్క ఫలసిద్ధి కొరకు వ్రతాధి పతియగు నగ్ని హోత్రునకు విశ్వేదేవతులకు రెండు వట్లుగా నాజ్యముతో హోమమును చేయవలయును.

శ్లో॥ తతస్స్విష్టకృతేహుత్వా హోమ శేషం సమాపయేత్ । దేశకాలౌపునస్స్మృత్వా కరిష్యేశవివాహకమ్॥

తా ॥ అనంతరము స్విష్టకృతుకొని పిమ్మట మిగిలిన హోమముల నన్నియు పూర్తి చేయవలెను అనంతరము దేశకాలములను స్మరించి అర్క వివాహము చేసెద నని సంకల్పముచేయవలెను,

శ్లో॥ హేమ్నాభ్యుదయకంకృత్వా అర్కశాఖాంశవంతథా । లిప్త్వాతైలహరిద్రాభ్యాం పీతసూత్రేణ వేష్టయేత్ ॥

తా ॥ బంగారముతో నభ్యుదయకర్మను చేసి పిమ్మట జిల్లేడు కొమ్మను శవ మును నూనెతోటి పసుపుతోటి పూసి పచ్చని దారముతో జుట్టవలెను.

శ్లో॥ పీతవస్త్రియుగేనాపి అగ్నింసంస్థాపయేత్తతః। అఘారాం తేఽగ్నయేచైవ వివాహవిధియోజకమ్॥బృహస్పతయేకామాయ చతు ర్వ్యాహృతిభిస్తథా।ఆజ్యంస్విష్టకృత్ హుత్వాకర్మచైవంసమాపయేత్ ॥

తా ॥ రెండు పచ్చని వస్త్రములను కూడా చుట్ట వలయును అనంతరమగ్ని హోత్రమును ప్రతిష్ఠించి వివాహవిధ్యుక్తముగా నాఘారాదిహోమములనుచేసి అగ్ని హోత్రుడు బృహస్పతి కాముడు మొదలగు దేవతులకు ఘారాది చతుర్వ్యాహుతుల చేతను ఆజ్యముతో హోమముజేసి స్విష్టకృత్తును చేసి హోమాదికర్మలన్నియుసమా ప్తిని పొందించవలెను

శ్లో॥ అర్కశాఖాంశవంచైవ దాహయేచ్చయథావిధి।మృతస్య మ్రియమాణస్య షడబ్దంవ్రతమాచరేత్ ॥

తా॥ జిల్లేడు కొమ్మను శవమునుపిమ్మట దహింపవలెను ఈ విధానముమృతి నొందిన వానికిని అప్పుడు మృతినొందబోవువానికిని చేయవలయును, మృతి నొందిన పిమ్మటనే దహింప వలయును యిట్లు ఆరు సంవత్సరములు దీనికి సంబంధములగు క్రియలనన్నియు యథావిధిగా జరుపవలయును.

శ్లో॥ త్రింశద్భ్యోబ్రహ్మచారిభ్యో దద్యాత్కౌపీనకాన్ నవాన్। హస్తముద్రికణాముద్రాన్ దద్యాత్కృష్ణాజినానిచ॥ పాదుకాఛత్ర మాల్యాని గోపీచందన మేవచ। మణిప్రవాహమాల్యంచ భూషణాని సమర్పయేత్॥

తా॥ అనంతరము నూతనములగు కౌపీనములను, హస్తాభరణములు, కర్ణాభరణములు, కృష్ణాజినములు, పాదుకలు, గొడుగులు, మాలికలు, గోపీచందనము, మణిసమూహములు, మఱియు నితరాభరణములును, ముప్పదిమంది బ్రహ్మచారులకు నివ్వవలయును.

శ్లో॥ ఏవంకృతేవిధానేన విఘ్నంకోపినజాయతే। ఏవంశ్రుత్వా బ్రాహ్మణేభ్యో రాజాహృదివ్యచారయత్ ॥

తా॥ ఈ ప్రకారముగా జేసిన యెడల నేవిధమగు విఘ్నము కలుగదు, ఓ మునీశ్వరా! ఈ విధానము నంతయు నారాజు బ్రాహ్మణులు చెప్పగావిని యీ విధముగా మనస్సున విచారపడెను.

శ్లో॥ భాతిమేకఃవివాహోయ మనుకల్పనముఖ్యకః। నదదాతిప్రమీతస్య కన్యాంకశ్చి ద్వధూంయతః॥ అహంరాజాస్మిప్రదదే రత్నానిచధనంబహు।దదామితస్మైయఃకశ్చిద్దాస్యతేస్వవధూంయది॥

తా॥ అర్క వివాహము రెండవ పక్షముగాని ముఖ్యమైనదికాదు, అయినను జేయవలయు ననుకుంటినేని మృతినొందిన వానికి కన్య నెవ్వడును ఇవ్వడు గదా, అయి నప్పటికి నేను రాజును కాబట్టి యెవడయినను ధనము నందు నపేక్ష కలిగిన యెడల కన్య నిచ్చినవానికి కోరినంత ధనమునుగాని రత్నములనుగాని యిచ్చెదనని రాజు దేశము నందంతటను ప్రకటన చేసెను.

శ్లో॥ విప్రఃకశ్చిత్పురేతస్మి న్నాసీద్దేశాంతరంగతః। తస్యపూర్వమృతాయాస్తు భార్యాయాఃకన్యకాశుభా॥ ఆసీద్ద్వితీయభార్యాతు దుష్టచిత్తావిచారయత్। సపత్నీద్వేషతశ్చాపి బహుద్రవ్యస్యలోభతః॥ దశవర్షాంతు తాంబాలాం దీనాంమాతృవశంగతాం। సాపత్న్యహితాసాలక్షం గృహీత్వాప్రదదానుతాం॥

తా॥ ఇట్లుండగా నా పట్టణములో నొక బ్రాహ్మణునకు నొక కుమార్తె కలిగిన పిమ్మట భార్య చనిపోయినది ఆబ్రాహ్మణుడును రెండవ వివాహముచేసికొని

కొంతకాలమునకు దేశాంతరమునకు లేచిపోయెను, యింటివద్ద రెండవ భార్యయూ సవతి కూతురు నుండిరి, ఆ రెండవ భార్య దుష్ట స్వభావము కలది యగుటచే రాజుగారి ప్రకటనను విని సవతి కూతురు నందు ద్వేషము చేతను ధనమునందాశ చేతను పదిసంవత్సరములు వయస్సుగలదియు, బాలికయు, దిక్కులేనిదియు, తన స్వాధీనంలో నేయున్నదియు, తన సవతి కూతురును లక్ష రూప్యములను పుచ్చుకొని మృతినొందిన వానికి వివాహం జేయుటకు గాను రాజాగారికిచ్చెను.

శ్లో॥ కన్యాంగృహీత్వాజగ్ముస్తే శ్మశానంసరితస్తటే । వివాహంచక్రతుశ్చైవ శవేనసహకన్యకామ్॥

తా! అప్పుడారాజు ఆబ్రాహ్మణ కన్యకను తీసికొని వెళ్లి నదీతీరమువద్దనుండు శ్మశానప్రదేశమునకు శవముతోగూడ తీసికొనివెళ్లి యచ్చటనాకన్యకకును శవమునకును వివాహము చేసిరి

శ్లో॥ భోజయిత్వా విధానేన దగ్ధుంసముపచక్రితుః । తతస్సాకన్యకాపృచ్ఛ త్కిమిదంక్రియతేజనాః॥

తా ॥ యిట్లు విధి ప్రకారముగా వివాహముచేసి యాచిన్నదానిని భుజింపచేసి పిమ్మట నాశవమును దహించుటకు ప్రయత్నముచేయుచుండగా నోజనులారా మీరు చేయబోవునది యిదియేమిటి యని యాచిన్నది యచ్చట నుండు మనుష్యులను అడిగినది,

శ్లో ॥ తతస్తేదుఃఖితాఃప్రోచు దహ్యాతేయంపతిస్తవ । తతః ప్రోవాచసాభీతా రుదతీబాలభావతః॥

తా ॥ అనంతర మక్కడ నుండు వారందరాచిన్నదాని యవస్థకు దుఃఖాక్రాంతులై యో చిన్నదానా నీపెనిమిటిని దహింపబోవుచున్నారు అనిచెప్పగా నాచిన్నది భయపడి పిల్ల యగుటచే యేడ్చుచు యిట్లుపలుకుచున్నది

శ్లో ॥ పతిఃకిందహ్యతేమేసా దగ్ధునైవదదామ్యహమ్ । గచ్ఛధ్వంసహితాస్సర్వే తిష్ఠామ్యత్రాహమేకికా॥

తా ॥ నాపెనిమిటి నెందు నిమిత్తము దహింప వలెను అలా నేను దహింపనివ్వను మీరందరుకలసి వెళ్ల వలయును యిచ్చటనే నొక్కదాననుందును,

శ్లో॥ పత్యాసహాగమిష్యామి ఉత్తిష్ఠతియదాహ్యసౌ । దృష్ట్వాతస్యాస్తునిర్బంధం కరుణాదీనచేతసః ॥ ప్రారబ్ధవాదినోవృద్ధాః కేచిత్తత్రైవమూచిరే॥

తా॥ నా పెనిమిటి యెప్పుడు లేచునో అప్పుడు నా పెనిమిటితోకూడా లేచి వెళ్లెదను అని యీప్రకారము నిర్బంధముగా మాట్లాడు చుండెడి యీ చిన్నదాని పట్టుదలను చూచిన కొందరు వృద్ధులు ఆమెయొక్క ప్రారబ్ధమును గురించి యిట్లు చెప్పుకొనిరి.

శ్లో॥ అహోకింవాభావికర్మ జ్ఞాయతేనైవకస్యచిత్ । దీనపాలః కృపాళుశ్చ భగవాన్కింకరిష్యతి । నిరాశ్రితాచకన్యేయం మాతృపితృ స్వభావతః ॥ విక్రీతాస్యాదతో దేవః కదాచిత్పాలతో భవేత్ । అతోస్మాభిరశక్యోయం దగ్ధుంచాయంతథాశవః ॥ అతోస్మాభిశ్చగంతవ్యం సర్వేషాంరోచయేయది । ఇంమత్వైవంతుసర్వేపి గతాస్తేనగరంప్రతి ॥

తా॥ యెంత యాశ్చర్యముగానున్నది ఈ చిన్నదానియొక్క కర్మముముందు యేవిధముగా జరుగబోవునో యెవరికిని తెలియదుగదా దీనులను పాలించువాడును దయగలవాడునగు భగవంతుడేమి చేయునోగదా, యీ చిన్నదానికి నాధారులెవరును లేరు, తలితల్లి ద్వేషముకలదియగుచు నీరాజునకమ్మిను అందువలన నెప్పుడైన నీచిన్నదానికి భగవంతుడే రక్షకుడగును మన మీ శవమును దహించుటకు సాధ్యం కాకయున్నది కాబట్టి మన మందరికి నిష్టమైన యెడల యింటికి వెళ్లదమేయుక్తము, అని యీ ప్రకారము వారందరు నాలోచించి ఆ శవమును కన్యకను ఆ శ్మశానములో విడిచి యింటికిజనిరి.

శ్లో॥ సైకాశివంపార్వతీంచ స్మరతీభయవిహ్వలా । అజానంతీ బాలభావా త్కిమేతదితివిహ్వలా॥

తా॥ ఆ చిన్నదియు నొంటరిగానుండుటవలనను చిన్నతనముగుట వలనను ఈ జరిగిన దంతయు సాకల్యముగా తెలియని దై భయభ్రాంతు రాలయి యేమియు తోచక పార్వతీపరమేశ్వరులను భక్తిపూర్వకముగా మనస్సునధ్యానించుచుండెను.

శ్లో॥ తస్యాస్సంస్మరణాద్దైన్యా త్సర్వజ్ఞాపార్వతీశివా । కరుణాపూర్ణహృదయా తత్రాజగ్మతురంజసా॥

తా॥ దీనురాలగు ఆ చిన్నది స్మరణచేయుట వలన సమస్తమును తెలిసిన వారలగు ఆపార్వతీ పరమేశ్వరు లాదయముతో గూడిన మనస్సుగల వారయి శీఘ్రముగా నచ్చటకువచ్చిరి.

శ్లో॥ వృషారూఢౌతుతౌదృష్ట్వా దంపతీతేజసాంనిధీ । ననామ దండవద్భూమౌ నజానంత్యౌపిదైవతే॥

తా॥ యిట్లు వృషభవాహనము నెక్కి మిక్కిలికాంతితో ప్రకాశించెడియా పార్వతీ పరమేశ్వరులను చూచి వీరు దేవతులని నిజము తెలియకపోయినను వారికి సాష్టాంగదండ ప్రణామము చేసెను,

శ్లో॥ ఆశ్వాసనంపరంలేభే ఆగతాసంగతిస్త్వితి। ఉవాచచపతిః కింమే జాగృతోనైవజాయతే॥

తా॥ పూర్వ మెవరును లేకుండుటచే భయపడుచుండెడి యాచిన్నది యిప్పు డెవరో సహవాసముగా నుండుట తటస్థించిన దని ధైర్యం కలదియగుచు నాపెని మిటి మెళుకువ గలవాడయి లేచుటలేదు యేమికారణమని యాచిన్నది పార్వతీపర మేశ్వరుల నడిగెను.

శ్లో॥ ప్రసన్నౌబాలభావేన దయయాచపరిప్లుతౌ । ఊచతుస్తే జనన్యాస్తు వ్రతంసూపోదనాభిదమ్॥వ్రతంసంకల్ప్యసతిలం గృహీత్వా స్వప్రయచ్ఛమే । బ్రూహియన్మజ్జనన్యాస్తి వ్రతంసూపోద నాభిదమ్॥ కృతంతస్యప్రభావేన ఉత్తిష్ఠతుపతిర్మమ। తయాకృతంతథాసర్వం శివ దత్తస్తదోత్థితః॥

తా॥ ఆ చిన్నది యేమియు తెలియని బాలదశయందు నుండుటచే దయగల వారలై పార్వతీ పరమేశ్వరులను గ్రహించి ఓ చిన్నదానా పూర్వము నీతల్లి సూపోదనమను వ్రతమునాచరించినది, నీవు సంకల్పముచేసి నువ్వులు ఉదకము చేతిలో నుంచుకొని నా తల్లి చేసిన సూపోదన వ్రతఫలమును నీకు ధారపోయుచున్నాను కాబట్టి స్మృతిగలవాడవై లేచుగాకయని యుదకమును వదలిపెట్టుమా యని వారు చెప్పగానాచిన్నదియు నావిధముగానే చేసెను వెంటనే పెనిమిటియగు శివదత్తుడు లేచి కూర్చుండెను.

శ్లో॥ ఉపదిశ్యవ్రతంతస్యా స్తత్రాంతర్దధతుశ్శివౌ । శివదత్త స్తుపప్రచ్ఛ కాత్వంక్వేహాగతోస్మ్యహమ్॥

తా॥ అనంతరము పార్వతీ పరమేశ్వరులా వ్రత విధానమంతయు నాచిన్న దానికి చెప్పి యదృశ్యులైరి పిమ్మట శివదత్తుడా చిన్నదానిని చూచి నీ వెవరవు నే నిచటకు రావడమునకు కారణమేమని యాచిన్నదానినడిగెను.

శ్లో॥ సాచాహ కించిద్వృత్తాంతం రాత్రిశ్చాపి గతాభవత్ । ప్రాతర్నదీతీరంగతా జనారాజ్ఞేన్యవేదయత్ ॥ రాజన్పుత్రిస్నుషా చైవ నదీతీరేవతిష్ఠతః । ప్రామాణికేభ్యశ్రుత్వా సా హర్షాంలోకో త్తరంయయౌ॥

తా॥ ఆ చిన్నదియు జరిగిన వృత్తాంతము నంతయు జెప్పెను అనంతరము తెల్ల వారగానే యుదయమున నదిలో స్నానముచేయుటకు వచ్చిన మనుష్యులందరు నచ్చట బ్రతికియున్న రాజపుత్రుని చూచి యిండ్లకువెళ్లి ఓ రాజా నీ కుమారుడు బ్రతికినవాడయి కోడలుతో కూడ నదీతీరమందు సంచరించు చున్నారు అని ప్రజలు చెప్పగా విని కొంతకాలకు సందేహము గలవాడై యుండగామరి కొందరు తనకు విశ్వాసము కలవారు చెప్పగా నమ్మకము కలవాడగు నమిత మగు సంతోషమును పొందెను,

శ్లో॥ హర్షభేరీంవాదయన్స నదీతీరంసమాయయౌ । జనాశ్చ ముదితాస్సర్వే ప్రశశంసుజనాధిపమ్॥ రాజన్గతఃకాలగృహం పుత్ర స్తే పునరాగతః। ప్రశశంసస్నుషాంరాజా కిమహంశస్య తేజస్సైః ॥ దురదృష్టోధమశ్చాహం ధన్యేయంసుభగాస్నుషా।ఏతత్పుణ్యప్రభావేణపుత్రో యంజీవితోమమ ॥ ఏవంస్నుషాంసుసంభావ్య రాజాబ్రాహ్మణ సత్త మాన్। పూజయామాసవిభవైః దానమానపురస్సరమ్ ॥

తా ॥ అనంతర మారాజు భేరీమొదలగు వాద్యములను మ్రోయించుచు నదీ తీరమునకు మిక్కిలి సంతోషముతో వెళ్లెను ప్రజలందరును సంతోష చిత్తులగుచు ఓ రాజా! మృతినొందిన నీ కుమారుడు బ్రతుకుటవలన నీవు మిక్కిలియదృష్టవంతు డవు అని రాజును పొగడిరి. అప్పుడు రాజు చెప్పుచున్నాడు నేను యదృష్టవంతు డనని మీరు చెప్పుట సరియైనది కాదు నేను దౌర్భాగ్యుడను హీనుడను, ఈ నా కోడలు మిక్కిలి పుణ్యురాలు, ఈమెయొక్క పుణ్యమహిమచేత నే నా కుమారుడు బ్రతికెను, అని రాజు కోడలను ప్రశంశచేసి బ్రాహ్మణులకు షోడశ మహాదానముల చేసి పూజించెను,

శ్లో ॥ బహిర్నీతపరిమీతస్య పునర్గ్రామప్రవేశనే।విధింబ్రాహ్మణసందిష్టం శాంతికం విధినాచరత్ ॥

తా ॥ మృతినొందుటచే శవమునకు చేయు నుత్క్రాంతక్రియలన్నియు జేసి శ్మశానమునకు తీసికొని పోగా తిరిగి బ్రతుకుట వలన నింటికి వచ్చువానికి చేయు

దగినశాంతి హోమాదిక్రియ లన్నియు బ్రాహ్మణులు చెప్పగావిని యారాజుయథా విధిగా క్రియలనన్నియు చేసెను,

శ్లో॥ ఏతత్తేకథితంవత్స వ్రతంసూపోదనాభిదమ్। పంచవర్షాణి కృత్వైత త్పశ్చాదుద్యాపనం చరేత్॥

తా॥ ఓ మునీశ్వరా! ఇట్టి ఫలము కలది కాఁబట్టి యీసూపోదనమనువ్రతమును నీకు జెప్పితిని ఈ వ్రతము నైదు సంవత్సరములు చేసిన పిమ్మట నుద్యాపనము చేయవలయును

శ్లో॥ ప్రతిమాంపార్వతీశస్య చార్చయేత్ప్రతివాసరే। ప్రాత ర్హోమంప్రకుర్వీత చరుణాముద్గకైస్తథా॥ నైవేద్యంవాయనం చైవ వ్రతోక్తవిధినాచరేత్। పుత్రంచిరాయుషంలబ్ధ్వా చాంతేశివ పురంవ్రజేత్॥

తా॥ ఉద్యాపన విధాన మెట్టిదనగా సువర్ణముతో పార్వతీ పరమేశ్వరుల ప్రతిమను చేయించి దానిని నిత్యము పూజించుచు అన్నముతోను మాఁపిండా కులతోను ప్రాతః కాలంబున హోమము చేయుచు వ్రత విధానములో జెప్పఁబడిన రీతిగా దేవతకు నైవేద్యమును బ్రాహ్మణునకు దానమునిచ్చుచు యథావిధిగా వ్రతమును నాచరించిన యెడల చిరకాలము జీవించునట్టి పుత్రుని బడసి యంత్యకాలంనకు కైలాసంచేరును అని సనత్కుమారునితో సాంబమూర్తి చెప్పెను,

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే

శ్రావణమాస మాహాత్మ్యే సూపోదన షష్ఠీ

వ్రత కథనంనామ పంచదశో

ధ్యాయః సమాప్తః.



## షోడశోధ్యాయ ప్రారంభః.

ఈశ్వర ఉవాచ ॥ శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి శీతలాసప్తమీ వ్రతమ్। శ్రావణే శుక్లపక్షేతు సప్తమ్యామాచరేద్వ్రతం॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ మునీశ్వరా! ఇక ముందు శ్రావణ శుద్ధసప్తమీదినంబున చేయతగిన శీతలాసప్తమి యను వ్రతమును గుఱించిచెప్పెదను సావధానముగా వినుము

శ్లో॥ కుడ్యేలిఖిత్వావాపీంతు తథాసలిలదేవతాః। సప్తసంఖ్యా దివ్యరూపా అశరీరిణసంజ్ఞికాః॥ బాలద్వయయుతానారీ పురుషత్రయసంయుతా। అశ్వశ్చవృషభశ్చైవ శిబికానరవాహనా॥ పూజావార్దేవతానాంస్యాత్షోడశైరుపచారకైః। దధ్యోదనస్యనైవేద్యం సాధనే కర్కటీఫలమ్॥

తా॥ గోడయందు దిగుడుబావి యాకారమును దానిలో దివ్యరూపులును అశరీరులను పేరుగల జలాధి దేవతల నేడుగురును లిఖించ వలయును మఱియు నిద్దరు బాలుర ముగ్గురు పురుషులతో గూడి యున్నట్లు యొక స్త్రీ ప్రతిమను లిఖించవలయును ఒక గుఱ్ఱమును ఒక యెద్దును మనుష్యులచే వహింపబడు నొక సవారీని లిఖియించి పిమ్మట జలాధి దేవతలను షోడశోపచారములచే పూజించి దోసపండు వ్యంజనముగాచేసి పెరుగుతో కలిపిన యన్నమును నివేదన చేయవలయును,

శ్లో॥ ద్విజాయవాయనందద్యాన్నైవేద్యస్యపదార్థకైః। సప్తవర్షాణికృత్వైవం సువాసిన్యశ్చసప్తవై॥ ప్రత్యబ్దంభోజనీయాస్స్యుః పశ్చాదుద్యాపనంచరేత్। వార్దేవతానాంప్రతిమా ఏకస్మిన్స్వర్ణపాత్రకే॥ బాలేనసహితాఃపూజ్యా స్సాయంపూర్వేహ్నిభక్తితః। ప్రాతర్హోమంచచరుణా గ్రహహోమపురస్సరమ్॥ వ్రతమేతత్పురాచీర్ణం ఫలితంచతథాశృణు। సౌరాష్ట్రదేశేనగర మాసీచ్ఛోభనసజ్జితమ్॥

తా॥ ఏ పదార్థములను నివేదన చేయుచున్నారో ఆ పదార్థములనే బ్రాహ్మణునకు వాయన మివ్వవలయును ఈ ప్రకారమేడు సంవత్సరములు వ్రతమును చేయుచు ప్రతిసంవత్సరమునందు నేడుగురు సువాసినీ స్త్రీలకు భోజనము పెట్టవలయును అనంతరము నుద్యాపనము చేయవలయును బాలురతో గూడి యున్న

ట్లుగా నిర్మింపబడిన జలాధిదేవత ప్రతిమలను ఒక బంగారపు పాత్రయందుంచి ఉద యమున సాయంకాలంబున భక్తితో పూజింపవలయును నవగ్రహములకు ముందు గాను తర్వాత ప్రధాన దేవతులకును అన్నము మొదలగు వానితో ప్రాతః కాలం బున హోమము చేయవలయును యీ ప్రకారముగా వ్రత మాచరించి ఫలితమును పొందిన వారిని చెప్పెదను వినుము పూర్వకాలంబున సౌరాష్ట్రదేశమునందు శోభన మను నొక పట్టణముకలదు,

శ్లో॥ తత్రాసీద్ధనికఃకశ్చి త్సర్వధర్మపరాయణః। సవాపీఃఖన యామాస నిర్జలే నిర్జనే వనే॥

తా॥ ఆ పట్టణమందు సమస్త ధర్మములయందు నాస్తికులయొక్క ధనవం తుండుకలండు ఆయన జలము నెచ్చటనులేనట్టియు జనసంచారము లేని యడవియందు సమస్త జీవరాసులకు నుపయోగ మగునట్లుగా నెప్పుడును జలముతో నిండి యుండ వలయునను భావముతో దిగుడు బావులు మొదలగువానిని త్రవ్వించెను

శ్లో॥ పాదమార్గాంశుభాంరమ్యాం బహుద్రవ్యవ్యయేనసః। పశూనాంజలపానాయ అపియోగ్యం దృఢాశ్మభిః॥ బద్ధాంచిర స్థాయి నీంచ బహిఃప్రాంతేద్రుమైర్యుతం। ఆరామంకారయామాస శ్రాంత పాంథసుఖాయచ॥

తా॥ విశేషముగా ధనమును ఖర్చుపెట్టి గట్టిరాళ్లతో నడచుటకు సుఖముగా నుండునట్లు కాలిత్రోవలను పశువులు నీరు త్రాగుటకు తొట్లను మార్గస్థుల అలసా యాసమును పోగొట్టునట్టియు బహుకాలము నుండ దగిన తోటలను అచ్చటచ్చట మార్గసమీపములో నేర్పఱచెను,

శ్లో॥ పరంశుష్కంజలంతత్ర నలబ్ధంబిందుమాత్రకమ్।ప్రయా సోమేవృథాజాతో ద్రవ్యంచవ్యయితంవృథా॥ ఇతిచింతా పరశ్చాసీ ద్ధనికోధనదాభిధః। రాత్రౌతత్రైవసుష్వాప స్వప్నేతం జలదేవతాః॥ ఆగత్యకథయామాసు శ్శృణూపాయంజలాగమే। దాస్యసేయదితేపా త్రం బలిమస్మాకమాదృతః॥ తద్దైవవాపికేయంతే జలపూర్ణాభవి ష్యతి। దృష్ట్వైవంగృహమాగత్య పుత్రాయకథమిచ్ఛతి॥

తా॥ ఈ ప్రకారము ధర్మ కార్యములను చేసినప్పటికి నెచ్చట నొక్కబిం దువైనను జలము సంభవింపలేదు, అప్పుడు వ్యాకులము కలవాడై నా ఆయాసము

వ్యర్థమైనది, నా సొమ్మంతయు వ్యర్థముగా ఖర్చుఅయినది గదా యని ధనదుడను పేరుగల ఆధనవంతుడు విచారపడి యారాత్రి నచ్చటనే నిద్రించగా జలదేవతలు ఆయన స్వప్నములో కనబడి ఓ ధనవంతుడా! నీవు త్రవ్వించిన బావులలో నీరు పుట్టుటకు నుపాయమును చెప్పెదను వినుము నీవు మాయందు భక్తికలవాడవై నీ కుమారుని మాకు బలిగానిచ్చితివేని నీవు త్రవ్వించిన బావి యెప్పుడును జలంతో నిండియుండునని చెప్పి యదృశ్యులైరి, అధనికుడును యిటువంటి స్వప్నమును జూచి యింటికివచ్చి అంతయు కుమారునితో చెప్పెను,

శ్లో॥ ద్రవిణోనామతత్పుత్ర స్సోపిధర్మపరాయణః । శ్రుణుష్వ మమవత్సస్య భవాన్మజ్జనకోయతః ॥ తత్రాప్యేతద్ధర్మకార్యం కింవిచార్యమిహత్వయా స్థావరశ్చాస్థిరోయం నశ్వరంచసుతాదికమ్॥ అల్పమూల్యం మహావస్తు లాభోయందుర్లభంక్రియః । శీతాంశుశ్చైవచండాంశుర్వర్తేతేతనయౌమమ ॥ శీతాంశుర్నామజ్యేష్ఠోయం బలిదేయో విచారతః। మంత్రోయంసర్వథాస్త్రీభి ర్జ్ఞాతవ్యోనైవభోఃపితః॥

తా ॥ ఆయనయొక్క కుమారుడును ద్రవిణుడను పేరుగల వాడును ధర్మం వందాసక్తి గలవాడుగానుండెను యిట్లు తండ్రిచెప్పిన వృత్తాంతమును విన్నవాడై కుమారుడు చెప్పుచున్నాడు ఓ తండ్రీ! నేను నీకు కుమారుడ నగుటచేత నీమాటను తప్పక వినవలయును, మఱియు నీవు చేయుచున్నటువంటిది ధర్మకార్యము నీవు విచారింప పనిలేదు, ధర్మము శాశ్వతముగానుండును పుత్రులు మొదలగువారు నశించెడువారు కాబట్టి నశించునట్టి స్వల్పవస్తువునిచ్చి శాశ్వతముగా నుండునటువంటిధర్మమును సంపాదించుట మిక్కిలి దుర్లభమైనదిగదా గాన నాకు చంద్రుడు సూర్యుడు అనుపేరుగల యిద్దరు కుమాళ్లు కలరు వారిలో పెద్ద వాడగు చంద్రుని నీవు సందేహింపక బలిగా నివ్వ వలయును యిట్లు మనము చేసెడి యాలోచనను సమస్తవిధముల స్త్రీలకు తెలయనివ్వకూడదు,

శ్లో॥ ఉపాయస్తత్రమత్పత్నీ గర్భిణీవర్తతేధునా। ఆసన్నప్రసవాచైవ యాస్యతిస్వపితుర్గృహే॥ ప్రసూత్యర్థంకనిష్ఠోసౌ తయాసహ గమిష్యతి । తదాకార్యమిదంతాత నిర్విఘ్నంభవిష్యతి ॥

తా ॥ తల్లికి తెలియకుండునట్లుగా నుపాయమును జెప్పెదను వినుము నా భార్య యిప్పుడు గర్భవతియై ప్రసవించుటకు సిద్ధముగా నున్నది. కాబట్టి ప్రవించుటకు తండ్రిగారియింటికి వెళ్లును అప్పుడు చిన్నకుమారుడగు సూర్యుడు తల్లితో

కూడా వెళ్లను. అప్పుడు మనము ఆలోచించిన కార్యమునకు నెటువంటి విఘ్నము కలుగదు అని కుమారుడు తండ్రితో జెప్పెను,

శ్లో॥ ఇతిశ్రుత్వాపుత్రవాక్యం పితాతంసతుతోషహ । ధన్యోసిపుత్రధన్యోహం త్వయాపుత్రేణ పుత్రవాన్ ॥

తా ॥ యిట్లు కుమారుడు చెప్పిన మాటలను తండ్రివిని మిక్కిలిసంతోషించి యోపుత్రకా నీవు చాలాధన్యుడవు నేనును మిక్కిలి ధన్యుడను నీవంటి యోగ్యమైన సంతానము కలుగుట చేత నే నేను పుత్రులు కలవాడనైతి నని తండ్రి కుమారుని మెచ్చుకొనెను,

శ్లో॥ ఏతన్నంతరేతస్యా స్సుశీలాయాఃపితుర్గృహాత్ । ఆకారణం సమగమ త్తదాసాచజగామహ॥ జ్యేష్ఠోస్మాకంసమీపేస్తు కనిష్ఠోనీయ తాంత్వయా। సాతిదైవసతీచక్రే భర్తృశ్వశురవాక్యతః ॥

తా॥ యింతలో ఆయన భార్యయగు సుశీలను ప్రసవమునకు తీసికొని వెళ్లుటకు తండ్రిగారి యింటివద్దనుండి వర్తమానమురాగా అప్పుడు ఆమెతోనిట్లుచెప్పిరి పెద్దకుమారుడు మావద్దనే యుండును చిన్నకుమారుని మాత్రము తీసుకొనివెళ్లవలయునని పేనిమిటియుమామగారును చెప్పగా పతివ్రతయగు నాచిన్నది వీరి యాలోచనను తెలియనది కాఁబట్టి యా ప్రకారమే పెద్దకుమారుని విడిచి చిన్నకుమారుని తీసుకొని వెళ్లెను,

శ్లో॥ తదాతౌపుత్రపితరౌ తైలేనాభ్యశ్చబాలకమ్ । స్నాపయిత్వాసువస్త్రైశ్చభూషణైస్సమలంకృతం ॥ పూర్వోపాఘావారుణక్షేత్రాపయూమాస తుర్ష్మదా । వాప్యావా దేవతా స్తుష్టా భవంత్వితిస మూచతుః ॥

తా॥ అనంతరము తండ్రియు కుమారుడును శీతాంశుడను పిల్లవానికి నూనెతోటితలంటిస్నానముచేయించి మంచి వస్త్రములచేతను ఆభరణములచేతను నలంకరించి యా నూతివద్దకు తీసుకొని వెళ్లి జలాది దేవతలు సంతోషింతురు గాకయని యానూతిలో పాతిపెట్టిరి.

శ్లో॥ తద్దైవవాపీపూర్ణాభూ త్సుధాతుల్యేనవారిణా ! ఉభౌగృహంజగ్మతుస్తౌ హాషశోకసమన్వితౌ।

తా॥ అప్పుడు వెంటనే ఆ నూతిలో నమృతముతో సమానమగు జలము పుట్టి నిండి యుండెను పిమ్మట నా తండ్రి కుమారు లిద్దరు యింటికి వెళ్లి పిల్లవానిని బలి యిచ్చుటచే విచారమును, నూతిలో జలము పుట్టుటచే సంతోషమును కలవారైరి.

శ్లో॥ సాసుశీలాపితుర్గేహే సూతిపుత్రంతృతీయకం । మాస త్రిమోత్తరంగేహం నిజంగంతుంచనిర్గతా ॥ వాపీసమీపంప్రాప్తాసా వాపీంపూర్ణాంజదదర్శహా। విస్మయం పరమంప్రాప్త తత్రస్నానంచ కారహా ॥

తా॥ అనంతర మాపిల్లవానితల్లి యగు సుశీల తండ్రి గారి గృహమునందు ప్రసవించినది మూడవ కుమారుడు కలిగెను, పిమ్మట తన యింటికి మూడవ మాసము నందు ప్రయాణమై వచ్చుచుండగా దారిలో తన మామగారు త్రవ్వించిన బావిలో జలము పుట్టి సంపూర్ణముగా నిండియుండుట చూచి మిక్కిలి యాశ్చర్యమును పొంది యాబావిలో స్నానముచేసెను.

శ్లో॥ శ్వశురస్య ప్రయాసోమే సాఫల్యశ్చధనవ్యయః । తద్దినే సప్తమీచాసీ చ్ఛ్రావణేశుక్ల పక్షకే॥ సుశీలాయా వ్రతంచాసీ చ్ఛీతలా సజ్ఞితమ్ శుభమ్ । సాతత్రిపాకమకరో దోదనంచానయుద్దధి ॥ వార్దేవ తాశ్చసంపూజ్య దధన్నంకర్కటీ ఫలమ్ । నైవేద్యం కల్పయామాస దత్వావిప్రాయవాయనం॥

తా॥ యీ నూతి విషయమై నా మామగారియొక్క యాయాసము ధనవ్యయము సఫలమైనదని యాచిన్నది సంతోషించినది ఆ దినము శ్రావణశుద్ధ సప్తమి యగుటచే నాదినంబున శ్రేయస్కరమగు శీతలా వ్రతమును చేయదలచి వంటచేసి కొని అన్నమును పెరుగును తీసికొనివచ్చి జల దేవతులను పూజించి పెరుగు కలిపిన యన్నమును దోసపండును నివేదనముచేసి ఆ పదార్థమునే బ్రాహ్మణునకు వాయనము యిచ్చెను,

శ్లో॥ స్వయంత దేవబుభుజే సహితాస్సహవాసభిః। తతో ఽయా జనమాత్రింతు తస్యాగ్రామోబభూవహ॥

తా॥ ఆ పదార్థములనే తాను తనతోకూడ నుండువారును భుజియించి యింటికి ప్రయాణమై వచ్చుచుండగా నచ్చటికి యా చిన్నదానియొక్క గ్రామము ఒక యామడదూర ముండెను.

శ్లో॥ తతస్సానిగతా తాశ్చాసీ దారుహ్యాశిభిరాశుభామ్ । బాలక ద్వయసంయుక్తా తదా తాజలదేవతాః॥ ఊచుఃపరస్పరంచాస్యాఃపుత్రో దేయోఽయతోఽనయా । అస్మాకం వ్రతమాచీర్ణం ప్రజ్ఞాచవిహితా పరా॥ ఏతద్వ్రతప్రభావేన నూతనోదీయ తేసుతః । పూర్వజాతోయది గాత్రేహ్యాహ్యస్మత్తోషస్యకింఫలమ్॥ విసర్జయామాసురితీ త్యుక్త్వా నోఽన్యందయాలవః । మాతరం దర్శయామాసు ర్వాప్యానిష్క్రాస్య బాహ్యతః॥

తా॥ అనంతర మాచిన్నది యిద్దరు కుమాళ్లతో కూడుకొని నవారి నెక్కి వెళ్లుచుండగా జలదేవతలీప్రకారము తమలోతాము యిట్లుసంభాషించిరి ఈ చిన్నదియు మనయందు భక్తికలదియగుచు మనసంబంధమగు శీతలాసప్తమీవ్రతము నాచరించినది ఈ పెనిమిటి చేతను మామచేతను స్థాపించబడిన పెద్ద పిల్లవానిని మనము తీసికొని నూతనముగా మరియొక పిల్లవానిని మనము యిచ్చినప్పటికి ఈవ్రతప్రభావము మనము సంతోషించుటయు నెంతమాత్రము కనుపడదు కాబట్టి మొదటగా తండ్రి తాతలచే స్థాపింప బడిన పిల్లవానినే యివ్వవలయునని నిశ్చయించి దయాస్వభావము గల యా జలదేవతలు ఆబావినుండి పిల్లవానిని బయటికి తీసి వెళ్లుచుండెడి తల్లి యగు సుశీలను ఆపిల్లవానికి నగపరచిరి.

శ్లో॥ అథావత్సుష్టతోమాతు ర్మాతరిత్యాహ్వయన్శిశుః। సరంశుత్యపుత్రశబ్దంసా పరావృత్యావలోకయత్ ॥

తా॥ అనంతర మాపిల్లవాడు ముందు వెళ్లుచుండెడి తల్లి వెంట వెనుక పరుగెత్తుకొని వెళ్లుచు ఓ తల్లీయని పిలువగా ఆ ధ్వని తనపెద్దకుమారుని ధ్వనిగాతలచి వెనుకకు తిరిగి చూచెను.

శ్లో॥ దృష్ట్వాపానందనంస్వీయం చకితాసాభవద్ధృది। స్థాప్యాంకేమూర్ధ్న్యవఘ్రాయ కించిత్పప్రచ్ఛనోసుతమ్ ॥

తా॥ యిట్లు వెనుక వచ్చుచుండెడి తనకుమారునా చిన్నదిజూచి మనస్సున భయపడినదై తనతొడయందు గూర్చుండబెట్టుకొని శిరస్సునముద్దాడి యేదోకొంచె ముతనకుమారునితో నిట్లుపలుకుచున్నది.

శ్లో॥ బిభీష్యతీతిబుధ్వాసా హృదయేత్వన్యచింతయత్। తస్య

రైర్యాదివాసిత స్తద్వ్యాఘాలంకారవాన్కథం॥ పిశాచైర్యాదివాసీతో మోక్షితశ్చపునఃకథం। చింతాసముదేత్రిమగ్నాస్య గృహసంబంధినోజనాః॥ ఇత్యేవంచింతయంతీసా నగరద్వారమాపసా । జనాశ్చకథయామాసు స్సుశీలాచసమాగతా॥

తా॥ ఆ పిల్లవాడు భయపడిన వాడుగా నుండుటను తలచి ఓ కుమారా నీవు సర్వాభరణములచే నలంకరింప బడియుంటివి దొంగలెత్తుకొని వెళ్లియుండిరా యేమి? లేక పిశాచములు నిన్ను తీసుకొనిపోయినవాయేమి? వాళ్ల వలన నీవిధముగా విడిపించుకొని వచ్చితివి, మన బంధువులందరు విచారచిత్తులై యుండిరి యేమి కారణం అని పిల్లవాని నడుగుచు వ్యాకులము కలదియై పట్టణ సమీపమునకు రాగా సుశీల వచ్చుచున్నదని యా గ్రామములో కొందరు వెళ్లి యామె పెనిమిటితోను మామతోను చెప్పిరి,

శ్లో॥ శ్రుత్వాతుపితృపుత్రౌతౌ పరాంచింతామవాపతుః। కింవదిష్యతిచాస్మాక మస్మాభిర్వాకిముచ్యతామ్॥

తా॥ ఈ జనులు చెప్పినవార్తను విన్నవారై తండ్రియు కుమారుడును సుశీల వచ్చిన పిమ్మట తన పెద్దకుమారుని సంగతి నడిగిన యెడల నామెతో నేమి చెప్పుదుమాయని చింతాక్రాంతులయిరి,

శ్లో॥ ఏతస్మిన్నంతరేప్రాప్తా పుత్రత్రియసమన్వితా । జ్యేష్ఠం దృష్ట్వాతుతంబాలం శ్వశురశ్చపతిశ్చసః॥ ఆశ్చర్యంపరమంప్రాప పరాముదమవాపచ। త్వయాకింపుణ్యమాచీర్ణం వ్రతంవాపిశుచిస్మితే॥

తా॥ ఇంతలో ఆ సుశీల ముగ్గురు కుమారులతో కూడా వచ్చెను అప్పుడు పెనిమిటియు మామగారును తల్లితో కూడా వచ్చిన పెద్దపిల్లవానినిజూచి యాశ్చర్యమును మిక్కిలి సంతోషమును పొంది యామెతో నిట్లు పలికిరి, ఓ చిన్నదానా! నీవేమి పుణ్యమాచరించితివి శ్రేయస్కరమగు నేవ్రతమాచరించితివి.

శ్లో॥ పతివ్రతాసిధన్యాసి పుణ్యవత్యసిభామినీ । మాసద్వయం తుసంజాత మకస్మాన్నస్త్యభూచ్ఛిశుః ॥ సచత్వయాపునర్లబ్ధో వాపీపూరాణపిచాభవత్। ఏకపుత్రాగతేత స్త్వ మాగతాసిత్రయాన్వితా॥

త్వయోద్ధృతంకులంసుభ్రు కింత్వాంస్తౌమిశుభాననే। శ్వశురేణ స్తుతైవం సా పత్యాప్రేమ్ణాచవీక్షితా॥ శ్వశ్రాచానందితోవాచ పుణ్యామార్గస్య సర్వశః॥

తా॥ ఓ చిన్నదానా! నీవు పతివ్రతవు, ధన్యురాలవు, పుణ్యురాలవు, మన పెద్దపిల్లవాడు అకస్మాత్తుగా రెండుమాసములనుండి యేమికారణము చేతనో మాకు కనుపించుటలేదు అటువంటివాడు యేకారణము చేతనో నీతోకూడ వచ్చుటచేతిరిగి చూడకలిగితిమి మన దిగుడుబావి నీళ్లతో నిండియుండెను నీ బిడ్డడనుండి పుట్టినింటికి వెళ్లునప్పుడు ఒక్క రెండవకుసూరునే తీసుకొని వెళ్లితివి యిప్పుడు ముగ్గురు కుమాళ్లతో గూడ వచ్చితివి, ఓ యోగ్యురాలా నీ వలనమావంశ మంతయు తరించి నది, అని యీప్రకారము కోడలను మామగారు స్తుతియించెను పెనిమిటియు దయా స్వభావము కలవాడయి భార్యను ప్రేమించెను యిట్లు వారు సంతోషించినవారై తనయొక్క సుకృతమును గురించి యడుగగా తానుచేసిన శీతలావ్రతమాహాత్మ్యము నంతయు చెప్పెను.

శ్లో॥ ప్రాపుస్సర్వేపి చానందం భుక్త్వాభోగాన్యథేప్సితాన్ । ఇత్యేతత్కథితంవత్స శీతలాసప్తమీవ్రతం॥

తా॥ యిట్లు సుశీల చెప్పినమాటలనువిని వారందఱు సంతోషమును పొంది ఇహలోకమున సమస్తసుఖముల ననుభవించి జన్మాంతమున మోక్షముపొందిరి, కాం బట్టి యో మునీశ్వరా! యిటువంటి ప్రభావము కలదిగనుక శీతలాసప్తమీవ్రతమును చెప్పితిని,

శ్లో॥ దధ్యోదనంశీతలంచ శీతలంకర్కటీఫలమ్ ॥ వాపీజలంశీతలంతు శీతలాశ్చాపిదేవతాః । తాపత్రయస్యసంతాపా చ్ఛీతలావ్రతినస్తతః॥ అతోహేతోస్సప్తమీయం శీతలేతియథార్థికా॥

తా॥ పెరుగుతో కలిపిన యన్నము చల్లనైనది దోసపండును చల్లని గుణమునిచ్చును బావిజలమును చల్లనైనవి జలాధిదేవతలును చల్లనైనవారు కాబట్టి తాపత్రయములనెడు అగ్నిహోత్రముచే దహింపబడెడు మనుష్యునకు యీ శీతలావ్రతము వలన జలముచే నగ్నిచల్లారిపోవునట్లు తాపత్రియములు నశించిపోవును గాన యీ

శీతలాసప్తమీవ్రతము సాధకమైన పేరుగలది అని సాంబమూర్తి సనత్కుమార మునీశ్వరునితో చెప్పెను.

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణమాస మాహాత్మ్యే శీతలాసప్తమీ
వ్రత కథనంనామ షోడశో
ధ్యాయ స్సమాప్తః.

---

## అథ సప్తదశోఽధ్యాయ ప్రారంభః.

ఈశ్వర ఉవాచ ॥ శ్లో॥ అథవక్ష్యామి దేవేశ పవిత్రారోపణంశుభమ్। సప్తమ్యామధివాస్యాథ అష్టమ్యామర్పయేత్తుతత్ ॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ మునీశ్వరుఁడా! శ్రేయస్కరమగు పవిత్రారోపణవ్రతమును చెప్పుచున్నాను వినుము సప్తమీ దినంబున ప్రారంభించి అష్టమీదినంబున సమాప్తిచేయవలసినదిగా శాస్త్రమునందు జెప్పబడెను

శ్లో॥పవిత్రంకారయేద్యస్తుతస్యపుణ్యఫలంశృణు। సర్వయజ్ఞవ్రతంస్నానంసర్వతీర్థాభిషేచనమ్॥ ప్రాప్నుయాన్నాత్రసందేహో యస్మాత్సర్వగతాశివా। నాధనోనచదుఃఖాని నపీడావ్యాధయోపిచ ॥ నభయంశత్రుజంతస్య నగ్రహైఃపీడ్యతేక్వచిత్ । సిద్ధ్యంతిసర్వకార్యాణి అల్పానిచ మహాంతిచ ॥

తా ॥ పవిత్రారోపణ వ్రతమును జేయువాని యొక్క ఫలమును జెప్పెదను వినుము సమస్తయజ్ఞముల చేసినఫలమును సమస్తతీర్థములయందు స్నానముచేసిన ఫలమును సమస్త దానముల జేసినఫలమును పొందుచున్నాడు ఇందులో నెంతమాత్రము సందేహము లేదు పార్వతీదేవి సమస్తజీవములందును వ్యాపించి యున్నందువలన జేయఁదగినది ఈ వ్రతము జేసినవానికి ధనము లేకపోవుట, దుఃఖములు, పీడ రోగములు, శత్రువుల వలన భయము సంభవింపదు అట్టివానికి నెప్పుడును గ్రహముల పీడయు కలుగదు వానియొక్క కార్యములు కొద్దివయినను గొప్ప వయినను సిద్ధించుచున్నవి.

శ్లో॥ నాతఃపరతరంవత్స అన్యత్పుణ్యవివృద్ధయే । నరాణాంచ నృపాణాంచ స్త్రీణాంచైవవిశేషతః॥ సౌభాగ్యజననంతాత తవస్నేహాత్ప్రకాశితం। శ్రావణేశుక్లసప్తమ్యా మధివాసవిధానతః॥ సర్వోపస్కరసంయుక్తో దేవ్యాంసద్భక్తిమాంశ్చసః। సర్వాణిపూజాద్రవ్యాణి గంధపుష్పఫలానిచ॥ నైవేద్యాన్వివిధాంశ్చైవ వస్త్రాణ్యాభరణానిచ। సంపాద్యశోధయేదేతాన్ ప్రాశయేత్పంచగవ్యకం॥

తా॥ ఓ చిన్నవాడా! సమస్త ప్రజలకు నింతకంటె పుణ్యమును వృద్ధిపొందించునట్టి వ్రతము మరియొకటిలేదు స్త్రీలకు ముఖ్యముగా సౌభాగ్యమును కలిగించును, ఇదినీయందు ప్రీతిచే ప్రకటనచేసి చెప్పబడుచున్నది కాబట్టి యో మునీశ్వరా! శ్రావణశుక్ల సప్తమీదినంబున ప్రారంభించి గౌరీదేవియందు భక్తి కలవారలయి సమస్త సాధన ద్రవ్యముల సమకూర్చుకొని గంధము పుష్పములు ఫలములు మొదలగు పూజా ద్రవ్యముల నన్నియు సంపాదించి యనేక విధములగు నైవేద్య పదార్థములను వస్త్రములు ఆభరణములు మొదలగువానిని సంపాదించి శుభ్రపఱచి పిమ్మట తాను పంచగవ్యములను ప్రాశన చేయవలయును,

శ్లో॥ చరుణాదిక్బలిందద్యా త్కార్యంచైవాధివాసనమ్। ఛాదయేత్సదృశైర్వస్త్రైః పత్రైశ్చైతత్పవిత్రకమ్ ॥

తా॥ అన్నముతో నష్ట దిక్కులయందును బలులనుంచి గౌరీదేవి నావాహన జేసి అధివాసము చేయవలయును శుభ్రమగు నూతనవస్త్రములచేతను పవిత్రములగు మామిడిచిగుళ్లు మొదలగు వానిచేతను పవిత్రమును జుట్టవలయును

శ్లో॥ దేవ్యాస్తన్మూలమంత్రేణ శతవారాభిమంత్రితం । స్థాపయేత్పురతోదేవ్యా స్సర్వశోభాసమన్వితమ్ ॥

తా॥ దేవియొక్క మూలమంత్రముచే నూఱు పర్యాయములు పవిత్రము నభిమంత్రించి సమస్త శుభముల నొనగూడు నట్లుగా నలంకరించి దేవియొక్క ముందు నుంచవలయును.

శ్లో॥ దేవ్యాస్తుమండపంకృత్వా రాత్రౌజాగరణంచరేత్ ।నటనర్తకవేశ్యానాం కుశలాన్వివిధాన్ఘనాన్॥ కారయేద్వాద్యగీతాదీ న్నృత్యవిద్యావిశారదాన్ । ప్రత్యూషేవిధివత్స్నాత్వా దిగ్భ్యశ్చ దద్యాత్పునర్బలీన్॥

తా॥ దేవతకు మంటపము చేర్పరచి నేర్పరులగు వేశ్యలు నర్తకులు మొదలగు వారిచే నాట్యము గీతము వాద్యము మొదలగునవి మనోహరముగా నుండునట్లు చేయించి యారాత్రియంతయు జాగరణముచే కాలక్షేపము చేసి ప్రాతః కాలంబున యథావిధిగా స్నానాది నిత్యకృత్యముల నెరవేర్చి తిరిగి యెనిమిది దిక్కు లందును భూతబలి నుంచవలెను.

శ్లో॥ దేవీంసంపూజ్యవిధివ త్స్త్రియోభోజ్యా స్తథాద్విజాః। పవిత్రమర్పయేద్దేవ్యా ఆదావంతేచదక్షిణామ్ ॥ యథాశక్త్యాథ వేద్వత్స నియమఃకార్యసాధకః । స్త్రీయోషామృగయాపానం రాజ్ఞావర్జ్యం ప్రియత్నతః॥

తా॥ పిమ్మట దేవతను యథావిధిగా పూజించి స్త్రీలకును బ్రాహ్మణులకును భోజనము పెట్టవలయును పవిత్రమును దేవతకు నర్పణ జేయవలయును ఆదియందు నంతమందు వతశక్తికొలది దక్షిణనుంచవలయును ఓమునీశ్వరా! వ్రతము నాచరించు వానియొక్క నియమములను జెప్పెదను వినుము, స్త్రీలయందు నభిలాష, జూదమాడుట, వేటాడుట, మద్యపానము మొదలగునవి రాజులు విడువవలయును.

శ్లో॥ స్వాధ్యాయశ్చద్విజాచార్యై ర్నకార్యంకర్షణంకృషేః। వణిగ్భిర్నచవాణిజ్యం స ప్తపంచదినానివా॥ అథవాత్రీణిచైకంవా దినం తస్యార్ధమేవవా। దేవ్యావ్యాపారఆసక్తిః కర్తవ్యాసతతంహృది॥

తా ॥ బ్రాహ్మణులు స్వాధ్యాయము చేయగూడదు వైశ్యులు వ్యవసాయం వర్తకము చేయకూడదు యిటువంటి నియమము ఏడు దినములు గాని యైదుదినములు గాని మూడు దినములు గాని ఒక్కదినము గాని లేక నాలుగు జాములుపర్యంతము గాని నియమము జరుపవలయును ఎల్లప్పుడు దేవతాపూజా వ్యాపారమువంటే తన మనస్సున కోరికనుంచవలెను

శ్లో॥ నకరోతివిధానేన పవిత్రారోపణంబుధః । తస్యసాంవత్సరీ పూజా నిష్ఫలామునిసత్తమ॥

తా ॥ ఓ మునీశ్వరా! విద్వాంసు డయినవాడు పవిత్రారోపణ వ్రతమును చెప్పిన రీతిగా చేయకుండెనేని సంవత్సర పర్యంతము జేసిన పూజ అంతయు నిష్ఫలమగును.

శ్లో॥ తస్మాద్భక్తిసమాయుక్తైర్నరై ర్దేవీపరాయణైః। వర్షేవర్షే ప్రకర్తవ్యం పవిత్రారోపణంశుభమ్॥

తా॥ కాఁబట్టి శుభముల నొసగునటువంటి పవిత్రారోపణ వ్రతమును దేవీధ్యానాసక్తులై భక్తికలవారలగుచు ప్రతిసంవత్సరమును తప్పక చేయుచుండవలెను.

శ్లో॥ కర్కాటకగతేసూర్యే తథాసింహగతేపివా। అష్టమ్యాం శుక్లపక్షస్య దద్యాద్దేవ్యాఃపవిత్రకమ్ ॥ ఏతస్యాకరణేదోషో నిత్యమేతత్ప్రకీర్తితమ్ ॥

తా॥ సూర్యుఁడు కర్కాటకరాశియందు గాని సింహరాశియందు గాని ప్రవేశించియుండగా శుక్లపక్ష అష్టమియందు వ్రతమునుచేసి పవిత్రమును దేవతకుసమర్పణ చేయవలయును ఈ వ్రతమును చేయనియెడల నిశ్చయముగా దోషముసంభవించును.

సనత్కుమారఉవాచ॥ శ్లో॥ దేవదేవమహాదేవ పవిత్రంయత్త్వయోదితం। నిర్మితవ్యంకథంస్వామిన్ తద్వదస్వవిశ్వేశ ॥

తా॥ దేవతులకు దేవుండవగు నోసాంబమూర్తీ నిచేత చెప్పబడిన పవిత్రమనునది యేవిధముగా చేయవలయునో దాని విధానము నంతయూ సవిస్తరముగా చెప్పుమని సనత్కుమారుడడిగెను,

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ హేమతామ్రమయైరూప్యైస్సూత్రైః కౌశేయపట్టజైః। కుశైఃకాశైశ్చకార్పాసైః బ్రాహ్మణ్యాకర్తితైశ్శుభైః॥ కృత్వాత్రిగుణితంసూత్రం త్రిగుణీకృత్యసాధయేత్ । తతోత్తమంపవిత్రంతు షష్ట్యాసహశతత్రిభిః॥సప్తత్యాసహితంద్వాభ్యాం శతాభ్యాంమధ్యమంస్మృతమ్। సాశీతినాశతేనైవ కనిష్ఠంతత్సమాచరేత్॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, బంగారము వెండి రాగి మొదలగు వానితో సూత్రములు చేయవలయును,లేక పట్టుదారముతో చేయవలయునులేక ప్రత్తితోచేయవలయును లేక దర్భకెల్లుతోనైనా చేయవలయును బంగారము మొదలగు లోహములతో చేయని పక్షమునందు ప్రత్తితో చేయుట మంచిది, ప్రత్తితోజేయని పక్షమునందు బ్రాహ్మణునిచే దారము తీయించి యా దారమును మూడు మడువులు మడచి యామడచిన దారమును తిరిగి మూడుమడుపులు మడువవలయును యిట్లుపవిత్రమునకు నుపయోగించుదారము కొలదిగా ౩౬౦ మూడువందల అరువది పెత్తల

పొడుగుగలిగి యుండుట ముఖ్యము ౨౭౦ రెండువందలడెబ్బదిబెత్తల పొడుగు కలిగి యుండుట రెండవపక్షము ౧౭౦ నూటయెనుబది బెత్తల పొడుగుగలిగి యుండుట మూడవపక్షము. కాబట్టి తనశక్తి ననుసరించి చేయవలయును,

శ్లో॥ ఉత్తమంతుశతగ్రంథి పంచాశద్గ్రంధిమధ్యమం । పవిత్ర కంకనిష్ఠంస్యా త్త్రింశద్గ్రంధిశోభనమ్॥

తా॥ ఆ పవిత్రమునకు నూరు ముడులుండుట ముఖ్యము యాభై ముడులుండుట మధ్యమము ముప్పదియారు ముడులుండుట కనిష్ఠము,

శ్లో॥ అథవాంగయుక్తై ర్వేదై ద్వాభ్యాంద్వాదశతోపివా । చతుర్వింశద్వాదశాష్ట గ్రంథిభిర్వాపవిత్రకమ్॥

తా॥ నాలుగు వేదములను షడంగవిద్యలచే హెచ్చింపగా ఇరువదినాలుగు సంఖ్యగలవియగును లేక రెండుపండ్రెండ్లు యిరువదినాలుగుయగును కాబట్టి అటు వంటి యిరువది నాలుగు ముడులు గాని పండ్రెండు ముడులుగాని యెనిమిదిముడులు గాని పవిత్రమునకునుండునట్లు చేయవలయును,

శ్లో॥ అథచాష్టోత్తరశతం చతుఃపంచాశదేవహి । సప్తవింశతి రేవైవం జ్యేష్ఠమధ్యకనీయసమ్॥

తా॥ లేక మఱియొక పక్షమున నూటయెనిమిది ముడులు ముఖ్యము యాభై నాలుగు మధ్యమము, యిరువదియేడు కనీసము,

శ్లో॥ అధమంనాభిమాత్రంస్యా దూరుమాత్రంతు మధ్యమం। ఉత్తమంజానుమాత్రంత త్పవిత్రస్యప్రమాణకమ్ ॥

తా॥ యిక పవిత్ర ప్రమాణ మెంతయనగా శిరస్సు మొదలు నాభి వరకు నుండువంత పొడవుగలది హీనము, తొడలు వరకు నుండునటువంటి పొడవు మధ్యమము, మోకాళ్ల వరకు నుండునటువంటి పొడవుగలది యుత్తమము, యిటువంటి ప్రమాణము ముడివేసిన పిమ్మట నుండవలెను,

శ్లో॥ రంజ్యాస్సర్వాఃకుంకుమేన పవిత్రగ్రంథయశ్శుభాః। దేవం పూజ్యపురోభాగే సర్వతోమండలేశుభే॥ కలశే వేణుపటలే పవిత్రాణి నిధాపయేత్। త్రిసూత్ర్యాంబ్రహ్మవిష్ణ్వీశా నావాహ్యచతత్క్రమాత్॥ నవసూత్ర్యాంతథోంకారం సోమంవహ్నింవిధింతథా। నాగాంశ్చంద్రరవీ శాంశ్చ విశ్వేదేవాంశ్చస్థాపయేత్॥

తా॥ శ్రేయస్కరములగు ఆ పవిత్రములకు వేయబడిన ముడుల నన్నింటిని కుంకుమచే నలంకరింపచేసి శోభస్కరమగు ఆమండపమున దేవతకు ముందు భాగమున నుంచవలయును అది ఏవిధముగాననగా ఆ పవిత్రముల నొకకలశమునందుంచి యా కలశమును వేణుపాత్రయం దుంచవలయును మొదట మూడు ఆవృత్తులుగా నుండు సూత్రము నందు బ్రహ్మ విష్ణువు రుద్రుల నావాహనము చేయవలయును తొమ్మిది ఆవృత్తులు గలుగుదానియందు 1 ఓంకారము, 2 చంద్రుడు, 3 అగ్ని, 4 బ్రహ్మ 5 ఆదిశేషువు, 6 చంద్రుడు, 7 సూర్యుడు, 8 ఈశానుడు, 9 విశ్వేదేవతలు, యీ తొమ్మండుగురు నధిదేవతలను తొమ్మిదిపోగులందు నావాహనముజేయవలెను.

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి స్థాప్యాగ్రంధిషు దేవతాః। క్రియా చపౌరుషీవీరా విజయాచాపరాజితా॥ మనోన్మనీజయాభద్రా ముక్తిరీశాతథైవచ। ప్రణవాదినమోంతైశ్చ నామభిర్గ్రంథిసంఖ్యయా॥ ఆవర్త్యమ్నాసరావాహ్య పూజయేచ్చందనాదిభిః । ధూపితం ప్రణవేనాభి మంత్ర్య దేవ్యై సమర్పయేత్॥

తా॥ యిక ముందు పవిత్రమునకు వేయఁబడినముడులయందు నావాహనము చేయతగిన దేవతలను చెప్పెదను వినుము క్రియా, పౌరుషీ, వీరా, విజయా, అపరాజితా, మనోన్మనీ, జయా, భద్రా, ముక్తిః, ఈశా, యీ చెప్పఁబడిన దేవతల నావాహనము చేయవలయును, యీ నామములకు మొదట నోంకారమును, చివర నమః పదమును చేర్చవలయును అదిఏవిధముగాననగా, ఓం క్రియాయైనమః, ఓం పౌరుష్యైనమః, వీరాయైనమః, విజయాయైనమః, అపరాజితాయైనమః,మనోన్మన్యైనమః జయాయైనమః, భద్రాయైనమః, ముక్త్యైనమః, ఓం ఈశాయైనమః, యీ ప్రకారం నామముల పదింటిని యుచ్చరింపుచు పదిముడులు అయినపిమ్మట తిరిగి క్రియామొదలగు నామములనే చెప్పుచు ఆ పవిత్రమునకుండు ముడుల ననుసరించి ఆవృత్తిగా చెప్పవలయును,

శ్లో॥ ఏత త్తేకథితం దేవ్యాః పవిత్రారోపణంశుభమ్। అన్యేషాం చైవదేవానాం ప్రతిపత్ప్రభృతిష్వపి॥ పవిత్రారోపణంకార్యం దేవతాస్తావదామితే। ధనదశ్శ్రీస్తథాగౌరీ గణేశస్సోమరాడ్గురుః॥ భాస్కరశ్చండికాంబాచ వాసుకిశ్చతథర్షయః। చక్రపాణిర్హ్యనంతశ్చ శివః కఃపితర స్తథా॥ ప్రతిపత్ప్రభృతిష్వేతాః పూజ్యాస్తిథిషు దేవతాః। ముఖ్యాయా దేవతాయాస్తు పవిత్రారోపణంత్విదమ్॥

తా॥ ఓ మునీశ్వరా పవిత్రారోపణముగురించి చెప్పితిని యికముందుపాడ్యమి మొదలు పౌర్ణమి వఱకు పదునైదును అమావాస్యతో కూడా పదునారు తిథుల యందు నావాహనము చేయతగిన దేవతలను చెప్పెదను వినుము కుబేరుడు, లక్ష్మి, గౌరి, వినాయకుడు, సోముడు, బృహస్పతి, సూర్యుఁడు, చండిక, అంబ, వాసుకి, సప్తఋషులు, విష్ణువు, అనంతుఁడు, శివుడు, బ్రహ్మ, పితృదేవతులు, ఈ పదియారు నధిదేవతలను పాడ్యమి మొదలుగా నాయ తిథులయందు నాయాదేవతల నావాహనము చేసి పూజింపవలయును పవిత్రము సర్పణచేయుటముఖ్యదేవతకే చేయవలయును.

శ్లో॥ తదంగదేవతాయాస్తు త్రిసూత్రంస్యాత్పవిత్రకమ్ ।

తా॥ యితర దేవతలకు నర్పించు పవిత్రమునకు మూడు పోగులు గలదిగా నేర్పరచ వలయును

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి కర్తవ్యంనవమీదినే। శ్రావణేమాసివిప్రేంద్ర పక్షయోరుభయోరపి॥ కుమారీనామికా దుర్గా పూజనీయాయథావిధి । కుర్యాన్నక్తవ్రతంతత్ర క్షీరంమాక్షిక భోజనమ్ ॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ మునీశ్వరా! యికముందునవమి యందు చేయతగినవ్రతమును చెప్పెదనువినుము శ్రావణమాసములో రెండుపక్షముల నవముల యందును కుమారీయను పేరుచే జెప్పబడు దుర్గాదేవిని యథా విధిగాపూజించినక్తవ్రతము చేయుచు రాత్రివఱకునుండి పాలునుగాని తేనెను గాని భక్షించి యుండవలయును.

శ్లో॥ ఉపవాసపరోవాస్యా న్నవమ్యాంపక్షయోర్ద్వయోః। కుమారీవేతినామ్నావై చండికామర్చయేత్సదా॥

తా॥ లేక యేమియు భక్షింపక నిరాహారుడుగానైన నుండవలయును రెండు నవములయందు దుర్గాదేవిని కుమారియను నామముచే నావాహనముచేసి పూజింప వలయును.

శ్లో॥ కృత్వారౌప్యమయీంభక్త్యా దుర్గాంవై పాప నాశనీమ్। కరవీరస్య పుష్పైస్తు గంధైరగరు చందనైః ॥ ధూపేనచదశాంగేన మోదకైశ్చాపిపూజయేత్ । కుమారీంభోజయేత్పశ్చాత్ స్త్రియోవిప్రాంశ్చభోజయేత్॥

తా ॥ పాపములను హరింపచేయునట్టి దుర్గాదేవియొక్క ప్రతిమను వరడ తోను చేయించి యీ ప్రతిమను కస్తూరి పుష్పములతోను అగరు మొదలగు సుగంధ ద్రవ్యములు కలసిన మంచి గంధముతోను పది విధములగు సుగంధ ద్రవ్యములుగల ధూపముతోను కుసుములతోను, పూజింపవలయును అనంతరము పెండ్లికాని కన్య కకు భోజనము పెట్టి పిమ్మట బ్రాహ్మణులు సువాసినీస్త్రీలను భుజింపచేయవలెను.

శ్లో॥ భుంజీతవాగ్యతఃపశ్చా ద్బిల్వపత్రికృతాశనః। ఏవంయః పూజయేద్దుర్గాం శ్రద్ధయా పరయాయుతః ॥ సయాతిపరమం స్థానం యత్రదేవోగురుస్థితః। ఏత త్తేనవమీకృత్యం కథితంవిధినందన ॥ సర్వ పాపప్రశమనం సర్వసంపత్కరంనృణామ్ । పుత్రపౌత్రాదిజనక మంతే సద్గతిదాయకమ్ ॥

తా ॥ అనంతరము తాను యితర సంభాషణలనేమియు చేయక మౌనముగల వాడై మారేడుదళములను భక్షించియుండవలయును ఈప్రకారము మిక్కిలి శ్రద్ధ గలవాడై యెవడు దుర్గాదేవిని పూజించునో అటువంటివాడు సమస్తమైనవారికి గురువగు భగవంతుడుండు సత్కృష్టస్థానమునకేగును కావున బ్రహ్మమానసపుత్రు డవగు యోసనత్కుమార మునీశ్వరా! సమస్తపాపములను పోగొట్టునదియు, మను ష్యులకు సమస్త సంపత్తుల నిచ్చునదియు, పుత్రులు పౌత్రుల కలిగించు నదియు, చివరకు మోక్షమునొసగునదియు నగు ఈ నవమీవ్రత సంబంధమగు కృత్యమునంత యును నీకు సవిస్తరముగా చెప్పితినని సాంబమూర్తి సనత్కుమార మునీశ్వరు నితో జెప్పెను.

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే

శ్రావణమాస మాహాత్మ్యే అష్టమ్యాం దేవీపవిత్రారో

పణంనామనవమ్యాం కుమారీ పూజనంనామ

సప్తదశోధ్యాయ స్సమాప్తః.



## అష్టాదశాధ్యాయ ప్రారంభః.

సనత్కుమారఉవాచ॥ శ్లో॥ భగవన్పార్వతీనాథ భక్తానుగ్రహ కారక। కథయస్వధయాసింధో మాహాత్మ్యందశమీతిథేః॥

తా॥ పార్వతీదేవికి పెనిమిటియు భక్తులననుగ్రహించువాడు దయాళువును రుద్రుడవు నగు యోభగవంతుడా! దశమీతిథియొక్క మహిమను చెప్పవలయునని సనత్కుమారుడు సాంబమూర్తి నడిగెను.

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ శ్రావణేశుక్లపక్షేతు దశమ్యాంప్రారభేద్వ్రతమ్। ప్రతిమాసేదశమ్యాంతు శుక్లాయాంవ్రతమాచరేత్॥ఏవం ద్వాదశమాసేషు కృత్వావ్రతమనుత్తమమ్। నభశ్శుక్ల దశమ్యాంతు తతఉద్యాపనంచరేత్॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ మునీశ్వరా! ఈ దశమీవ్రతము శ్రావణశుద్ధ దశమియందు ప్రారంభించి పండ్రెండు మాసములలోను ప్రతిశుక్ల దశమియందును చేయుచు తిరిగి శ్రావణము రాగానే శుక్లదశమి యందు శ్రేష్ఠంబగు ఈ వ్రతమునకు నుద్యాపనము చేయవలెను,

శ్లో॥ రాజ్యార్థయారాజపుత్రః కృష్యర్థంచకృషీవలః। వాణిజ్యార్థంవణిక్పుత్రః పుత్రార్థం గుర్విణీతథా॥ ధర్మార్థకామసిద్ధ్యర్థం లోకఃకన్యావరార్థినీ। యష్టుకామోద్విజవరో రోగ్యారోగ్యార్థమేవచ॥ చిరప్రవసితేకాంతే పత్నీతస్యాగమాయచ। ఏతేష్వన్యేషుకర్తవ్య మాశావ్రతమిదంతథా॥

తా॥ క్షత్రియుడు రాజ్యాపేక్షచేతను వ్యవసాయదారుడు వ్యవసాయము నిమిత్తము, వైశ్యుడు వర్తకనిమిత్తం, గర్భిణీస్త్రీ పుత్రుల నిమిత్తం, సర్వజనులు ధర్మార్థకామముల కొరకును, పెండ్లికాని చిన్నది మంచి వరుడు సంభవించుట కొఱకును, బ్రాహ్మణుడు యజ్ఞముచేయు కొఱకును, రోగవంతుడు ఆరోగ్యము కొఱకును, పెనిమిటి దూరదేశమువెళ్లి బహుకాలమువరకు రాకుండినయెడల శీఘ్రముగా వచ్చునిమిత్తం వానిభార్యయు,యీప్రకారం ఎవరెవరు ఎట్టికోరికగలవారలయియుందురో వారివారి కోరికల సఫలముకొఱకు యీ దశమీ వ్రతమును సమస్తమైనవారును ముఖ్యంగాచేయవలయును,

శ్లో॥ యస్మాద్యస్యభవేద్భీతిః కార్యం తేనతదావ్రతం । నభ
శ్శుక్లదశమ్యాంచస్నాత్వాసంపూజ్యదేవతాం॥ నక్తమాశాసుపూజ్యా
వై పుష్పపల్లవచందనైః।గృహాంగణేలేఖయిత్వా యవపిష్టాతకేనవా॥
స్త్రీరూపాధిదేవస్య శస్త్రవాహనచిహ్నితాః। దత్వాఘృతాక్తంనై
వేద్యం పృథగ్దీపాంశ్చదాపయేత్॥

తా॥ ఎవనికి నెట్టి పీడ కలుగునో అట్టి పీడలం తొలగుట కొఱకు చేయవలయును, శ్రావణశుక్లదశమియందు స్నానముచేసి పరిశుద్ధుడై శుభ్రవస్త్రములనుధరించి ఆయాదిక్కుల నధిదేవతులకు పూజచేయు నిమిత్తం రాత్రి వరకు నుపవాసము చేసి వాకిలి ముందర బియ్యపుపిండి బుక్కాయి మొదలగు వానితో నష్ట దిక్కులకు నధిదేవతలను శస్త్రములు వాహనములు మొదలగు వానితోగూడి కొని యున్న వారినిగా స్త్రీవిగ్రహములను లిఖియించి వేరువేరుగా దీపములను వెలిగించి నేతితో మిశ్రితమగునన్నము మొదలగు వానిని వేరువేరుగానివేదనం చేయవలెను,

శ్లో॥ ఫలానికాలజాతాని తతఃకార్యంనివేదయేత్।ఆశాస్స్వ
శాస్సదాసంతు సిద్ధ్యంతుమే మనోరథాః॥ భవతీనాంప్రసాదేన సదా
కల్యాణమస్త్వితి। ఏవంసంపూజ్యవిధివద్దత్వావిప్రాయదక్షిణామ్॥అనే
నక్రమయోగేన మాసిమాసిసదాచరేత్॥

తా॥ ఆయాకాలములయందు సంభవించిన ఫలములను నివేదన చేయవలెను. దిక్కులన్నియు శోభస్కరములుగా నుండుగాక నాయొక్క కోరికలు సఫలములగుగాక, ఓ దేవతులారా! మీయనుగ్రహము వలన నెల్లప్పుడు మాకు శుభము కలుగుచుండుగాకయని ప్రార్థించి దిక్కులకునధిదేవతులను యథావిధిగాపూజించి బ్రాహ్మణులకు భోజనముపెట్టి దక్షిణ తాంబూలాదుల నియ్యవలయును యీప్రకారము సంవత్సరమువఱకు ప్రతిమాసము నందును చేయుచు ఓ మునీశ్వరా! పిమ్మట నుద్యాపనమును యథావిధిగా చేయవలయును,

శ్లో॥ సౌవర్ణీః కారయేదాశాః రౌప్యాఃపిష్టాతకేనవా। జ్ఞాతి
బంధుజనైస్సార్థం స్నాతస్సమ్యగలంకృతః॥ పూజయేద్భక్తియుక్తేన
చేతసాదశదేవతాః।స్థాపయేత్క్రమయోగేనమంత్రైరేభిర్గృహాంగణే॥

తా॥ దిక్కులయొక్క అధిదేవతల ప్రతిమలను బంగారముతోగాని వెండితోగాని చేయించవలయును శక్తిలేని పక్షమున బుక్కాయితోనైన వేయవలయును,

అనంతరము స్నానము చేసి పరిశుద్ధుడై సర్వాభరణములచే నలంకరింపబడి వాకిలి ముందర భాగమున దశదేవతలకావాహనము చేసి భక్తితో కూడిన మనస్సుగలవాడై క్రమముగా దశదేవతలను ముందు చెప్పబోయెడి మంత్రములచే నావాహనము చేసి పూజింపవలయును.

శ్లో॥ త్వయిసన్నిహితశ్శక్రః స్సురాస్సురనమస్కృతః। స్వామీ చభువనస్యాస్య ఐంద్రిదిగ్దేవతేనమః॥

తా॥ ఓ పూర్వదిక్కా! దేవతలచేతను రాక్షసుల చేతను నమస్కరింపబడునట్టియు మూడులోకములకు ప్రభువగు దేవేంద్రుడు నీదిక్కునందు యెల్లప్పుడు నివసించియుండెను అట్టిపూర్వదిక్కునకు నమస్కారము,

శ్లో॥ ఆగ్నేఃపరిగ్రహాదాశే త్వమాగ్నేయీతిపఠ్యతే। తేజో రూపాపరాశక్తిః దతస్త్వంవరదాభవ॥

తా॥ ఓ యాగ్నేయదిక్కా! నీవు అగ్నిహోత్రునిచే పరిగ్రహింప బడితివి కాబట్టి ఆగ్నేయమని చెప్పబడితివి అందువలన తేజోరూపిణివై పరాశక్తివై తివి కాబట్టి నేను కోరినవరముల నిత్తువుగాక.

శ్లో॥ ధర్మరాజస్సమాశ్రిత్య లోకాన్సంయమయత్యసౌ। తేన సంయమనీచాసి మామ్యేసతాకముదభవ॥

తా॥ ఓ దక్షిణదిక్కా! యమధర్మరాజు నీదిక్కుయందు నుండి లోకములను శిక్షించుచున్నాడు కాబట్టి సంయమనీ అనుపేరుగల దానివైతివి నాయొక్క కోరికల నిత్తువుగాక.

శ్లో॥ ఖడ్గహస్తాతివిక్రాంతా నిర్ఋతిస్థానమాశ్రితా। తేనతే నిర్ఋతిరూపాసి త్వమాశాంపూరయస్వమే॥

తా॥ ఓ నిర్ఋతిదిక్కా! హస్తమునందు ఖడ్గము కలవాడై పరాక్రమించుచు నిర్ఋతియను రాక్షసునిచే నధిష్టింప బడితివి కాబట్టి నీవు నిర్ఋతియని చెప్ప బడితివి అటువంటి నీవు నామనస్సునందు సమస్త కోరికలను సఫలము చేయుదువుగాక.

శ్లో॥ త్వయ్యాస్తేభువనాధారే వరుణోయాదసాంపతిః। కామార్థదాంసమర్థాంత్వాం వారుణిప్రవణాభవ॥

తా॥ ఓ పశ్చిమదిక్కా! నీవు భువనములకు నాధారమైనదానవు జలజంతువులకు నధిదేవతయగు వరుణ దేవుడు నీదిక్కునం దుండెను కాబట్టి అట్టి నీవు నాయొక్క ధర్మము కోఱకును కార్యసిద్ధి కొఱకు ననుకూలమైన దానవగుదువుగాక.

శ్లో॥ అధిష్ఠితాసియస్మాత్త్వం వాయునాజగదాదినా। వాయవ్యేత్వమతశ్శాంతిం నిత్యం మచ్ఛసుమాలయే॥

తా॥ ఓ వాయవ్యదిక్కా! జగదాధారుడైన వాయువుచే నధిష్ఠింపబడితివి కావున నీవు నిత్యము నాగృహమునందు నివసించి శుభముల నొసగుచుండుము.

శ్లో॥ ధనాధిపాధిష్ఠితాసి ప్రఖ్యాతాత్వమిహోత్తరా। నిరుత్తరాభవాత్వాసు దత్వాసర్వ్యమనోరథమ్।

తా. ఓ ఉత్తరదిక్కా! నీవుకుబేరునిచే నధిష్ఠింపబడి ప్రసిద్ధికెక్కితివి కావున నీవు నాయొక్క కోరికల నొసగి మమ్ములను మఱియొక కోరిక లేనివాళ్లను గాచేయవలయును.

శ్లో॥ ఐశానిజగదీశేన శంభునాత్వమలంకృతా। పూరయస్వశుభేదేవి వాంఛితానిచమోనమః॥

తా. ఓ యీశాన్యదిక్కా! జగత్ప్రభువగు సాంబమూర్తిచే నధిష్ఠింప బడితివి శుభముల నొసగు నట్టి యోదేవీ! నీకు నమస్కారము చేసెదను నా కోరికలను నొసగుము.

శ్లో॥ సర్వలోకోపరిగతా సర్వదాశ్శాంతిప్రదా: సనకాద్యైశ్చపరివృతా మాంత్రాహిత్రాహిసర్వదా॥ నక్షత్రాణిచసర్వాణి గ్రహాస్తారాగణా స్తథా। నక్షత్రమాతరోయాశ్చ భూతప్రేత వినాయకాః॥ పూజతాస్తుమయాభక్త్యా భక్తిప్రవణచేతసా। సర్వేమమేష్టసిద్ధ్యర్థం భవంతుప్రవణాస్సదా॥

తా॥ ఓ యూర్ధ్వదిక్కా! ఎల్లప్పుడు శుభముల నొసగు దానవును సనకాది మునీశ్వరులతో కూడి యుండు దానవు నైతివి, ఎల్లప్పుడు నన్ను రక్షింపు చుండుము నీయందు నివసించు నటువంటి అశ్వని మొదలగు నిరువదియేడు నక్షత్రములను సూర్యుడు మొదలగు నవగ్రహములును యితరములగు నక్షత్ర సంఘములును ఆనక్షత్రములకు తల్లులును మఱియు భూతములు ప్రేతలు పిశాచములు వినాయకులు మొదలగు జ్యోతిర్గణములనన్నియు భక్తితోగూడిన మనస్సుగలవాడనయి పూజిం

పుచుంటిని కావున అవియన్నియు నెల్లప్పుడు నాయొక్క యిష్టసిద్ధి కొఱకు సన్నిహితులయి యుండుగాక,

శ్లో॥ భుజంగమకులేనత్వం సేవితాసియతోహ్యధః । నాగాంగనాభిసహితా తుష్టాభవమమాద్యవై ॥

తా॥ భూతలము మొదలు పాతాళమువరకు నుండు యో అధోదిశా ! నీవు సర్పకులముచే సేవింపబడుచుండివి నీవు సంతోషమైన మనస్సుగలదానవై సర్పస్త్రీలతోగూడినదానవగుచు నాయొక్క కోరికల నొసగుము

శ్లో॥ ఏభిర్మంత్రైస్సుమభ్యర్చ్య పుష్పధూపాదినాతతః । అలంకారాంశ్చవాసాంసి ఫలానిచనివేదయేత్ ॥

తా॥ ఈ ప్రకారము వర్ధిల్లు మునిచ్చు మంత్రములచే పదిదిక్కులను పుష్పములును ధూపం మొదలగు వానిచే పూజించి అనంతరం అలంకారములు వస్త్రములు ఫలములు మొదలగువానిని యాదెవతలకు సమర్పింపవలయును,

శ్లో॥ తతోవాద్యాదినాదేన గీతనృత్యాదిమంగళైః । నృత్యైతీభిర్వరస్త్రీభిజాగరేణనిశాంనయేత్ ॥

తా॥ అనంతరము వాద్యములు మొదలగు వానియొక్క ధ్వనులచేతను సంగీతము నాట్యము మొదలగు మంగళధ్వనులచేతను నాట్యమునందు నేర్పుగలమనోహరులగువేశ్యల నాట్యముచేతను ఆరాత్రియంతయు జాగరణముచేగడుపవలెను,

శ్లో॥ కుంకుమాక్షతతాంబూల దానమానాదిభిస్సుఖం। అతివాహ్యచతాంరాత్రిం హర్షయుక్తేనచేతసా ॥ ప్రభాతేప్రతిమాఅర్చ్య బ్రాహ్మణాయనివేదయేత్। అనేనవిధినాకృత్వా క్షమాప్యప్రణిపత్య చ॥ భుంజీతమిత్రైస్సహితస్సుహృద్బాంధుజనేనచ । ఏవంయః కురుతే తాత దశమీవ్రతమాదరాత్ ॥ సర్వాన్కామానమవాప్నోతి మనసోభిమతాన్నరః। స్త్రీభిర్విశేషతఃకార్యం వ్రతమేతత్సనాతనమ్॥

తా॥ సంతోషయుక్తమైన మనస్సుగలవారలై కుంకుమ అక్షతలు తాంబూలములు మొదలగువాని నిచ్చుట ఈ మొదలగు సత్కారములచే నారాత్రి నంతయు వెళ్లబుచ్చి తెల్లవారినపిమ్మట ఆప్రతిమలను తిరిగి పూజించి బ్రాహ్మణునకు దానమియ్యవలయును యీ ప్రకారము వ్రతమాచరించి యెక్కడనుండు పెద్దలకు నమస్కారముచేసి క్షమార్పణగోరి పిమ్మట స్నేహితులు బంధువులు పెద్దలు మొదలగు

వారితోగూడి భుజింపవలయును, ఓ చిన్నవాడా! ఈప్రకారము దశమీ వ్రతమును శ్రద్ధతో చేసినవాడు తనమనస్సునకోరిన సమస్తకోరికలను పొందును పురాతనమగు యీదశమీవ్రతమును స్త్రీలు ముఖ్యముగాచేయవలయును.

శ్లో॥ ప్రాణివర్గేషు యతోనార్యశ్శ్రద్ధాకామపరాయణాః। ధన్యంయశస్యమాయుష్యం సర్వకామఫలప్రదమ్। కథితంచమునిశ్రేష్ఠ మయావ్రతమిదంతవ। నానేనసదృశంచాన్య ద్వ్రతమస్తిజగత్త్రయే॥

తా॥ స్త్రీలు ముఖ్యముగా చేయుటకు హేతువేమనగా సమస్త ప్రాణిసమూహములయందు ధర్మాది కార్యముల జేయుటయందు స్త్రీలు మిక్కిలి శ్రద్ధ గలవారలయి యుందురు అందువలన స్త్రీలు తప్పకజేయవలెను, ఓ మునీశ్వరా! ఐశ్వర్యము నొసగునదియు కీర్తి నిచ్చునదియు ఆయుస్సు నిచ్చునదియు సమస్తకోరికల నొసగునదియు కాఁబట్టి యీదశమీవ్రతమును నీకు జెప్పితిని మూడులోకముల యందును దీనితో సమానమగు వ్రతము మఱియొకటిలేదు,

శ్లో॥ యేమానవావిధిజపుంగవ కామకామా స్సంపూజయంతి దశమీషు సదాదశాశాః। తేషామశేషనిహితాన్ హృదయస్థకామా నాశాఃఫలంతికిమిహాస్తి బహూక్తితేన॥

తా॥ బ్రహ్మమానసపుత్రులలో శ్రేష్ఠుఁడవగు యోసనత్కుమారా ! ఈ వ్రతము యిట్టిది అట్టిది అని విశేషముగా చెప్పవలసినదిలేదు ఎవరయినను కోరికల నపేక్షించి ప్రతిశుక్ల దశమి యందును పదిదిక్కులను పూజింతురో వారియొక్క హృదయమందుండెడి సమస్తకోరికలను దిక్కులు సంతసించియిచ్చును,

శ్లో॥ మోక్షప్రదానేనాయాసో నాత్రకార్యావిచారణా।వ్రతం చానేనసదృశం నాభూతంనభవిష్యతి॥

తా॥ ఓ మునీశ్వరా యీవ్రతము మోక్షము నొసగు విషయములో సులభముగా నొసగును, యీ విషయములో విచారణ యెంతమాత్రముచేయనక్కరలేదు దీనితో సమానమగు వ్రతము యిది వరకు నెక్కడను జరిగియుండలేదు యిక ముందు

నెక్కడను జరుగబోదు అని యీప్రకారము సాంబమూర్తి సనత్కుమార మునీశ్వరునితో జెప్పెను,

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాసమాహాత్మ్యే ఈశ్వర సనత్కుమార సంవాదే ఆశాదశమీవ్రత కథనం నామ అష్టాదశోధ్యాయ స్సమాప్తః

---

అథైకోనవింశోధ్యాయ ప్రారంభః.

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ అథవక్ష్యేనభోమాసి పక్షయోరుభయోరపి। ఏకాదశ్యాంతుయత్కృత్యం తచ్ఛృణుష్వమహామునే॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓమునీశ్వరా, యికముందు శ్రావణమాసములో రెండుపక్షములయందు వచ్చునటువంటి యేకాదశులయందు చేయతగిన కృత్యమును చెప్పెదను సావధాన మనస్సుగలవాడవై వినుము.

శ్లో॥ నకస్యచిన్మయాఖ్యాతం గుహ్యమేతదనుత్తమమ్। మహాపుణ్యప్రదంవత్స మహాపాతకనాశనమ్॥ వాంఛితార్థప్రదంనౄణాం శ్రుతంపాపహరకం।శ్రేష్ఠవ్రతానాంసర్వేషాంశుభమేకాదశీవ్రతం॥

తా॥ ఓ చిన్నవాడా, శ్రేష్ఠంబైన యీయేకాదశీవ్రతము నిదివరలో నెవరికిని నేను చెప్పియుండలేదు రహస్యముగానున్నది కావున యీ యేకాదశీవ్రతము విశేషమగు పుణ్యమునిచ్చునదిగాను మహాపాతకములను నశింపుచేయునదిగాను మనుష్యులకు కోరిన కోరికల నిచ్చునదిగాను ఉపపాతకముల నన్నింటిని నశింపుచేయునదిగాను శ్రేష్ఠంబగు వ్రతముల నన్నింటిలోను గొప్పదిగాను శుభముల నొసగునదిగాను సమస్తమైన మహామునులచేతను జెప్పబడెను,

శ్లో॥ తత్తేహంసంప్రవక్ష్యామి సమాహితమనాశ్శృణు। దశమ్యాముపసిస్నాత్వా కృతసంధ్యాదికశ్శుచిః॥ ప్రాజ్ఞాంవేదవిదుషః పురాణజ్ఞా జితేంద్రియా। సంపూజ్యదేవదేవేశం షోడశైరుపచారకైః॥ ఏకాదశ్యాంనిరాహార స్థిత్వాహమపరేహని। భోక్ష్యామిపుండరీకాక్ష శరణంమేభవాచ్యుత॥

తా ॥ కాఁబట్టి యోమునీశ్వరా, యీ ఏకాదశీ వ్రతమును నీకు జెప్పెదను సావధాన చిత్తముగలవాడవై వినుము దశమిదినంబున ప్రాతఃకాలంబున స్నానము చేసి పరిశుద్ధుడై సంధ్యావందనాది నిత్యకృత్యముల నెరవేర్చుకొని వేదమును జదివిన వారు పురాణమును తెలిసినవారు యింద్రియములను జయించినవారు యీ మొదలగు సత్పురుషుల వలన ననుజ్ఞ గొని దేవదేవుండగు భగవంతుని షోడశోపచారముల చేత పూజించి పద్మములవంటి నేత్రములుగల యోనారాయణమూర్తీ యీదినంబున ఏకభుక్తంబును ఏకాదశీదినంబున నుపవాసంబును జేసి ద్వాదశీదినంబున భుజించెదను ఓ భగవంతుడా నన్నురక్షింపుమని ప్రార్థించవలెను,

శ్లో॥ కుర్యాచ్ఛనియమంవత్స గురుదేవాగ్నిసన్నిధౌ । తద్దినే భూమిశాయీస్యా త్కామక్రోధవివర్జితః॥

తా ॥ ఓ చిన్నవాడా! ఈ మూడు దినములయందు నియమముగానుండి గురువులు దేవతలు అగ్నిహోత్రము వీరిసన్నిధానమునందే నివసించుచు కామ క్రోధాది దుష్టగుణములను విడిచి శాంతస్వభావము గల వాడగుచు యీ మూడు దినములయందును భూమియందే పరుండవలయును,

శ్లో॥ తతఃప్రభాతేవిమలే కేశవార్పితమానసః। శ్రీధరేతితవా వాక్యం క్షుత్ప్రస్థలనాదిషు ॥ పాఖండాదిభిరాలాపం దర్శనంశ్రవణం తథా। త్యజేద్దినత్రయంవత్స వ్రతంక్త్వైవల్యకారణమ్ ॥

తా ॥ ఓ చిన్నవాడా! అనంతరము ఏకాదశినా డుదయమున లేచి విష్ణువందు చిత్తముగలవాడై తుమ్మినను దగ్గినను శ్రీధర శ్రీధర అని స్మరణ చేయుచు పాషండులు మొదలగు వారిని చూచుట వారితో సంభాషించుట వారి మాటలను వినుట ఈ మొదలగువాటిని మూడు దినములు విడిచి ముక్తికి కారణమగు ఏకాదశీ వ్రతమును చేయవలయును,

శ్లో॥ తతోమధ్యాహ్నసమయే నద్యాదావిమలేజలే । స్నానం కుర్యాజ్జితక్రోధః పంచగవ్యపురస్సరమ్॥ ఆదిత్యాయనమస్కృత్య శ్రీధరంశరణంవ్రజేత్ । స్వవర్ణాచార విధినా కృతకృత్యో గృహం వ్రజేత్ ॥

తా ॥ అనంతరము మధ్యాహ్న కాలంబున నదులు మొదలగు పవిత్రములగు జలంబున స్నానముచేసి క్రోధాదిదుర్గుణములనువిడిచి పంచగవ్యప్రాశనచేసి సూర్యు

నకు నమస్కారము చేసి భగవంతుని శరణను పొంది తన కులాచార సంబంధమగు కృత్యములను నెరవేర్చి యింటికిరావలెను.

శ్లో ॥ పూజయేచ్ఛ్రీధరంతత్ర శ్రద్ధాభక్తిపురస్సరమ్ । పుష్పై ర్ధూపై స్తథాదీపై ర్నైవేద్యై ర్వివిధైరపి॥

తా ॥ అనంతరము శ్రద్ధాభక్తులతో గూడినవాడై పుష్పములు ధూపములు దీపములు అనేక విధములగు నైవేద్యములు మొదలగు వానిచే శ్రీధరుని పూజించవలయును.

శ్లో॥ గీతవాద్యైఃకథాభిశ్చ జాగరంకారయేన్నిశి । కుంభంసం స్థాపయిత్వాతు రత్నగర్భంసకాంచనమ్ ॥ ఛాదితంవస్త్రయుగ్మేనసిత చందనచర్చితం । ప్రతిమాం దేవదేవస్య శంఖచక్రగదాభృతామ్॥ కృత్వాయుదావత్సంపూజ్య ప్రభాతేవిమలేసతి । ద్వాదశ్యాం కృతకృత్యస్తు శ్రీధరేతిజపేద్బుధః॥ పూజయేద్దేవదేవేశం శంఖచక్రగదాధరం। విప్రాయదద్యాత్కలశం హేమదక్షిణయాన్వితమ్॥

తా ॥ ఒక కలశమునకు మంచిగంధము పూసి దానికి నూతనమగు రెండు వస్త్రములను జుట్టి దానిలో రత్నములు బంగారము నుంచి శంఖము చక్రము గద మొదలగు నాయుధములచే నొప్పబడుచుండెడి విష్ణుమూర్తి ప్రతిమను పూర్వమందు చెప్పబడిన కలశమునందుంచి యథావిధిగా పూజించి యారాత్రి యంతయు సంగీతము వాద్యములు హరికథా కాలక్షేపములు మొదలగు వానిచే వెళ్లబుచ్చి ద్వాదశినాడు తెల్లవారగానే లేచి స్నాన సంధ్యావందనాది నిత్యకృత్యముల నెరవేర్చి శ్రీధరునియందే చిత్తముగలవాడై యా ప్రతిమను తిరిగి పూజించి దక్షిణతో గూడ యాకలశమును ప్రతిమను ఆచార్యునకు దానమియ్యవలయును,

శ్లో ॥ విశేషాన్నవనీతంతు తత్రదేయంద్విజాతయే । శ్రీధరః ప్రీయతామేద్య శ్రియంపుష్టాత్వను తమామ్॥ ఇత్యుచ్చార్యమునిశ్రేష్ఠ సమభ్యర్చ్యజగద్గురుమ్ । సంభోజ్యవిప్రముఖ్యాంశ్చ దద్యాచ్ఛక్త్యాతు దక్షిణామ్ ॥

తా ॥ ఓ మునీశ్వరా! శ్రీధరుడు సంతోషించుగాక నాకు విశేషమగు నైశ్వర్యమునిచ్చుగాక యని ప్రార్థించి జగత్ప్రభువగు విష్ణుమూర్తిని పూజించి నవనీతము మొదలగు నవన్నియు బ్రాహ్మణునకు నిచ్చి మఱియు నితరులగు బ్రాహ్మణులకుకూడ భోజనము పెట్టి తనశక్తికొలది దక్షిణ నియ్యవలయును.

శ్లో॥ భృత్యాదీన్భోజయిత్వాతు యవసంగోషుదాపయేత్ । స్వయంభుంజీతచతత స్సుహృద్బంధుసమన్వితః॥

తా॥ అనంతరము భృత్యులు మొదలగు వారికిని భోజనము పెట్టి గోవులకు పచ్చిక మొదలగు మేతవేసి అనంతరము స్నేహితులు బంధువులు మొదలగు వారితో గూడి తాను భుజింపవలెను,

శ్లో॥ సనత్కుమారకథిత స్తే శుక్లైకాదశీవిధిః । ఏవమేవనభో మాసి కృష్ణాయా మపిసాధయేత్॥

తా॥ ఓ సనత్కుమారా! ఈ ప్రకారము శ్రావణశుక్ల ఏకాదశీ వ్రతము చెప్పబడినది యీ ప్రకారముగానే శ్రావణ మాసములో బహుళ ఏకాదశియందును వ్రతము చేయవలయును,

శ్లో॥ అనుష్ఠానంతుల్యమేవ దేవనామ్నిపరంభిదా। జనార్దనః ప్రీయతాంమే వాక్యమేతదుదీరయేత్॥

తా॥ రెండు యేకాదశులయందును కృత్యములు సమానమె గాని నామములు మాత్రము వేరు అది యేవిధముగా ననగా శుక్లపక్ష యేకాదశియందు పూజించి నప్పుడు శ్రీధరుడనియు బహుళపక్షయేకాదశియందు పూజించునప్పుడు జనార్దనుడనియు పూజింపవలయును,

శ్లో॥ శుక్లాయాంశ్రీధరోదేవః కృష్ణాయాంతుజనార్దనః।ఏత త్తేసమ్యగాఖ్యాత ముభయైకాదశీవ్రతమ్॥

తా॥ శుక్ల పక్షంబున శ్రీధరు డనియును, బహుళ పక్షంబున జనార్దను డనియు విష్ణుమూర్తి వేరువేరు నామముల చెప్పఁబడుచున్నాడు కాఁబట్టి యీవిధముగు రెండు యేకాదశీ వ్రతములను నీకు చక్కగా విమర్శించి చెప్పితిని.

శ్లో॥ నానేనసదృశంపుణ్యం నభూతంనభవిష్యతి। ఇదంత్వయా గోపనీయం నదేయందుష్టమానసే॥

తా॥ దీనితో సమానమగు పుణ్యవ్రతము ఇదివరకు నెక్కడను లేదు యిక ముందును కలుగబోదు కావున యిది నీవు రహస్యముగానుంచుము దుష్టస్వభావులకు చెప్పఁ గూడదు,

ఈశ్వరఉవాచ ॥ శ్లో॥ అథవక్ష్యామి ద్వాదశ్యాం పవిత్రారో పణంమహత్ । ఉక్తఃపాత్రయోవిధిర్దేవ్యాః పవిత్రారోపణేతవ ॥ విశేషా

యశ్చైతంవక్ష్యే సావధానమనాశ్శృణు । అత్రాధికారీసందిష్ట స్తంశ్రుణుష్వవదామి తే॥

తా ॥ ఓ మునీశ్వరుఁడా, యిక ముందు ద్వాదశి యందువిష్ణువును గురించి పవిత్రారోపణ వ్రతమును చెప్పెదనువినుము, ఈ పవిత్రారోపణ విషయమై యిదివరకు దేవీ సంబంధమగు పవిత్రారోపణమునకు చెప్పబడినట్లుగానే కృత్యము లన్నియును సమానము దీనియందు గల విశేషములు మాత్రము చెప్పెదను సావధానమనస్సుగల వాఁడవై వినుము దీనియందు వ్రతము చేయుటకు తగిన అధికారి విషయమును గురించిచెప్పబడినది కావున దానిని గురించిచెప్పెదను,

శ్లో ॥ బ్రాహ్మణఃక్షత్రియోవైశ్య స్తథాస్త్రీశూద్రఏవచ । స్వధర్మావస్థితాస్సర్వే భక్త్యాకుర్యుఃపవిత్రకమ్॥

తా॥ బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడు వైశ్యుఁడు స్త్రీలుశూద్రులు అందరును తమ ధర్మములయందుండువారలై భక్తితో కూడుకొని యీపవిత్రారోపణ వ్రతమును జేయవచ్చును,

శ్లో॥ అతోదేవీతిమంత్రేణ ద్విజోవిష్ణోర్నివేదయేత్। స్త్రీశూద్రాణాంనామమంత్రేణైవసంపూజయేద్ధరిమ్॥

తా॥ విష్ణువునుగురించి పవిత్రమునర్పించునప్పుడు బ్రాహ్మణుఁడు అతోదేవీ అను మంత్రమును జెప్పుచు నర్పింపవలయును స్త్రీలుశూద్రులువిష్ణువుయొక్క పేరును చెప్పుచు పవిత్రమునర్పింపఁగలయును,

శ్లో॥ కద్రుద్రాయేతిమంత్రేణ ద్విజశ్శంభోర్నివేదయేత్। స్త్రీశూద్రాణాంనామమంత్రేణైవసంపూజయేద్ధరమ్ ॥

తా ॥ శివునిగురించి పవిత్రారోపణ వ్రతవిషయములో కద్రుద్రాయ అను మంత్రమును చెప్పి బ్రాహ్మణుడు పవిత్రమునర్పించవలయును శివునినామములను చెప్పి స్త్రీలు శూద్రులు పవిత్రమునర్పించవలయును,

శ్లో ॥ కృతేమణిమయంకార్యం త్రేతాయాంహేమసంభవం । పట్టజంద్వాపరేసూత్రం కార్పాసంతుకలౌస్మృతం॥

తా॥ కృతయుగములో మణులతోగూర్చబడిన పవిత్రమును త్రేతాయుగములో బంగారపు పవిత్రమును, ద్వాపరయుగములో పట్టుపవిత్రమును, కలియుగములో ప్రత్తిసంబంధమగు పవిత్రమును నర్పణచేయవలెను,

శ్లో॥ యతిభిర్మానసం కార్యం పవిత్రారోపణం శుభమ్। కృత్వా నిచపవిత్రాణి వైణవే పట్టలే శుభే॥ సంస్థాప్య శుభ్రవస్త్రేణ పిధాయ పురతో న్యసేత్। క్రియాలోపవిధానార్థం యత్త్వయాపి హితం ప్రభో॥ మయైతత్క్రియతే దేవ తవ తుష్ట్యై పవిత్రకం। న మే విఘ్నో భవేద్దేవ కురు నాథ దయాం మయి॥

తా॥ ఈ పవిత్రారోపణమును యతీశ్వరులు మనస్సునందే చేయవలయును, యీ పవిత్రములను వెదురు పాత్రయందుంచి శుభ్రమగు నూతన వస్త్రములచే గప్పి యో ప్రభువా, నేను పాత్రను వస్త్రముచే గప్పినరీతిగానే నాక్రియా లోపముల నన్నియును గప్పుము, నీవు సంతసించుటకు ఈ పవిత్రారోపణ వ్రతమును చేసితిని ఓ స్వామీ నాయందు దయగలవాడవై నేచేయు వ్రతమునకు విఘ్నము కలిగింపకుము అని ప్రార్థించవలెను

శ్లో॥ సర్వథా సర్వదా దేవ మమ త్వం పరమా గతిః। ఏతత్పవిత్రోహం త్వాంత తోషయామి జగత్పతే॥

తా॥ ఓ దేవా, యెల్లప్పుడు సమస్త విధములచే నీవే నాకు దిక్కు ఓస్వామీ నేను యీపవిత్రస్వరూపుడనై నిన్ను సంతోషింపజేయువాడనగుదును,

శ్లో॥ కామక్రోధాదయో హ్యేతే న మే స్యుర్వ్రతఘాతకాః। అద్య ప్రభృతి దేవేశ యావత్స్యాద్వార్షికం దినం॥ తావద్రక్షా త్వయా కార్యా త్వద్భక్తస్య నమోస్తు తే॥

తా॥ ఓ స్వామీ! వ్రతమునకు విఘ్నముకలిగించెడి కామము క్రోధము మొదలగు దుర్గుణములు నాకు కలుగక నీయుకును యిది మొదలు సంవత్సరము పూర్తి అగుపర్యంతము నీవు నన్ను రక్షింపుము నీకు నమస్కారము చేసెదను,

శ్లో॥ దేవం సంప్రార్థ్య కలశే పాత్రే వేణుమయే శుభే। సంస్థితస్య పవిత్రస్య కుర్యాత్ప్రార్థనమాదృతః। సంవత్సరకృతార్చాయాః పవిత్రీకరణాయ భోః॥ విష్ణులోకాత్పవిత్రాద్య ఆగచ్ఛేహ నమోస్తు తే॥

తా॥ యీ ప్రకారము దేవతను ప్రార్థించి వెదురుచే నిర్మింపబడిన శోభస్కరమగు పాత్రయందుంచబడిన పవిత్రము నిట్లు ప్రార్థించవలెను, ఓ పవిత్రమా నేను సంవత్సరపర్యంతము చేసిన పూజను పవిత్రము చేయుటకు నీవు విష్ణులోకమునుండి వచ్చితివి నీకు నమస్కారము,

శ్లో॥ విష్ణుతేజోద్భవంరమ్యం సర్వపాపప్రణాశనం । సర్వకామప్రదం దేవ తవాంగేధారయామ్యహమ్॥

తా॥ ఓ స్వామీ! విష్ణు తేజస్సువలన కలిగినదియు మనోహర మయినదియు సమస్తపాపములను పోగొట్టునదియు సమస్తకోరికల నొసగునదియు యీ పవిత్రము నీశరీరమందుంచెదను,

శ్లో॥ ఆమంత్రితోసి దేవేశ పురాణపురుషోత్తమ । అతస్త్వాం పూజయిష్యామి సాన్నిధ్యంకురు తేనమః । నివేదయామ్యహం తుభ్యం ప్రాతరేతత్పవిత్రకమ్॥

తా॥ ఓ స్వామీ నారాయణమూర్తీ! నిన్ను పూజించుట కొఱకు ఆవాహన చేసితిని కావున నీకు నమస్కారము చేసెదను వాకు ప్రత్యక్షమగుము ప్రాతఃకాలంబున యీ పవిత్రమును నీకు నర్పణచేసెదను,

శ్లో॥ తతఃపుష్పాంజలిందత్వా రాత్రౌజాగరణంచరేత్ । ఏకాదశ్యామధివస్య ద్వాదశ్యామర్చయేద్బుధః॥

తా॥ అనంతరం పుష్పాంజలినిచ్చి యారాత్రి జాగరణ చేయవలయును ఇట్లు ఏకాదశినాడు ఆవాహనచేసి ద్వాదశినాడుదయంబున తిరిగి పూజింపవలెను,

శ్లో॥ గంధదూర్వాక్షతైర్యుక్తం సమాదాయపవిత్రకమ్। దేవదేవనమస్తుభ్యం గృహాణేదంపవిత్రకం ॥ పవిత్రీకరణార్థాయ వర్షపూజాఫలాయచ॥

తా॥ గంధం గరికెలు అక్షతలు మొదలగు వానితో నలంకరింపబడిన పవిత్రమును పుచ్చుకొని ఓ స్వామీ! నన్ను పవిత్రమును చేయుటకును సంవత్సరపర్యంతము నే చేసిన పూజ సఫలమగుటకును నే నర్పణచేయు నటువంటి పవిత్రమును గ్రహింపుము,

శ్లో॥ పవిత్రంమాంకురుష్వాద్య యన్మయాదుష్కృతంకృతం। శుద్ధోభవామ్యహం దేవ త్వత్ప్రసాద్సురేశ్వర । మూలసంపుటితైర్మంత్రైరేతైర్దద్యాత్పవిత్రకమ్॥

తా॥ ఓ స్వామీ ! నేనుచేసిన పాపములను పోగొట్టి నన్ను పవిత్రునిగాచేయుము, ఓ దేవతా సార్వభౌమా ! నీయనుగ్రహము వలన పరిశుద్ధుడ నగుదును అని

ప్రాధిగాంచి మూల బీజాక్షరములతో సంపుటి చేయబడిన మంత్రములతో పవిత్ర
మును స్వామికి నర్పణచేయవలెను,

శ్లో॥ మహానైవేద్యకం దత్వా నీరాజ్య ప్రార్థయేత్తతః।
మూలమంత్రేణజుహుయాత్ ద్వహస్నాన్సఘృతపాయసమ్ ॥

తా॥ మహానైవేద్యము నీరాజనము మొదలగునవి జరిపి పిమ్మట నగ్నిహోత్ర
మునందు మూల మంత్రముతో నెయ్యి పరమాన్నము మొదలగు వానిని హోమము
చేయవలయును,

శ్లో॥ విసర్జయిత్వామంత్రేణ చానేన వపవిత్రకం। సాంవత్స
రీంశుభాంపూజాం సంపాద్యవిధివన్మమ ॥ వ్రజేదానీంపవిత్రత్వం విష్ణు
లోకంవిసర్జితం। ఉత్తార్యబ్రాహ్మణేదద్యాత్ తోయేవాథవిసర్జయేత్ ॥
ఏతత్తేకథితంవత్స పవిత్రారోపణంహరేః। ఇహలోకేసుఖంభుక్త్వా అంతే
వైకుంఠమాప్నుయాత్ ॥

తా॥ యీ మూలమంత్రంతో నీ పవిత్రమునకు నుద్వాసన చెప్పి ఓపవిత్రమా
సంవత్సరపర్యంతం నీచేసినపూజను సఫలమగునట్లు చేసితివి నీవిప్పుడు విష్ణులోకము
నకు వెళ్లుము అనిచెప్పి యా పవిత్రమును తీసి బ్రాహ్మణునికై నియ్యవలయును లేక
యుదకంలోనైనా విడువ వలయును యీ విధముగ విష్ణుని గురించిన పవిత్రారో
పణ వ్రతమును నీకు జెప్పితిని యీ వ్రతమును చేసినా రిహలోకమున సుఖముల
నొంది యనంతరం మోక్షమునొందుదురు అని సనత్కుమారమునీశ్వరునితో సాంబ
మూర్తి చెప్పెను,

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణమాస మాహాత్మ్యే ఉభయైకాదశీవ్రతకథనం
ద్వాదశీ వ్రతకథనంనామ ఏకోనవింశో
ధ్యాయః సమాప్తః.

---

## అథ వింశోఽధ్యాయ ప్రారంభః.

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ త్రయోదశీదినేకృత్యం కథయామితవాగ్రతః। అత్రానంగః పూజనీయో షోడశై రుపచారకైః॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ సనత్కుమారా! త్రయోదశీదినమందు చేయుదగిన విధానమును చెప్పెదను వినుము ఈ త్రయోదశీతిథియందు షోడశోపచారములచే మన్మథుని పూజింపవలయును.

శ్లో॥ అశోకైర్మాలతీపుష్పైః పద్మైర్దేవప్రియైస్తథా। కౌసుంభైర్బకులైః పుష్పైస్తథాన్యైరపిమాదకైః॥ రక్తాక్షతైః పీతగంధైర్ద్రవ్యైస్సౌగంధికైశ్శుభైః। పుష్టిదాజనకైర్ద్రవ్యై రేతోవృద్ధికరైః పరైః॥

తా॥ అశోకపుష్పములు, మాలతీపుష్పములు, పద్మములు, దేవప్రియపుష్పములు, కుంకుమపువ్వులు పొగడపుష్పములు, మఱియు మత్తుకలిగించెడు నితర పుష్పములు, ఎఱ్ఱని యక్షతలు, పచ్చనిగంధములు, శోభస్కరమగు సుగంధద్రవ్యములు, ఒలకరమగు ద్రవ్యములు, రేతస్సును వృద్ధి చేసెడు నితర ద్రవ్యములు, పొందలగువానిచే మన్మథుని పూజించవలయును.

శ్లో॥ నైవేద్యమర్పయేచ్చైవ తాంబూలం ముఖరోచకమ్। తాంబూలేయోజయేద్ద్రవ్యం చిక్కణంక్రముకంశుభం॥ ఖాదిరంచూర్ణకంజాతి త్వచంజాతిఫలంతథా। లవంగైలానారికేళ బీజస్యశకలంలఘు॥ స్వర్ణవర్ణాన్యాణిపాత్రాణి కుర్పూరం కేసరంతథా। జాతానిమగధేదేశే నాగవల్లీదళానిచ॥ శ్వేతవర్ణానిపక్వాని జీర్ణానిచదృఢానిచ। రక్తయుక్తానిదేయాని ప్రీతయేశంబరద్విషః॥

తా॥ అనంతరము నైవేద్యము చేయవలయును పిమ్మట తాంబూలము నివ్వవలయును, తాంబూలములో నుంచు ద్రవ్యము లేవియనగా చిక్కని పోకచెక్కలు, కవిరియుండలు, జాజిపత్రి, జాజికాయలు, లవంగములు, ఏలకులు, యెండినకొబ్బరి యొక్క చిన్నచిన్నముక్కలు, పచ్చకర్పూరము కుంకుమపువ్వు, మగధదేశమందు పుట్టినటువంటివియు బంగారువంటి వర్ణముకలవిగాని, తెల్లనివర్ణముకలవిగాని, యెర్రగా నుండునవి గాని, మృదువయినవియు దృఢమగు తమలపాకులతో కూడ తాంబూలమును ముఖమునందు సువాసన కొఱకునియ్యవలయును.

శ్లో॥ మాక్షికమలసారేణ నిర్మితాభిశ్చవర్తిభిః । నీరాజయేచ్చిత్రభవం పుష్పాంజలిముదార్పయేత్॥

తా॥ మైనముతో నిర్మింపబడిన వత్తులతో మన్మథునకు దీపమునిచ్చి పిమ్మట పుష్పాంజలులను సమర్పింపవలయును.

శ్లో॥ ప్రార్థయేన్నామభిస్తస్య తాని తేకథయామ్యహం।సర్వోపమానసౌందర్యః ప్రద్యుమ్నాఖ్యోహరేస్సుతః॥

తా॥ ఆమన్మథుని నామములను స్మరించుచు ప్రార్థన చేయవలయును కావున ఆమన్మథుని నామములను నీకు చెప్పెదను సమస్తమైనవారికంటె నధికమగు సౌందర్యము కలవాడును విష్ణుమూర్తి కుమారుడును ప్రద్యుమ్నుడను పేరుగల మన్మథుడు నన్నురక్షించుగాక,

శ్లో॥ మీనకేతనకందర్ప కానంగామన్మథస్తథా । మారఃకామాత్మసంభూతో ఝషకేతుర్మనోభవః॥

తా॥ మీనకేతన, కందర్ప, అనంగ, మన్మథ, మార, కామ, ఆత్మసంభూత, ఝుషకేతు, మనోభవ, అను నామములచే జెప్పబడు మన్మథుడు నన్నురక్షించుగాక.

శ్లో॥ రతిపీనఘనోత్తుంగస్తనయోఃపత్రవల్లికా । యస్యవక్షసికస్తూర్యా శోభతేపరిరంభణాత్॥

తా॥ రతీదేవి నాలింగనము చేసినప్పుడు వలన యామెయున్నతమగు కుచము లందు కస్తూరిచే నలంకరింపబడిన మకరికాపత్రరచనలు మన్మథుని వక్షస్థలంబునందు చిహ్నితములైనవి అట్టిమనోహరుడగు నన్నురక్షించుచుండుగాక.

శ్లో॥ పుష్పధన్వాశంబరారే కుసుమేషోరతేఃపతే। మకరధ్వజపంచేషో మదనస్మరసుందర॥

తా॥ పుష్పములు ధనస్సుగాగలవాడును, శంబరాసురునకుశత్రువును,పుష్పములు బాణములుగా గలవాడును, రతీదేవికి పెనిమిటియు, మకరము ధ్వజముగా గలవాడును, అయిదు పుష్పములు బాణములుగా గలవాడును, సుందరుడునగు మన్మథుడు నన్నురక్షింపుచుండుగాక.

శ్లో॥ దేవానాంకార్యసిద్ధ్యర్థం శివక్షిప్తహుతాశన । పరోపకారసీమానం ధ్వనయన్స్వేనకర్మణా॥

తా॥ దేవతల యొక్క కార్యమును సాధించుటకు నీవు సాంబమూర్తి యొక్క తపోవిఘ్నము చేయగా నిన్నతఁడు తృతీయనేత్రాగ్నిచే భస్మము చేసెను కావున నీవు చేయునట్టి కృత్యములన్నియు పరోపకారమునకే చెప్పుచున్నవి.

శ్లో॥ నిమిత్తమాత్రం విజయే వసంతస్సహాయతా। త్వన్మనో రంజనే శక్ర స్తిష్ఠత్యేవ దివానిశి॥

తా॥ నీకు యుద్ధమునందు వసంతుడు సహాయుడను మాటమాత్రమే గాని నీవు స్వయముగానే జయింపగలవాడవు నీ మనస్సును సంతోషపెట్టుటయందు దేవేంద్రుడు రాత్రింబగలును ప్రయత్నము చేయుచుండును,

శ్లో॥ స్వపదభ్రంశనేనాపి స్మర తపస్విభ్యో బిభేతి సః। త్వయి సన్యస్యం భునాకోన్యో విరుధ్యద్ధమానసః॥

తా॥ ఎండకలనగా ఎవరైనను కఠినమగు తపస్సుచేయగా తనయింద్రపదవిని కోరుదురనే భయముచే వారి తపోవిఘ్నము చేయుటకు యెల్లప్పుడు నీ సహాయమును కోరుచుండును నీకంటె నితరమగు మతిరొకడు ధైర్యముకలవాడయి యొకడు సాంబమూర్తితో విరోధము పెట్టుకొనగలవాడగునా,

శ్లో॥ పరబ్రహ్మానందసమానంద ద స్త్వద్రుతేత్రకః। మహామోహాస్త్రసైన్యేషు త్వాదృశః కో న్వివీర్యవాన్॥

తా॥ బ్రహ్మానందముతో సమానమగు ఆనందమును కలిగించుటయందు నీకంటె నితరుడెవడును లేడు ప్రపంచమును మోహింపచేయునట్టి సేనలలో నీతో సమానమగు పరాక్రమము కలవాడు లేడు,

శ్లో॥ అనిరుద్ధపితా కృష్ణాత్మజో యశ్చసురప్రభుః। మలయాచల సంభూత చందనాగురువాసితః॥

తా॥ అనిరుద్ధునకు తండ్రియు కృష్ణమూర్తి కుమారుడును దేవతలకు ప్రభువును మలయపర్వతమువలన పుట్టినమంచిగంధము అగరు మొదలగు వానిచే పరిమళించువాడవునై యుంటివి.

శ్లో॥ దక్షిణదిఙ్మాతరిశ్వా సహాయస్తే జగజ్జయే। శరత్సుధాంశుస్మిత్ర జగత్సర్జనకారణ॥

తా॥ శరత్కాల చంద్రుడు సహాయముగాకలవాడును ప్రపంచోత్పత్తికి కారణుడైనగు వోమన్మథుడా! ప్రపంచమును జయించుటయందు మలయమారుతము నీకుసహాయము,

శ్లో॥ నాథత్వదస్త్రం పరమ మమోఘమతిదూరగమ్ । మర్మచ్ఛిదామకరుణం రహితం ప్రతికారతః॥ సుకుమారం శ్రుతమపి నిస్సీమక్షోభకారణమ్। స్వతుల్యస్య పదార్థస్య దర్శనాదపిసాధకమ్॥

తా॥ ఓ స్వామీ ! నీయొక్క బాణము మిక్కిలి గొప్పదియు వ్యర్థము కానిదియు మిక్కిలి దూరప్రదేశమునకైనను వెళ్లునదియు వెంత మాత్రమును దయ లేకుండా మర్మములను నొప్పించునదియు నెచ్చటను అడ్డు లేనిదియు మృదువైనను తన పేరును వినినంత మాత్రముననే యమితమగు మనోవ్యాధిని కలగించు నదియు తనకు సమానమగు పదార్థమును చూచినంత మాత్రముననే పొందుటకు సాధనమయి యుండును,

శ్లో॥ ప్రవృత్తిముఖ్యాలంకార స్సహాయేనజగజ్జయే। సర్వేశ్రేష్ఠాస్త్వయా దేవా ఉపహాస్యాః కృతా విభో॥

తా॥ ప్రపంచమును జయించుటకు మనుష్యుల యొక్క అలంకారమే నీకు ముఖ్యమగు సాధనము ఓ ప్రభువా ! గొప్పవారగు సమస్తమైన దేవతులను నీవు పరిహరించుచున్నావు-

శ్లో॥ బ్రహ్మకన్యాలంపటోభూ ద్బృందాసక్తోహరిస్స్మరః । పరదారకళంకేన అస్పృష్టవ్యశ్శివోయతః॥ స్వశక్త్యామేవనిరతోబహుకాలంవ్యవాయవాన్। దుష్కర్మనిరతశ్చేంద్రో గౌతమస్యవధూంప్రతి। ద్విజరాజోగురోర్భార్యాం బలాదేవాపహారవాన్ । విశ్వామిత్రిస్తపో భ్రష్టః కింకింనాకారిభూయసః॥

తా॥ నీకు అందరును లోబడిరి అదియేవిధముగా ననగా బ్రహ్మదేవుడు తన కూతురుయందు వాంఛగలవాడాయెను, విష్ణుయూతిఁ బృందయందు స్త్రీయందా సక్తిగలవాడాయెను, సాంబమూర్తిఁ పరభార్యా రతుడగుట వలననే ఆయనను స్పృశింపగూడదనిరి, మఱియు తనశక్తియందే బహుకాలము సంభోగము చేసెను, దేవేంద్రుఁడు దుష్టప్రవర్తన కలవాడయి గౌతమమునీశ్వరుని భార్యతో సంభోగించెను, ద్విజులకురాజు అని చెప్పబడుచుండెడి చంద్రుడును తనగురువగు బృహస్పతియొక్క భార్యను బలాత్కారముగానే తీసుకొని వెళ్లెను, విశ్వామిత్రమునియు అనేకపర్యాయములు తపోభ్రష్టుడై యెట్టిదుష్కృత్యములుచేయలేదు-

శ్లో॥ ఉక్తాః ప్రాధాన్యత స్తేతే కిం బహూక్తేన మానద। విరలా స్సంతి లోకేస్మిన్ బ్రహ్మణా వశవర్తినః॥

తా॥ ఓ మన్మథుడా! యీ మొదలగు వారిని కొందరిచే ముఖ్యులను వారిని చెప్పితిని, విశేషము గా చెప్పవలయునని సమితియే లేదు కావున నీ పుష్పబాణములకు లోబడక జితేంద్రియులగువారు కొంచెముగానే యుందురు.

శ్లో॥ తస్మాత్ప్రసీద భగవాన్ కృత పూజా మయా । పూజితశ్చ్రావణే శుక్ల త్రయోదశ్యాం మనోభవః ॥ ప్రవృత్తిలం పటస్యాతి వీర్యం పుష్టిం దదాత్యసౌ।నివృత్తిమార్గనియత స్స్వవికారం హరత్యపి॥

తా॥ ఓ స్వామీ! అందువలన నేజేసిన యీ పూజచే నీవునన్ను అనుగ్రహింపుము శ్రావణశుక్లత్రయోదశియందు మన్మథునిపూజించినయెడల ప్రవృత్తిమార్గము నందు కోరికగలవానికి వీర్యమును బలమునిచ్చుచున్నాడు, అపేక్షారహితునకు వికారములను పోగొట్టుచున్నాడు.

శ్లో॥ సకామస్య స్త్రియో రమ్యా పీనోత్తుంగపయోధరాః। శరత్పూర్ణసుధారశ్మి వదనాః కమలేక్షణాః॥ లంబాతినీలకురళ స్నిగ్ధకేశ్యస్సునాసికాః।రంభోర్వ్యాగుప్తగుల్ఫాచ గతినిర్జితకుంజరాః॥ కామాగారజితాశ్వత్థ పలాశా అతిశోభనాః। బృహచ్ఛ్రోణ్యః కంబుకంఠ్యో బృహజ్జఘనశోభితాః॥ బింబోష్ఠ్యః సింహకట్యశ్చ నానాలంకారభూషితాః। మనోరమా దదాత్యేష సంతుష్టశ్చ్రావణేర్చయా ॥

తా॥ కోరికలు గలవాడై మన్మథుని శ్రావణమాసములో పూజించినయెడల మన్మథుడు సంతోషించినవాడై యున్నతమగు కుచములు కలవారును, శరత్కాలమునందు సంపూర్ణుడగు చంద్రుని వంటి ముఖము గలవారును, పద్మమువంటి నేత్రములు కలవారును, పొడవైన మృదువగు నల్లని వెంట్రుకలు ముంగురులు కలవారును, చక్కని ముక్కు కలవారును, అరటి స్తంభములవంటి తొడలు కలవారును, రమ్యమగు పిక్కలు కలవారును, ఏనుగు నడకలను మించిన నడక గలవారును,రమ్యములగు రావియాకులవంటి యోనులుకలవారును, పెద్దపిఱుదులు కలవారును శంఖమువంటి కంఠము కలవారును, చక్కని తొడలచే ప్రకాశించువారును, దొండపండువంటి అధరోష్ఠము కలవారును, సింహమధ్యమువంటి నడుముకలవారును,అనేకమగు అలంకారములచే ప్రకాశించువారును, మనోహరులగు స్త్రీలను భార్యలనుగా సమకూర్చును.

శ్లో॥ శుక్లపక్షేత్రయోదశ్యాం దదాతిచసుతాన్ బహూన్। చిరాయుషోగుణాఢ్యాంశ్చ సుఖరూపాన్ సుసంపదః॥

తా॥ మఱియు శుక్లపక్ష త్రయోదశియందు పూజించినయెడల చిరకాలం జీవించువారును, మంచిగుణములు కలవారును, సుందర రూపులును, యోగ్యులునగు అనేక పుత్రుల నొసగువాడగును.

శ్లో॥ కర్తవ్యంయత్త్రయోదశ్యా మేతత్తేకథితంశుభం। అతఃపరంచతుర్దశ్యాం కర్తవ్యంశృణుమానద॥

తా॥ ఓ మన్మథుడా! త్రయోదశియందు చేయతగినదియు శుభప్రదమగు కృత్యము చెప్పితిని, యికముందు చతుర్దశియందు జేయతగిన కృత్యము చెప్పెదను.

శ్లో॥ అష్టమ్యాంకథితందేవ్యాః పవిత్రారోపణంతవ। తత్రచే న్నకృతంతర్హి చతుర్దశ్యాంతుకారయేత్॥

తా॥ ఓ మునీశ్వరుడా! అష్టమియందు దేవిని గుఱించి పవిత్రారోపణవ్రతము చెప్పితిని అప్పుడు ఆవ్రతము చేయకుండి నట్లయిన యెడల చతుర్దశియందు చేయవలయును.

శ్లో॥ పవిత్రంతుత్రినేత్రస్య చతుర్దశ్యాంసమర్పయేత్। పవిత్రసాధనంసర్వం దేవీవిష్ణుపవిత్రవత్॥

తా॥ చతుర్దశియందు చేసినప్పుడు సాంబమూర్తికి పవిత్రము నర్పించవలయును పవిత్రవిధాన మంతయు దేవిని గుఱించియు విష్ణుని గుఱించియు చెప్పిన విధముగానే జరుపవలయును-

శ్లో॥ ఊహఃపరంప్రకర్తవ్యః ప్రార్థనాదిషునామసు। శైవాగమేషుయత్ప్రోక్తం జాబాలాదిషుయత్పరం।

తా॥ ప్రార్థనాదులయందు చెప్పతగిన నామముల విషయమై శైవశాస్త్రములయందు జాబాలాదులచే జెప్పబడిన గ్రంథములందునున్న రీతిగానుమఱియు వాటికి ననుసరణగాతననుగలిగిన యూహప్రకారముగాను కల్పనచేసిచెప్పవలెను-

శ్లో॥ వికల్పాత్కశ్చిదత్రేహ విశేషస్తంవదామితే। ఏకాదశాథవానూత్రైః త్రింశతాచాష్టయుక్తయా॥ పంచాశతావాకర్తవ్యం తుల్యగ్రంథ్యంతరాలకం। ద్వాదశాంగుళమానాని తథాచాష్టాంగుళా

నిచ॥ లింగవిస్తారమానాని చతురంగుళికానివా । అర్చయేచ్ఛివతుష్ట్యర్థం విధిఃపూర్వోక్తఏవహి॥

తా ॥ యిక్కడ కొంచెము విశేషముకలదు దానిని చెప్పెదను వినుము పదకొండు పోగులుగాని ముప్పది యెనిమిది పోగులుగాని యేబది పోగులుగాని పవిత్రమునకు పోయవలయును. ముడులు సమాన యెడము కలుగునట్లుగానే ముడివేయవలయును పండ్రెండు అంగుళములు గాని యెనిమిది అంగుళములు గాని నాలుగంగుళములుగాని పొడవుయుండునట్టి లింగమును పూజింపవలయును శివుని సంతోషముకొఱకు పూజావిధియంతయు పూర్వము చెప్పబడిన రీతిగానే చేయవలయును -

శ్లో॥ ఫలాదిపూర్వమేవోక్తం మంతైశ్లైలాసమాప్నుయాత్ ।
ఏతత్తేకథితంవత్స కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి॥

తా॥ ఓ చిన్నవాడా! దీనికి కలుగు ఫలమంతయు పూర్వము చెప్పబడినవిధముగానే కలుగును కాఁబట్టి యిదియంతయు నీకు చెప్పితిని మఱియు నేది యైనను వినుటకు కోరిక కలిగిన యెడల దాని నడుగుము చెప్పెదను అని సాంబమూర్తి సనత్కుమారునితో చెప్పెను-

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాసమాహాత్మ్యే ఈశ్వర సనత్కుమారసంవాదే త్రయోదశీవ్రత చతుర్దశీ వ్రత కధనంనామ వింశోధ్యాయ

స్స మా ప్తః.

---

ఏకవింశోఽధ్యాయ ప్రారంభః.

సనత్కుమారఉవాచ॥ శ్లో॥ పౌర్ణమాస్యా విధింబ్రూహి కృపాంకృత్వాదయానిధే। మాహాత్మ్యంశ్రోతుంస్వామిన్ శ్రవణేచ్ఛాప్రవర్ధతే॥

తా ॥ దయ కుమగుంచదశకు ఓసాంబమూర్తీ, శ్రావణశుద్ధ పౌర్ణమియందు చేయతగిన కృత్యమును నాయందు దయగలవాడవై చెప్పుము నాకు వినవలయునని ఆసక్తి కలిగియున్నదని సనత్కుమారుండు సాంబమూర్తి నడిగెను-

ఈశ్వర ఉవాచ ॥ శ్లో ॥ ఉత్సర్జనముపాకర్మ అధ్యాయానాం భ సేదిసం । పౌషపూర్ణాయాం మాఘపూర్ణాయాం అథవోత్సర్జనేతిథిః ॥

తా ॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, అభ్యసించిన వేదములకును ఉపాకర్మయు ఉత్సర్జనయు చెప్పబడెను ఈ పుష్యపౌర్ణమి గాని మాఘపౌర్ణమి గాని ఉత్సర్జన కాలము చెప్పబడెను కావున అట్టి తిథియందయినను చేయవలెను

శ్లో ॥ పౌషస్యప్రతిపద్వాపి మాఘమాసస్యవాభవేత్ । యుతం వారోహిణీసంజ్ఞ ముత్సర్జనకృతాభవేత్ ॥

తా ॥ లేక పుష్యమాస పాడ్యమిగాని మాఘమాస పాడ్యమిగాని చెప్పబడిన తిథియై యుండెను లేక రోహిణీ నక్షత్రయుక్త తిథియందైనను చేయవలెను-

శ్లో ॥ అథవాన్యేషు కాలేషు స్వస్వశాఖానుసారతః । సహాప్రయోగోయుక్తస్సా దుత్సర్గప్రకృతిద్వయే ॥

తా ॥ లేక వారివారి శాఖల ననుసరించిన కులాచార ప్రకారముగా ఉపాకర్మయును ఉత్సర్జనయును ఒక్కసారి గానే చేయుట యాచారము గూడ కలిగియుండి యున్నది-

శ్లో ॥ అతోనభః పౌర్ణమాస్యా ముత్సర్జన మిహేష్యతే । ఉపాకర్మణిచైవంస్యా చ్ఛ్రవణర్క్షంతుబహ్వృచామ్ ॥

తా ॥ అందువలన ఈశ్రావణమాస పౌర్ణమియందే ఉపాకర్మయును ఉత్సర్జనయును చెప్పబడెను వాజసనేయిశాఖ ననుసరించిన వారికి ఉపాకర్మనుగురించి శ్రవణ నక్షత్రము చెప్పబడెను-

శ్లో ॥ చతుర్దశ్యాంపౌర్ణమాస్యాం ప్రతిపద్దివసేపివా । యుత్రివాశ్రవణర్క్షంస్యా ద్బహ్వృచానాంతుతద్దినే ॥

తా ॥ శ్రావణమాసములో చతుర్దశి పౌర్ణమి పాడ్యమి ఈ మూడు తిథులలో శ్రవణ నక్షత్రయుక్త తిథియందు వాజసనేయి శాఖీయులు ఉపాకర్మ చేయుదురు-

శ్లో॥ యజుషాంపౌర్ణమాస్యాంస్యా త్సామగానాంతుహ స్త భే। శుక్రగుర్వోర స్తమయె ఉపాకర్మచరేత్సుఖం ॥ ఆరంభఃప్రథమో నస్యా దితిశాస్త్రవిదాంమతమ్ । గ్రహసంక్రాంత దుష్టేతు కాలేకా లాంతరేభవేత్ ॥

తా ॥ యజుశ్శాఖీయులు శ్రావణపౌర్ణమి యందు చేయుదురు సామవేదా వలంబులు శ్రావణమాసములో హస్తానక్షత్రముతో గూడిన తిథియందు చేయుదురు- గురుశుక్ర మౌఢ్యములయందును చేయుదురు- మొదటగా నుపాకర్మ మౌఢ్యములలో చేయ గూడదని శాస్త్రవేత్తల యభిప్రాయము మఱియు పౌర్ణమి గ్రహణము సంక్రాంతి మొదలగు వానిచే దోషముగలదగునేని యీ దినము విడిచి మఱియొక కాలమునందు చేయవలెను-

శ్లో ॥ పంచమ్యాం హస్తయుక్తాయాం పూర్ణిమాయాంవాసభ స్యకే। స్వస్వగృహ్యానుసారేణ ఉత్సర్జనముపాకృతిః॥

తా॥ శ్రావణమాసములో హస్తానక్షత్రయుక్త పంచమియందు గాని పౌర్ణమియందు గాని తమ తమ శాఖల ననుసరించి యుపాకర్మయు ఉత్సర్జనయు చేయవలయును-

శ్లో॥ మలమాసేతుసంప్రాప్తే శుద్ధమాసితుసాభవేత్ । నిత్యం కర్మద్వయంచేదం ప్రత్యబ్దంనియమాచ్చరేత్ ॥

తా॥ శ్రావణమాసము అధికమాసము వచ్చేని శుద్ధశ్రావణ మాసములోనే ఉపాకర్మ చేయవలయును, ఉపాకర్మయు ఉత్సర్జనయు ననెడు రెండుకర్మలును ప్రతిసంవత్సరమును ముఖ్యముగా చేయతగినవి-

శ్లో॥ ఉపాకర్మసమాప్తౌతు సంస్థితేషుద్విజాతిషు। అర్పణీయస్స దాదీపో యోపిద్భి స్తత్రసంసది॥

తా ॥ ఉపాకర్మను పూర్తిచేసి బ్రాహ్మణులు కూర్చుండి యుండగా నప్పు డా సభయందు స్త్రీలు దీపదానం చేయవలెను-

శ్లో ॥ ఆచార్యఃప్రతిగృహ్ణాతి దీపందద్యాద్ద్విజాతయే । సౌవ ర్ణేరాజతేవాపి పాత్రేతామ్రమయేపివా ॥ ప్రస్థమాత్రంతు గోధూ మాన్ దీపంతత్పిష్టసంభవమ్ । దీపపాత్రంసంవిధాయ జ్వాలయేత్తత్ర దీపకమ్ ॥

తా॥ బంగారము వెండి రాగి మొదలగు వానిచే నిర్మింపబడిన పళ్లెములో శేర గోధుమలనుంచి దానిపైని గోధుమపిండితో చేయబడిన ప్రమిదయందుదీపము వెలిగించి యాగోధుమలపైనుంచి దీపముతోగూడ యీ పళ్లెమును ఆచార్యుడు గ్రహించుగాకయని చెప్పి బ్రాహ్మణునకు దానమియ్యవలెను.

శ్లో॥ ఆజ్యేనవాదత్తైలేన వర్తిత్రయసమన్వితమ్ । సదక్షిణం సతాంబూలం బ్రాహ్మణాయనివేదయేత్॥

తా॥ నెయ్యిగాని నూనెగాని యుంచి మూడు వత్తులుగల దీపమును వెలిగించి దక్షిణ తాంబూలములతో గూడ ఆ దీపమును బ్రాహ్మణునకు దానమియ్యవలయును-

శ్లో॥ దీపంసంపూజ్యవిప్రంచ మంత్రమేత ముదీరయేత్ । సదక్షిణసతాంబూల స్సభాదీపోయముత్తమః॥ అర్పితో దేవదేవస్య మమసంతుమనోరథాః। సభాదీపప్రదానేన పుత్రపౌత్రాదికంకులమ్॥ సర్వం హ్యుజ్జ్వలతాంయాతి వర్ధతేయశసాసహ। స్వర్గంగనాభిస్సదృశంరూపంజన్మాంతరేలభేత్॥ సౌభాగ్యంచైవలభతే భర్తుఃప్రియతరాభవేత్। ఏవంకృత్వాపంచవర్షాం తతఉద్యాపనంచరేత్॥

తా॥ దీపమును వెలిగించి యాదీపమును బ్రాహ్మణుని పూజించి యిట్లుచెప్పవలయును, దక్షిణతాంబూలముల సహితముగా శ్రేష్ఠంబగు ఈదీపమును భగవత్స్వరూపుండగు బ్రాహ్మణునకు యిచ్చుచున్నాను నాకోరికలన్నియు సఫలములగుగాకయని చెప్పి దీపదానము చేయవలయును- యిట్లు సభాదీపదానము చేయుట వలన పుత్రులు పౌత్రులు మొదలగు వానితోగూడిన వారలై వారివంశమంతయు కీర్తిచేతను సమస్త సద్గుణములచేతను ప్రకాశించునట్టిదగును - ఆస్త్రీలకు మఱియొక జన్మంబున దేవతా స్త్రీలతో సమానమగు సౌందర్యము కలుగును చిరకాలము సువాసినీత్వము పెనిమిటికి ప్రేమతోగూడిన ప్రియురాలుగా నుండును యిట్లు అయిదు సంవత్సరము లీప్రకారముగా చేసి పిమ్మట నుద్యాపనము చేయవలెను-

శ్లో॥ విప్రాయదక్షిణాందద్యా ద్యథాశక్త్యాచభక్తితః । సభాదీపస్యమాహాత్మ్య మేతత్తేకథితంశుభమ్॥

తా॥ భక్తికలది యగుచు బ్రాహ్మణునకు తనశక్తి కొలదియు దక్షిణనియ్యవలయును ఓ మునీశ్వరుఁడా! ఇట్టి ఫలము నొసగునది కావున శ్రేయస్కరమగు దీని మహిమనంతయు జెప్పితిని-

శ్లో॥ శ్రోణాశాకర్మసంస్థాచ తస్యామేవనిశిస్మృతా ఉపస్తరంసర్పబలి స్తత్రైవ విధీయతే॥

తా॥ శ్రవణా నక్షత్రము నందుంచిన కర్మయు నా రాత్రియే చేయవలయును పిమ్మట నచ్చటనే సర్పబలియు జరుపవలెను-

శ్లో॥ ఇదంసంస్థాద్వయంకుర్యా త్స్వస్వగృహ్యానుపేక్ష్యచ। హయగ్రీవస్యావతార స్తస్యామేవతథాస్మృతః॥

తా॥ యీ చెప్పబడిన రెండుకర్మలయొక్క విధానము వారివారి సూత్రము ననుసరించి చేసికొనవలయును ఆతిథియందే హయగ్రీవావతారమనియు జెప్పబడెను-

శ్లో॥ హయగ్రీవజయంత్యాస్తు అతోత్రైవ మహోత్సవః॥ ఉపాసనావతాంతస్య నిత్యంసుపరికీర్తితః॥

తా॥ యీ దినమందు హయగ్రీవావతారము కలుగుట వలననే విశేషమహోత్సవము జరుగుచుండును ఈయుత్సవము హయగ్రీవమంత్రోపాసన కలవారు ముఖ్యముగా చేయుదురు-

శ్లో॥ శ్రావణ్యాంశ్రవణేపూర్వం జాతోహయశిరాహరిః। జగౌసామవేదంతు సర్వకిల్బిషనాశనమ్॥

తా॥ శ్రావణమాసములో శ్రవణానక్షత్రము ప్రవేశించగానే విష్ణుమూర్తి హయగ్రీవుడనే పేరుగలవాడై యుద్భవించి సమస్తపాపములను పోగొట్టునట్టి సామవేదమును గ్రహించెను-

శ్లో॥ సింధూనదీవితస్తాయాం పవిత్రస్తత్రసంగమే। శ్రవణర్క్షేతత్ర స్నానంసర్వార్థసిద్ధిదమ్ ॥

తా॥ సింధూనది సముద్రము సింగమగు చోట హయగ్రీవావతారము కలిగినది కావున శ్రవణా నక్షత్రము వచ్చినప్పుడు ఆతీరంబున స్నానము చేసిన యెడల సమస్త కోరికలు ఫలించును-

శ్లో॥ తత్రసంపూజయేద్విష్ణుం శంఖచక్రగదాధరమ్ । శ్రోతవ్యాన్యథసామాని పూజ్యావిప్రాశ్చసర్వథా॥

తా॥ అక్కడను శంఖము చక్రము గద మొదలగు నాయుధములతో గూడిన విష్ణుమూర్తిని పూజింప వలయును సామవేదమును వినవలయును సమస్త విధముల చేతను బ్రాహ్మణులను పూజింపవలెను-

శ్లో॥ క్రీడితవ్యంచభోక్తవ్యం తత్రైవస్వజనైస్సహ। జలక్రీడా చకర్తవ్యా నారీభిర్భర్తృలబ్ధయే॥

తా॥ అక్కడనే తమబంధువులతోకూడ హయగ్రీవ సంబంధమగు నాటపాట లను జరిపి భుజింప వలయును తిరిగి జన్మమునందు భాగ్యమగు పెనిమిటిని పొంద గలందులకు స్త్రీలు జలక్రీడలు కూడ జరుపవలయును.

శ్లో॥ స్వస్వదేశేస్వస్వగృహే అపికుర్యాన్మహోత్సవమ్। పూజయేచ్చహయగ్రీవం జపేన్మంత్రంచతంశృణు॥

తా॥ మఱియు తమ తమ దేశమునందును తమ తమ గృహముల యందును హయగ్రీవుని పూజించి విశేష మహోత్సవమును గూడ జరుప వలయును, మఱియు మఱియు హయగ్రీవ మంత్రమును గూడ జపింపవలయును కాబట్టి దానిని చెప్పె దను వినుము-

శ్లో॥ ప్రణవాదిభిర్నమశ్శబ్దస్తతోభగవతేఇతి। ధర్మాయచ తుర్థ్యంతం యోజ్యచాత్మవిశోధనమ్॥ పునరంతేనమశ్శబ్దో మంత్రశ్చాష్టాదశాక్షరః। సర్వసిద్ధికరశ్చాయం మన్త్రప్రయోగైకసాధకః॥పురశ్చరణమేతస్య అక్షరాణాంతుసంఖ్యయా।లక్షంవాధసహస్రంవా కలౌతుస్యాచ్చతుర్గుణం॥

తా॥ మొదటగా ప్రణవమును పిమ్మట నమశ్శబ్దము తర్వాత భగవతేధర్మా య శ్రీహయగ్రీవాయ అనియు చివరను తిరిగి నమశ్శబ్దమును చేర్చవలయును ఇట్లు చేర్చగా (ఓం నమో భగవతే ధర్మాయ శ్రీహయగ్రీవాయ నమః) అను నటువంటి అష్టాదశాక్షరములు గల మంత్ర మేర్పడును ఈ మంత్రము సమస్త కార్య సిద్ధులను చేయును వట్ పదమును చేర్చినయెడల ప్రయోగములయందు నుపయోగింపబడును, యీ మంత్రమును అక్షరలక్షగాని యెన్నియక్షరములు కలవో అన్ని వేలుగాని పుర శ్చరణను చేసిన యెడల యీకలియుగములో నాలుగురెట్లు ఫలము కలుగును.

శ్లో॥ ఏవంకృతేహయగ్రీవ స్తుష్టస్సర్వాన్కామాన్ దోభవేత్। ఏత స్యామేవపూర్ణాయాం రక్షాబంధనమిష్యతే॥

తా॥ యీ ప్రకారము చేసినయెడల హయగ్రీవుడు సంతోషించిన వాడై మంచి కోరికల నన్నియు ఫలింప చేయును యీ పౌర్ణమియందునే రక్షాబంధన మను నట్టిదియు జెప్పబడెను-

శ్లో॥ సర్వరోగోపశమనం సర్వాశుభవినాశనమ్ । శ్రూయతాం మునిశార్దూల ఇతిహాసం పురాతనమ్॥

తా॥ ఈ రక్షాబంధన మనునట్టి కర్మ సమస్త రోగములను సమస్తఅశుభములను నివారణ చేయును కావున యో మునీశ్వరుడా! దీనినిగురించి యొక యితిహాసము కలదు దానిని చెప్పెదను వినుము.

శ్లో॥ ఇంద్రాణ్యా యత్కృతం పూర్వ మింద్రస్య జయవృద్ధయే। దేవాసురమభూద్యుద్ధం పురా ద్వాదశవార్షికమ్॥

తా॥ అది యింద్రుని జయము నిమిత్తమై శచీదేవి రక్షాబంధనము చేసినది అది యేవిధముగాననగా పూర్వము దేవతలకును రాక్షసులకును పంద్రెండుసంవత్సరములు యుద్ధము జరిగెను.

శ్లో॥ శక్రిం దృష్ట్వా తదాక్రాంతం దేవీ ప్రాహ సురేశ్వరమ్। అద్య భూతదినం దేవ ప్రాతస్సర్వం భవిష్యతి ॥ అహం రక్షాం విధాస్యామి తేనాజేయో భవిష్యసి। ఇత్యుక్త్వా పౌర్ణమాస్యాం సా పౌలోమీ కృతమంగళా ॥ బబంధ దక్షిణే పాణౌ రక్షాం మోదప్రదాం తతః । బద్ధరక్ష స్తతశ్శక్రః కృతస్వస్త్యయనో ద్విజైః ॥ మదాప్రదానవానీకం క్షణాజ్జిగ్యే పతాపవాన్। వాసవో విజయీ భూతః పునరేవ జగత్త్రయే॥

తా॥ అప్పుడు దేవేంద్రుడు అలసియుండగా వానిభార్య శచీదేవి పెనిమిటిని జూచి యిట్లు పలుకుచున్నది, ఓ నాథా యీదినము భూతముల సంబంధమగు దినము, యీదినమున ఆగినరేపటి రేపు ప్రొద్దుటను అంతయు నీకుజయముకలుగును నేను నీకు రక్షాబంధనమును చేసెదను అందువలన నీవు యితరులచే జయింప బడవు, అని చెప్పి శచీదేవి పౌర్ణమియందు దేవేంద్రునికి మంగళకృత్యములనుచేసి సంతోషమును కలిగించు నట్టి కంకణమును కుడిచేతికి కట్టెను యిట్లు దేవేంద్రుడు కంకణమును కట్టుకొని బ్రాహ్మణులవలన దీవనలనొంది ప్రతాపము కలవాడై తిరిగిరాక్షసులవద్దకు వెళ్లి వారితో యుద్ధముచేయగా ఒకక్షణములోనె వారినోడించి మూడు లోకములను జయించినవాడాయెను.

శ్లో॥ ఏవప్రభావో రక్షయాః కథితస్తే మునీశ్వర । జయదస్సుఖదశ్చైవ పుత్రారోగ్యధనప్రదః॥

తా॥ ఓ మునీశ్వరుడా! శ్రావణ రక్షాబంధనము ఇటువంటి సామర్థ్యము కలదియేగాక మఱియు జయమును సుఖమును పుత్రులను ఆరోగ్యమును ధనమును కలుగఁ జేయును.

సనత్కుమారఉవాచ॥ శ్లో॥ క్రియతే కేనవిధినా రక్షాబంధస్సురోత్తమ। కస్యాంతిథౌ కదా దేవ ఏతన్మేన కృపాకర॥

తా॥ ఓ స్వామీ ఏతిథియందు ఏకాలంబున ఏవిధిగా రక్షాబంధనము చేయవలయునో దానిని చెప్పుము.

శ్లో॥ యథాయథాహిభగవ న్విచిత్రాణిప్రభాషసే। తథాతథా నమేతృప్తి ర్బహ్వర్థాశ్శృణ్వతః కథాః॥

తా ॥ ఓ భగవంతుడా! అనేక అర్థములు కలవియు ఆశ్చర్య కరములగు కథలను నీవు చెప్పుచుండగా వానిని వినుట వలన నాకు యెంత వరకును తృప్తి కలుగుటలేదని సనత్కుమారుడు చెప్పెను.

ఈశ్వరః ॥ శ్లో ॥ సంప్రాప్తే శ్రావణేమాసి పౌర్ణమాస్యాం దినోదయే। స్నానంకుర్వీతమతిమాన్ శ్రుతిస్మృతివిధానతః ॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు ఓ మునీశ్వరా! శ్రావణ మాసములో పౌర్ణమి నాడుదయంబున లేచి శ్రుతిస్మృతుల ననుసరించు నట్లుగా స్నానము చేయ వలయును.

శ్లో॥ సంధ్యాజపాదిసంపాద్య పితౄన్దేవానృషీం స్తథా। తర్పయిత్వాతతః కుర్యా త్స్వర్ణపాత్రవినిర్మితామ్ ॥ హేమసూత్రైశ్చసంబద్ధాం ముక్తాదివిభూషితామ్। కౌశేయతంతుభిఃక్లిన్నై ర్విచిత్రైర్మలవర్జితైః॥ విచిత్రగ్రంధసంయుక్తాం పత్రగుచ్ఛైశ్చరాజితామ్ సిద్ధార్థైశ్చాక్షతైశ్చైవ గర్భితాంసుమనోహరామ్॥ సంస్థాప్యకలశంతత్ర పూర్ణపాత్రేతుతాంన్యసేత్ ॥

తా॥ సంధ్య జపము మొదలగునవి యాచరించి పితృదేవతలు ఋషులు మొదలగువారికి తర్పణచేసి బంగారపు తీగెలతో గూడినదియు ముత్యములు మొదలగువానితో నలంకరింపబడినదియు, నిర్మల మయినదియు, విచిత్రములగు పట్టుదార ముల తోఁగూడినదియు చిగురుటాకులుపుష్పగుత్తులు మొదలగువానిసుంచివిచిత్రముగావూడదులను వేయబడినదియు, తెల్లఆవాలు అక్షతలు మొదలగు వానితో మిశ్రితమయినది

యును, మనోహరమైన కంకణమును ఒక బంగారపు కలశమును బియ్యమును చేయించి దానిపైన యాకంకణమునుంచవలయును.

శ్లో॥ ఉపవిశ్యాసనేరమ్యే సుహృద్భిః పరివారితః। వేశ్యానర్తన గానాది కృతకౌతుకమంగళః॥ తతఃపురోధసాకార్యో రక్షాబంధస్సమంత్రకః ॥ యేనబద్ధోబలీరాజా దానవేంద్రో మహాబలః తేనత్వామను బధ్నామి రక్షేమాచలమాచల॥

తా॥ మనోహరంబగు ఆసనంబున కూర్చుండి తన బంధుమిత్రబ్రాహ్మణ సమేతుడై వేశ్యలు మొదలగువారిచే నృత్యము గీతము వాద్యము మొదలగు మంగళ ధ్వనులు జరుప బడుచుండగా మంత్రసహితముగా పురోహితునిచే రక్షాబంధనమును చేయించుకొనవలయును, అప్పుడు చెప్పవలసిన మంత్రమేదియనగా ఓరక్షా బలవంతుడును రాక్షసశ్రేష్ఠుడగు బలిచక్రవర్తి దేనిచే కట్టబడెనో అట్టినిన్నుకట్టుచున్నాను కావున కదలకుండా నుండుమని చెప్పి కట్టవలెను-

శ్లో॥ బ్రాహ్మణైఃక్షత్రియైర్వైశ్యై శ్శూద్రైశ్చైవాన్యమానవైః। రక్షాబంధఃప్రకర్తవ్యో ద్విజాన్సంపూజ్యయత్నతః ॥

తా॥ బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, మఱియు నితర జాతులు వారు సమస్తమయిన వారును తమతమ శక్తికొలదియు బ్రాహ్మణులను పూజించి రక్షాబంధనం చేయించుకొనవలయును.

శ్లో॥ అనేనవిధినాయస్తు రక్షాబంధనమాచరేత్ । ససర్వదోష రహిత స్సుఖీసంవత్సరంభవేత్॥

తా॥ యీ ప్రకారముగా రక్షాబంధనము చేయించుకొనిన వాడు సమస్త దోషములను పోగొట్టుకొనిన వాడయి సంవత్సర పర్యంతము వఱకును సుఖమును కలిగిన వాడయి యుండును.

శ్లో॥ యశ్శ్రావణే విమలమాసి విధానవిజ్ఞోరక్షా విధానమిద మాచరతేమనుష్యః । ఆస్తేసుఖేనపరమేణ సవర్షమేకం పుత్రైశ్చ పౌత్రసహిత స్ససుహృజ్జనశ్చ॥

తా॥ పవిత్రమగు శ్రావణ మాసములో యీచెప్పబడిన రక్షాబంధన విధిని జరుపుకొనినవాడు సంవత్సర పర్యంతము విశేషమగు సుఖము కలవాడై పుత్రులు పౌత్రులు స్నేహితులు మొదలగు వారితోగూడి సమస్తసుఖముల నొందును.

శ్లో॥ భద్రాయాంచనకర్తవ్యో రక్షాబంధశ్శుచివ్రతైః। బద్ధా రక్షాచభద్రాయాం విపరీతఫలప్రదా॥

తా॥ పరిశుద్ధమగు వ్రతమును నాచరించు వారు రక్షాబంధనమును భద్రతిథి యందు చేయకూడదు, భద్రాతిథియందు రక్షాబంధనమును చేసిన యెడల వ్యతిరేకఫల మిచ్చును అని సాంబమూర్తి సనత్కుమారునితో చెప్పెను.

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాసమాహాత్మ్యే ఈశ్వర

సనత్కుమారసంవాదే ఉపాకర్మోత్సర్జనశ్రవణాకర్మ

సర్పబలి సభాదీప హయగ్రీవజయంతీరక్షాబంధ

విధి కథనంనామ ఏకవింశోధ్యాయ

స్స మా ప్తః.

---

## అథ ద్వావింశోధ్యాయ ప్రారంభః.

ఈశ్వరః॥ శ్లో॥ శ్రావణేబహుళేపక్షే చతుర్థ్యాంమునిసత్తమ। వ్రతంసంకష్టహరణం సర్వకామఫలప్రదమ్॥

తా॥ ఓ మునీశ్వరుడా! శ్రావణ బహుళ చవితి యందు సమస్త కోరికల నొసగునట్టి సంకష్టహరణమను వ్రతము కలదు అని సాంబమూర్తి చెప్పెను,

సనత్కుమారః॥ శ్లో॥ క్రియతేకేనవిధినా కింకార్యంకించపూజనమ్। ఉద్యాపనంకదాకార్యం తన్మేవదసువిస్తరమ్॥

తా॥ ఓ భగవంతుడా! యీ సంకష్ట హరణవ్రతము ఏప్రకారముచేయ వలయునో యేయేవస్తువులు కావలయునో యేప్రకారముగా పూజింపవలెనో ఉద్యాపనము యెప్పుడు చేయవలయునో యిదియంతయు విస్తరముగా జెప్పుమని సనత్కుమారుడు సాంబమూర్తిని తిరిగి ప్రశ్న చేసి యడిగెను.

ఈశ్వరః॥ శ్లో॥ చతుర్థ్యాయాంప్రాతరుత్థాయ దంతదావన పూర్వకమ్॥ గ్రాహ్యంవ్రతమిదంపుణ్యం సంకష్టహరణంశుభమ్॥ నిరా

హారోస్మి దేవేశ యావచ్చంద్రోదయో భవేత్ । భోక్ష్యామి పూజయి త్వా త్వాం సంకష్టాత్తారయస్వమామ్॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ మునీశ్వరా! శ్రావణమాసంలో చవితి యందు సదయంబున లేచి దంతధావనాది కృత్యములనుదీర్చి స్నానముచేసి పరిశుద్ధుడయి యోస్వామీ! యీదినంబున పుణ్యప్రదమైనదియు శ్రేయస్కరమగు సంకష్టహరణవ్రతమును చేసెదను చంద్రోదయమగునంత పర్యంతము నిరాహారుడనై నిన్ను పూజించి పిమ్మట భుజించెదను కావున నన్ను కష్టములనుండి తొలగింపుము.

శ్లో॥ ఏవంసంకల్ప్యవై ధాత్రీః స్నాత్వాకృష్ణ తిలైశ్శుభైః । విధాయచాహ్నికంసర్వం పశ్చాత్పూజ్యోగణాధిపః ॥

తా॥ ఓ బ్రహ్మపుత్రుడా! యీ ప్రకారము ప్రాతఃకాలంబున సంకల్పము చేసి నల్ల నువ్వుల నూనెతో అభ్యంగనముచే స్నానముచేసి సంధ్యావందనము అగ్నిహోత్రము వైశ్వదేవము మొదలగు పగటి కృత్యముల నెరవేర్చి పిమ్మట వినాయకుని పూజింపవలయును.

శ్లో॥ త్రిభిర్మాషైస్తదర్ధేన తృతీయాంశేనవాపునః । యథాశక్త్యాథవాహైమీం ప్రతిమాంకారయేద్బుధః॥

తా॥ వ్రతమును చేయదలచినవాడు జ్ఞానసంపన్నుడై పదిహేను గురువింద గింజలయెత్తు గల బంగారముతోగాని దానిలోసగముగాని మూడవవంతు బంగారముతోగాని లేక తనశక్తిననుసరించి బంగారపు ప్రతిమను చేయించవలెను.

శ్లో॥ హేమాభావేతురౌప్యేణ తామ్రేణాపియథాసుఖమ్ । సర్వదాదరిద్రేణ కర్తవ్యామృన్మయీశుభా॥

తా॥ బంగారము లేనప్పుడు వెండితోగాని రాగితోగాని చేయించవలెను, అంతయును శక్తిలేక దరిద్రుడుగానుండువాడు మట్టితోనైనను చేయవలెను.

శ్లో॥ విత్తశాఠ్యంనకర్తవ్యం కృతేకార్యంవినశ్యతి । రమ్యేష్టదళపద్మేతు కుంభంవస్త్రయుతంన్యసేత్॥ జలపూర్ణాంపూర్ణపాత్రే గణదేవం ప్రపూజయేత్ । షోడశైరుప చారైస్తు మంత్రైర్వైదికతాంత్రికైః॥

తా॥ తనశక్తి కొలదియు చేయవలయును గాని శక్తికలిగిన యెడల లోపము చేయకూడదు అలా చేసినయెడల తాను చేసిన కార్యము వ్యర్థమగును కావున ప్రారంభమున అష్టదళములు గల మనోహరమగు పద్మాకారము నేర్పరచి యుదకముతో నిండింప బడిన పూర్ణకలశము నుంచి దానియందు ప్రతిమనుంచి వేదోక్తమంత్రములచే షోడశోపచారములతోను వినాయకుని పూజింపవలెను,

శ్లో॥ మోదకాన్కారయేద్విప్ర తిలయుక్తాన్గుడోత్తమాన్ ।
దేవాగ్రేస్థాపయేత్పంచ దశవిప్రాయ దాపయేత్॥

తా॥ ఓ బ్రాహ్మణుడా! నువ్వులతో గూడినవియు శ్రేష్ఠంబగు పదికుడుములను చేసి అయిదు కుడుములను స్వామికి నివేదన చేసి అయిదుకుడుములను బ్రాహ్మణునకు వాయన మియ్యవలెను,

శ్లో॥ పూజయిత్వాతుతంవిప్రం భక్తిభావేన దేవతమ్ । దక్షిణాంతుయథాశక్త్యా దత్వాచప్రార్థయేత్తతః ॥

తా॥ భక్తికలవాడయి యా బ్రాహ్మణుని దేవతతో సమానునిగా దలచి పూజించి తనశక్తి కొలదియు దక్షిణనిచ్చి పిమ్మట ఈవిధముగా ప్రార్థింపవలెను.

శ్లో॥ విప్రవర్యనమస్తుభ్యం మోదకాంస్తేదదామ్యహం। సఫలాన్పంచసంఖ్యాకాన్ దేవదక్షిణయాయుతాన్॥ ఆపదుద్ధరణార్థాయ గృహాణద్విజసత్తమ । అబద్ధమతిరిక్తంవా ద్రవ్యహీనం మయాకృతం। తత్సర్వంపూర్ణతాంయాతు విప్రరూపగణేశ్వర। బ్రాహ్మణాన్భోజయేచ్చైవ స్వాద్వన్నైర్యథాసుఖం॥

తా॥ ఓబ్రాహ్మణోత్తమా నీకు నమస్కారము చేసెదను ఓస్వామీ! పండ్లతోను దక్షిణతోను గూడిన అయిదు కుడుములను నీకు దానమిచ్చుచున్నాను అవి గ్రహించినవాడవై ఆపత్తులవలన నన్ను తరింపచేయుము ద్రవ్యము లేని వాడనయి యిట్టి వ్రతమును చేయుచుంటిని కావున బ్రాహ్మణ స్వరూపమును ధరించిన యో వినాయకుడా! దానినంతయు సంపూర్ణమగునట్లుచేయుము అని ప్రార్థించిపిమ్మట రుచిగల పదార్థములతో బ్రాహ్మణులకు భోజనం పెట్టవలెను-

శ్లో॥ చంద్రాయార్ఘ్యంప్రదాతవ్యం శ్రుణుతన్మంత్రమాదితః॥ క్షీరసాగరసంభూత సుధారూపనిశాకర ॥ గృహాణార్ఘ్యం మయాద

త్రం గణేశప్రీతివర్ధన । ఏవంకృతేపి నైవ ప్రసన్నో భక్తద్వరాధిపః ॥ దదాతివాంఛితాన్కామాం స్తస్మై ప్రత్యక్షమాచరేత్ ॥

తా॥ అనంతరము చంద్రునికి సంకష్టచతుర్థియందు అమంత్రకముగా విస్తారముగా వినుము పాపములుపోవునని పృచ్ఛ చేయుచున్న అప్పుడు స్వర్గాధిపుడగు ఓ చంద్రుడా! నేనిచ్చునటువంటి యర్ఘ్యమును గ్రహింపుము నాకు సంతోషము వృద్ధిపొందింపుము అని చెప్పి యర్ఘ్యమియ్యవలెను యీ ప్రకారముగా చేసిన యెడల గణాధిపతి సంతోషించినవాడై కోరిన సమస్త కోరికల నొసగును, కావున యీసంకష్ట హరణ వ్రతము నాచరించవలయును-

శ్లో॥ విద్యార్థీలభతేవిద్యాం ధనార్థీలభతేధనమ్॥ పుత్రార్థీ పుత్రమాప్నోతి మోక్షార్థీలభతేగతిమ్ । కార్యార్థీ కార్యమాప్నోతి రోగీరోగాద్విముచ్యతే॥

తా॥ విద్యను కోరిన వాడు విద్యను, ధనమును కోరినవాడు ధనమును పుత్రులను కోరినవాడు పుత్రులను, మోక్షమును కోరినవాడు మోక్షమును, కార్యములను కోరినవాడు కార్యములను పొందును రోగము కలవాడు ఆరోగ్యం కలవాడగును-

శ్లో॥ ఆపత్స్వవర్తమానానాం నృణాంవ్యాకులచేతసాం । చింతయాగ్రస్తమనసాం వియోగస్నేహ్యదాంతథా ॥ సర్వసంకష్టహరణం సర్వాభీష్టఫలప్రదమ్। పుత్రపౌత్రాదిజననం సర్వసంపత్కరంనృణామ్॥ పూజనేచజపేచైవ మంత్రింతేకథయామ్యహమ్। తారోత్తరంనమశ్శబ్దం హేరంబంమదమోదితం ॥ చతుర్థ్యంతం ప్రశస్తంచ సంకష్టస్య నివారణమ్। స్వాహాంతంచవదేన్మంత్ర మేకవింశతివర్ణకమ్ ॥

తా ॥ ఆపత్తులతో గూడుకొనిన వారియొక్కయు మనోవ్యాకులము గల వారి యొక్కయు చింతతో గూడిన వారియొక్కయు స్నేహితుల వియోగము గల వారి యొక్కయు సమస్త కష్టములను తొలగించునదియు సమస్తకోరికల నిచ్చునదియును పుత్రులను పౌత్రులను కలిగించునదియు మనుష్యులకు సమస్త సంపత్తుల నొసగునటువంటి యీ వ్రతమును ముఖ్యముగా చేయవలయును పూజచేయునప్పుడును జపము చేయునప్పుడు నుపయోగింపవలసినమంత్రమును చెప్పెదనువినుము (ఓంనమో భగవతే హేరంబాయ మదమోదితాయ నమస్వాహా) అనునటువంటిదియు నిరువది యొక్క అక్షరములు గల మంత్రమును పఠించిన యెడల సమస్త కష్టములును తొలగి పోవును,

శ్లో॥ ఇంద్రాదిలోకపాలాంశ్చ సమంతాదర్చయేత్సుధీః। మోద
కానాంప్రకారంచ అన్యంతేకథయామ్యహమ్॥

తా॥ ఇంద్రుఁడు మొదలగు అష్టదిక్పాలకులను అంతటను పూజింపవలెను, మఱియు యింకొక విషయముగలదు అది కుడుములసంబంధమయినది దానిని నీకు చెప్పెదను వినుము-

శ్లో॥ పక్వముద్గైశ్చ తైర్యుక్త్వా మోదకాఘృతపాచితాః। అర్ప
ణీయాగణేశాయ నారికేళేనగర్భితాః॥

తా॥ పక్వమగు నువ్వులు కొబ్బరి బెల్లము కలిపి యదిపూర్ణముగా లోపల పెట్టి పైన గోధుమపిండితో కప్పగా నుండునట్లుచేసి నేతితో వండి యవి వినాయకునకు నివేదన చేయవలెను-

శ్లో॥ తతోదూర్వాంకురాన్గృహ్య నామభిర్నామపద్మైః పృథక్। పూజ
యేద్గణనాథంచ తానినామానివైశృణు॥

తా॥ అనంతరము గరికచిగుళ్లతో ముందుచెప్పబోయెడు ఈగణాధిపతినామములను స్మరింపుచు వేరువేరుగా గణనాథుని పూజింపవలయును-

శ్లో॥ గణాధిపనమస్తేస్తు ఉమాపుత్రాఘనాశన। ఏకదంతేభవ
క్త్రేతి తథామూషకవాహన॥ వినాయకేశపుత్రేతి సర్వసిద్ధిప్రదాయ
క। విఘ్నరాజస్కందగురో సర్వసంకష్టనాశన॥ లంబోదరగణాధ్యక్ష
గౌర్యంగమలసంభవ। ధూమ్రకేతో బాలచంద్ర సిందూరాసురమర్దన॥
విద్యావిధానవికట శూర్పకర్ణేతిచైవహి। పూజయేద్గణపంచైవ మేక
వింశతినామభిః॥

తా॥ గణాధిప, ఉమాపుత్ర, అఘనాశన, ఏకదంత, ఇభవక్త్ర, మూషకవాహన, వినాయక, ఈశపుత్ర, సర్వసిద్ధి ప్రదాయక, విఘ్నరాజ, స్కందగురో, సర్వసంకష్టనాశన, లంబోదర, గణాధ్యక్ష, గౌర్యంగమల సంభవ, ధూమ్రకేతో, బాలచంద్ర, సిందూర, అసుర మర్దన, విద్యా విధాన, వికట, శూర్పకర్ణ, నీకు నమస్కారము అనిచెప్పి యీయిరువదొక్క నామముచేతను వినాయకుని పూజింపవలయును.

శ్లో॥ ప్రార్థయేచ్చతతోదేవం భక్తినమ్రః ప్రసన్నధీః। విఘ్న
రాజనమస్తేస్తు ఉమాపుత్రాఘనాశన॥ యదుద్దిశ్యకృతంమేద్య యథా

శక్త్యా ప్రపూజనమ్ । తేనతుష్టో మమాద్యాశు హృత్స్థాన్కామాన్ప్రపూరయ ॥

తా॥ అనంతరము దేవతను నిర్మలమగు బుద్ధి కలవాడగుచు భక్తి కలవాడై ప్రార్థించవలయును ఓ విఘ్నరాజా! నీకు నమస్కారము చేసెదను ఉమాపుత్ర, అఘనాశన, దీనిని గ్రహించి నా శక్తి కొలదియు పూజించితిని అటువంటి నాపూజచే గణాధిపతి సంతోషించినవాడై నామనస్సు యందుండెడి సర్వ కోరికలనిచ్చి నామనోరథము సఫలము చేయుగాక-

శ్లో॥ విఘ్నాన్నాశయమేసర్వా న్నానావిధోపస్థితాన్బహూన్। త్వత్ప్రసాదేనకార్యాణి సర్వాణీహకరోమ్యహమ్॥

తా॥ నా సంబంధమగు అనేక విధములైన విఘ్నములను నశింపు చేయుము నీ యనుగ్రహముచే సమస్త కార్యములను చేయఁగలవాడనైతి-

శ్లో॥ శత్రూణాంబుద్ధినాశంచ మిత్రాణాముదయంకురు। తతో హోమంప్రకుర్వీత శతమష్టోత్తరంతథా॥

తా॥ ఓవినాయకా! నాశత్రువులను నశింపఁజేసి మిత్రులను వృద్ధి చేయుము అని ప్రార్థించి పిమ్మట నూటయెనిమిది పర్యాయములు హోమంచేయవలెను-

శ్లో॥ మోదకైర్వాయనందద్యా ద్వ్రతసంపూర్ణహేతవే। లడ్డుకైర్మోదకైర్వాపి సప్తభిః ఫలసంయుతం ॥ గణేశప్రీణనార్థాయ బ్రాహ్మణాయదదామ్యహమ్ ॥ కథాంశ్రుత్వాతతఃపుణ్యాం దద్యాదర్ఘ్యంప్రయత్నతః॥ చంద్రాయపంచవారంతు మంత్రేణానేనసత్తమ॥ క్షీరోదార్ణవసంభూత అత్రిగోత్రసముద్భవ। గృహాణార్ఘ్యంమయాదత్తం రోహిణ్యాసహితశ్శశిన్॥

తా॥ వినాయకుడు ప్రీతినొందుట కొఱకును వ్రతము పూర్తినొందుట కొఱకును బ్రాహ్మణునకు నేను వాయనమిచ్చుచున్నానని ఏడు లడ్డూలనుగాని బూరెలనుగాని ఫలములతోఁగూడ బ్రాహ్మణునకు వాయనమిచ్చి పిమ్మట పుణ్యప్రదమైన కథనువిని ఓ మునీశ్వరుఁడా! యీ ముందుచెప్పబోవు దానిచే చంద్రునకు నైదు పర్యాయములు అర్ఘ్యమియ్యవలయును అది యేవిధముగా ననగా పాలసముద్రమునందు జనించిన వాడవును, అత్రిమహాముని వంశమునందు జన్మించిన వాడవునగు

ఓయీ చంద్రుడా! నీ భార్యయగు రోహిణీదేవితో గూడినవాడవై చేసిచ్చునటువంటి యర్ఘ్యమును గ్రహింపుమని చెప్పి యర్ఘ్యమిడువవలెను-

శ్లో॥ తతః క్షమాపయేద్దేవం శక్త్యా విప్రాంశ్చ భోజయేత్। స్వయం భుంజీత తచ్ఛేషం యద్దేవబ్రాహ్మణార్పితమ్॥

తా॥ అనంతరము భగవంతుని క్షమార్పణగోరి పిమ్మట తనశక్తికొలదియు బ్రాహ్మణులకు భోజనముపెట్టి మిగిలిన పదార్థములను బ్రాహ్మణుల వలన ననుజ్ఞ గొని తాను భుజింపవలెను-

శ్లో॥ సప్తగ్రాసాన్ మౌనయుక్తో హ్యశక్తస్తు యథాసుఖమ్॥ ఇత్థంకుర్యాత్ త్రిమాసేషు చతుర్ష్వపివిధానవిత్॥

తా॥ మౌనముకలవాడై ఏడు కబళములను భుజింపవలయును అందుకలన దృఢముగా నుండువాడు కాకుండె నేని తనకిష్టప్రకారము భుజింపవలెను ఈప్రకారము మూడు మాసములుగాని నాలుగు మాసములు గాని యథావిధిగా వ్రతమును చేయవలయును-

శ్లో॥ ఉద్యాపనంపంచమేతు కుర్యాద్ధీమాన్ప్రయత్నతః। సౌవర్ణంవక్రతుండంచ శక్త్యాకుర్యాద్విచక్షణః॥

తా॥ విద్వాంసుడీప్రకారము వ్రతమాచరించి అయిదవమాసములో నుద్యాపనము చేయవలయును అందునిమిత్తమై తనశక్తికొలదియు బంగారపు వినాయక ప్రతిమను చేయించవలయును-

శ్లో॥ పూర్వోక్తేనవిధానేన పూజయేద్భక్తిమాన్నరః॥ చందనేనసుగంధేన పుష్పైర్నానావిధైశ్శుభైః॥

తా॥ అనంతరము పూజించువాడు భక్తికలవాడగుచు పరిమళించుచున్న మంచిగంధముతోను శుభప్రదములగు అనేకవిధములగు పుష్పములతోను పూర్వము చెప్పబడిన ప్రకారముగా పూజచేయవలయును-

శ్లో॥ నారికేళఫలేనైవ దదాదర్ఘ్యంసమాహితః। దద్యాద్భక్త్యాచవిప్రాయ వాయనంఫలసంయుతమ్॥ ఘృతపాయససంయుక్తం రక్తవస్త్రేణవేష్టితం। సౌవర్ణంగణపంతస్మై దద్యాచ్చైవసదక్షిణం॥

తా॥ స్వస్థచిత్తుడై కొబ్బరిజలముతో నర్ఘ్య మివ్వవలయును అనంతరం చేటలు పరమాన్నము ఫలములు మొదలగు వానితోగూడ యెఱ్ఱని వస్త్రముతో జుట్టి

బడిన బంగారపు వినాయక ప్రతిమను దక్షిణసహితముగా భక్తుడగు బ్రాహ్మణునకు వాయన మీయవలయును-

శ్లో॥ తిలానామాఢకం దద్యాత్ ఘృతసంపూర్ణ పాత్రకే। తతః క్షమాపయేద్దేవం విఘ్నేశః ప్రీయతామితి॥

తా॥ వ్రతము సంపూర్ణినొందుటకు తూమెడు నువ్వులను దానమియ్యవలయును అనంతరము విఘ్నేశ్వరుడు సంతోషించుగాకయని క్షమార్పణగోరవలెను-

శ్లో॥ ఇత్థముద్యాపనం కృత్వా హయమేధఫలం లభేత్। సర్వకార్యాణి సిద్ధ్యంతి మనోభిలషితాన్యపి॥

తా॥ ఈ ప్రకారము ఉద్యాపనము చేసినయెడల అశ్వమేధయాగము చేసిన ఫలము నొందును మరియు మనస్సున కోరబడిన సమస్త కార్యములు సఫలమగును-

శ్లో॥ పూర్వకల్పే గతే స్కందే పార్వత్యాపై కృతంకిల। చతుష్వపిచ మాసేషు మమ వాక్యేన సత్తమ॥

తా॥ పూర్వకల్పంబున నేను చెప్పగా కుమారస్వామియు పార్వతీదేవియు నాలుగు మాసములు చేసిరి-

శ్లో॥ పంచమే మాసి దృష్టస్తు కార్తికేయో హ్యపర్ణయా। సముద్రపానవేళాయాం హ్యగస్త్యేన పురాకృతం ॥ త్రిషు మాసేషు విఘ్నేశ ప్రసాదాత్సిద్ధిమాపసః। షణ్మాసవిధిం విప్రేంద దమయంత్యా కృతం త్విదమ్‌ః నలమన్వేషయంత్యా చ తతో దృష్టో నలోభవత్ ॥

తా॥ యిట్లు పార్వతియు కుమారస్వామియు చేయగా చూచి యగస్త్యుడు సముద్రపానము చేయదలచినప్పుడు అయిదవమాసమునందు ప్రారంభించిన వాడును మూడు మాసములు చేయగా విఘ్నేశ్వరు డనుగ్రహము కలవాడై సిద్ధిపొందెను దమయంతి నలమహారాజును వెతకునప్పుడు యీ వ్రతం నారంభించి యారు మాసములు చేయగా విఘ్నేశ్వరుని యనుగ్రహంబలన తిరిగి భర్తనుపొందెను-

శ్లో॥ నీతేనిరుద్ధే బాణస్య నగరం చిత్రలేఖయా। క్వగతః కేన నీతో సౌ విత్యభూద్వ్యాకులస్స్మరః। ప్రద్యుమ్నం పుత్రశోకార్తం ప్రీత్యా రుక్మిణ్యభాషత॥

తా॥ అనిరుద్ధుని చిత్రలేఖ బాణాసురుని పట్టణమునకు తీసికొనివెళ్లినప్పుడు తండ్రియగు మన్మథుడు నాకుమారుని యెవరు తీసుకొనివెళ్లిరో యెక్కడికి వెళ్లెనో విచారపడుచుండగా మన్మథుని తల్లియగు రుక్మిణీదేవి కుమారునితో నిట్లు చెప్పుచున్నది-

శ్లో॥ శృణుపుత్ర ప్రవక్ష్యామి యద్వ్రతం మామకే గృహే। రాక్షసేన పురానీతే బాలకే త్వయి ఖండితే॥ త్వద్వియోగజదుఃఖేన హృదయం మమ దారితమ్॥ కదా ద్రక్ష్యామ్యహం పుత్ర ముఖమత్యంత సుందరమ్॥

తా॥ ఓ పుత్రికా! నేను చేసిన వ్రత ప్రభావమును చెప్పెదను వినుము నా గృహంబున నీవు జన్మించి నప్పుడు శంబరాసురుడు వచ్చి నిన్ను, బాలుడవై యుండగా యెత్తుకొనిపోయెను, అప్పుడు నీవినియోగముచే దుఃఖము వలన నామనస్సు ఛేదింపబడెను మిక్కిలి సుందరుడగు నాకుమారునియొక్క ముఖము నెప్పుడుచూచెదనాయని విచారపడితిని-

శ్లో॥ అన్యస్త్రీణాంసుతాన్ దృష్ట్వా మమ చేతో విదీర్యతే। మమ పుత్రోభవన్నా సౌ వయసా మేనమానతః॥ ఇతిచింతాకులాయా మే గతాన్యబ్దాని భూరిశః। తతో దైవయోగేన రోమశో మునిరాగతః॥

తా॥ ఇతర స్త్రీలయొక్క పుత్రులను జూడగా వయస్సుచేతనుగానీ శరీర సౌందర్యము చేతనుగాని, నాకుమారుడీ విధముగానే యుండునని నామనస్సు పరితాపబడుచుండెను ఇట్లు కొన్ని సంవత్సరములు వెళ్లగా కొంతకాలమునకు దైవయోగమువలన నావద్దకు రోమశమహాముని వచ్చెను.

శ్లో॥ తేనోపదిష్టంవిధివత్సర్వచింతాహరంవ్రతం। సంకష్టాఖ్య చతుర్థ్యాస్తు చతుర్వారం మయాకృతమ్॥ తత్ప్రసాదాత్త్వమాయాతో హత్వాశంబరమాహవే। జ్ఞాత్వాచకురుపుత్రత్వం తతోజ్ఞాస్యసినందనమ్॥

తా॥ సమస్తచింతలను పోగొట్టునట్టి సంకష్టచతుర్థీవ్రతమును ఆరోమశమునీశ్వరుడు నాకు చెప్పగా నేను నాలుగు పర్యాయములు యథావిధిగా చేసితిని. అప్పుడు వినాయకుని యనుగ్రహము వలన యుద్ధమునందు శంబరాసురుని నీవు సంహరించినవాడవై తిరిగి మనగృహమునకు వచ్చితివి, కావున నీవును ఈవ్రతవిధానము తెలిసికొనినవాడవై చేసిన యెడల నీకుమారుడు యెక్కడనున్నదియు నీవు తెలిసికొనగలవు,

శ్లో॥ ప్రద్యుమ్నేనకృతంవిప్ర గణనాథస్యతోషణమ్। శ్రుతో బాణాసురపురేనిరుద్ధో నారదాత్తతః॥ గత్వాబాణాసురపురం యుద్ధం

కృత్వాను సారణమ్ । కృశాను రేతసా సాధకాం జిత్వా బాణాసురం రణె॥ ఆనీతస్స్నుషయా సార్ధ మనిరుద్ధ స్తదా మునే । అన్యైర్దేవా సురైః పూర్వం కృతంవిఘ్నేశతునాశనమ్॥

తా॥ ఇట్లు రుక్మిణీదేవి చెప్పగా మన్మథుడు వినాయకునకు ప్రీతికరమగు సంకష్ట చతుర్థీవ్రతముచేసెను అప్పుడా వ్రతమహిమవలన నారదుడువచ్చి బాణాసురపట్టణమునందు అనిరుద్ధుండు కలడని చెప్పగా మన్మథుడు బాణాసుర పట్టణమునకు వెళ్లి యాబాణాసురునితోను వానికి సహాయకారియైన సాంబమూర్తితోను ఘోర మగు యుద్ధము చేసినవారిని జయించి కోడలుతో సహితముగా ననిరుద్ధుని తీసికొని వచ్చెను మఱియు నోమునీశ్వరుడా! ఇతరులగుదేవతలు రాక్షసులు మొదలగువారు విఘ్నేశ్వరుని ప్రీతికొఱకు పూర్వమీవ్రతము చేసిరి.

శ్లో॥ అనేనసదృశంలోకే సర్వసిద్ధికరంవ్రతమ్ । తపోదానం చతీర్థంచ విద్యతేనాత్రకుత్రచిత్॥

తా॥ కావున దీనితో సమానమగునదియు సమస్తకార్యసిద్ధులను చేయునట్టి వ్రతము మఱియొకటిలేదు తపస్సుగాని దానముగాని తీర్థము గాని దీనితోసమాన మగునది లేదు.

శ్లో॥ బహునాత్రకిము క్తేన నాస్త్యన్యత్కార్యసిద్ధయే । నోప దేశంత్వభక్తాయ నాస్తికాయశఠాయచ॥ దేయంపుత్రాయశిష్యాయ శ్రద్ధాయుక్తాయసాధవే॥

తా॥ దీని మహిమను గుఱించి విశేషముగా చెప్పనవసరములేదు కార్యసిద్ధిని చేయునట్టిది మఱియొకటిలేదు కావున భక్తిలేనివానికిని భగవంతుడు లేడనువానికిని మూర్ఖునకును యీవ్రతము నుపదేశింపగూడదు కుమారునకును శిష్యునకును శ్రద్ధ కలవానికిని సత్పురుషునకు నుపదేశింపవలయును.

శ్లో॥ మమప్రియోసివిప్రపేత్రధర్మిష్టవిధినందన। కార్యకర్తాసి లోకానా ముపదిష్టమతస్తవ॥

తా॥ బ్రహ్మకుమారుండవగు ఓ మునీశ్వరుడా! నాకు ప్రియమగువాడవును లోకములకు నుపకారమగు కార్యములను చేయువాడవు కావున యీవ్రతమును నీకు నుపదేశించితినని సాంబమూర్తి సనత్కుమారునితో చెప్పెను-

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణమాస మాహాత్మ్యే చతుర్థ్యాదాం సంకష్ట
హరణ వ్రతకథనంనామ ద్వావింశో
ధ్యాయః స్సమాప్తః.

---

త్రయోవింశోఽధ్యాయ ప్రారంభః.

ఈశ్వరః॥ శ్లో॥ కృష్ణాష్టమ్యాంనభోమాసి వృచం దేనిశీథకే। దేవక్యాజీజనత్కృష్ణం యోగోస్మిన్వను దేవతః॥ సింహరాసిగతేసూర్యే కర్తవ్యస్సుమహోత్సవః॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, ఓ మునీశ్వరుడా! శ్రావణ మాసము నందు సూర్యుడు సింహరాశియందు ప్రవేశించియుండగా బహుళాష్టమి దినంబున చంద్రుడు వృషభరాశియందుండు సమయంబున రాత్రి నిశీదిసమయమందు దేవకీవసుదేవులవలన కృష్ణస్వరూపుడై భగవంతుడావిర్భవించెను కావున యీదినము మంచి పుణ్యప్రదమగుకాలము యిటువంటిదినంబున విశేషమహోత్సవము చేయతగినది.

శ్లో॥ సప్తమ్యాంలఘుభుక్త్వాద్దంతదావనపూర్వకమ్।ఉపవాసస్యనియమస్సపేదాత్రౌజితేంద్రియః। కేనలేనోపవాసేనకృష్ణ జన్మదినంనయేత్॥

తా॥ సప్తమి దినంబున దంతదావనాది కృత్యములనుదీర్చి స్నానసంధ్యావందనాది నిత్యకర్మలనుచేసినవాడై పండ్లు మొదలగువానిని కొంచెముగా భుజించి నియమము కలవాడయి యింద్రియములను జయించి లఘూపవాసముతో ఆ రాత్రిని వెళ్లబుచ్చవలయును మఱియు నేమియు భక్షింపక శుష్కోపవాసముతో నైనయూ కృష్ణాష్టదినంబును వెళ్లబుచ్చవలయును-

శ్లో॥ సప్తజన్మకృతాత్పాపా న్ముచ్యతేనాత్రిసంశయః । ఉపా వృత్తస్తుపాపేభ్యో యస్తువాసోగుణైస్సహ ॥ ఉపవాసస్సవిజ్ఞేయః స్సర్వ భోగవివర్జితః॥

తా॥ యిందువలన ఏడుజన్మంబులయందు చేసిన పాపమైనను నశించిపోవును యిందువిషయమై సందేహములేదు, ఉపవాసమునగా పాపములవలన విముక్తుడై సద్గుణములు కలవాడై సమస్త భోగములను విడిచి యుండుట యుపవాసమని చెప్పబడు నని మునీశ్వరులు వక్కాణించిరి.

శ్లో॥ తతోష్టమ్యాంతిలైస్స్నాత్వా నద్యాదౌవిమలేజలే। సుదే శేశోభనంకుర్యాత్ దేవక్యాస్సూతికాగృహమ్॥ నానావర్ణైస్సువాసోభి శ్శోభితంకలశైఃఫలైః ॥ పుష్పైర్దీపావళీభిశ్చ చందనాగరుధూపితం। హరివంశస్యచరితం గోకులంతత్ర లేఖయేత్॥

తా॥ అనంతరము నువ్వులనూనెతో తలంటికొని నిర్మలమగు నదీజలములో స్నానముచేసి పరిశుద్ధుడై శుద్ధవస్త్రములను ధరించి శుచియగు ప్రదేశమందు దేవకీదేవియొక్క పురిటి గృహమును లిఖించి యనేక వర్ణములు కలవియు పరిమళము కలపుష్పములు కలశములు ఫలములు దీపపంక్తులు మొదలగు వానిచే మనోహరంగా నలంకరించి అగరు కస్తూరి చందనము మొదలగు పరిమళ ద్రవ్యములచే పరిమళింపచేసి విష్ణువంశమును గోపాలకులవంశము నచ్చటలిఖించవలెను-

శ్లో॥ యుక్తంవాదిత్రనినదై న్నృత్యగీతాదిమంగళైః। షష్ఠ్యా దేవ్యాధిష్ఠితాంచ తన్మధ్యేప్రతిమాంహరేః ॥ కాంచనీరాజతీంతా మ్రీం పైత్తలీం మృన్మయీంతువా । వార్క్షీం మణిమయీంవాపి వర్ణకైర్లిఖితాంయథా ॥ సర్వలక్షణసంపన్నాం పర్యంకేచాష్టశల్యకే। ప్రసూతాం దేవకీంతత్ర స్థాపయేన్మంచకోపరి॥

తా॥ వాద్యములు నృత్యము గీతము నాట్యము మొదలగు మంగళధ్వనులను ప్రయోగింపుచు బంగారము వెండి రాగి యిత్తడి మొదలగు లోహములతోగాని మట్టితోగాని కొయ్యతోగాని మణులతోగాని విష్ణుమూర్తి ప్రతిమను పూతకియను రాక్షసియు బాలహంతయు షష్ఠియను దానితోగూడ నిర్మించి లేక రంగులతోనైన నిర్మించి యాప్రతిమను అక్కడనుంచవలయును మఱియు నచ్చట పందిరిపట్టించ మును దానిపైన యెనిమిది బొమ్మలుతో గూడిన పరుపును దానియందు సర్వలక్షణ సంపన్నురాలును బాలింతరాలు నగు దేవకీప్రతిమనుంచవలయును-

శ్లో॥ సుప్తం బాలం తత్ర హరిం పర్యంకే స్తనపాయినమ్। యశోదాం తత్ర చైకస్మిన్ ప్రదేశే సూతికాగృహే॥ ప్రసూతం కన్యకాం చైవ కృష్ణపార్శ్వే తు సంలిఖేత్। కృతాంజలిపుటాన్దేవాన్ యక్షవిద్యాధరామరాన్॥

తా॥ ఆ శయ్యయందు పాలుత్రాగుచున్నట్లును నిద్రించుచున్నట్లును బాలుడగు కృష్ణుని విగ్రహమును వేయవలయును, ఆ పురిటి గృహమువందే మఱియొక ప్రదేశంబున ఆడ శిశువును కనినట్లుగా యశోదాదేవియొక్క విగ్రహమును కృష్ణవిగ్రహమునకు సమీపముగా లిఖించవలయును, మఱియు యక్షులు విద్యాధరులు దేవతలు మొదలగువారు దోసిలిపట్టుకొని కృష్ణమూర్తిని ధ్యానించుచున్న వారలనుగా లిఖించవలయును-

శ్లో॥ వసుదేవం చ తత్రైవ ఖడ్గచర్మధరం స్థితమ్। కాశ్యపో వసుదేవోయ మదితిశ్చైవ దేవకీ॥ శేషో బలో యశోదాపి ఆదిత్యంశాద్బభూవ హ। నందః ప్రజాపతిర్దక్షో గర్గశ్చాపి చతుర్ముఖః॥ గోప్యశ్చాప్సరసస్సర్వా గోపాశ్చాపి దివౌకసః। కాలనేమిశ్చ కంసోయం నియుక్తాస్తేన చాసురాః॥ గాధేనుకుంజరాశ్వాశ్చ దానవాశ్శస్త్రపాణయః। లేఖనీయాశ్చ తత్రైవ కాళీయో యమునాహ్రదే॥

తా॥ మఱియు నచ్చట ఖడ్గము చర్మము మొదలగు నాయుధములనుధరించియున్నట్లుగా వసుదేవ విగ్రహమును లిఖించవలయును మఱియు కాశ్యపమునియంశమగు వసుదేవుని, అతిథియొక్క అంశమగు దేవకీయశోదలను, ఆదిశేషుని అంశమగు బలరాముని, దక్షప్రజాపతి అంశమగునందుని, చతుర్ముఖ బ్రహ్మయొక్కయంశమగు గర్గమునీశ్వరుని, అప్సరసల యొక్క అంశమగు గోపికా స్త్రీలను, సమస్త దేవతల అంశమగు గోపాలకులను, కాలనేమి అంశమగు కంసుని, వానిచే నియోగింపబడిన సమస్త రాక్షసులయొక్క అంశజాలగునట్టియు హస్తమందు నాయుధధారులయినటువంటియు గార్దభాసురుడు ధేనుకాసురుడు గజాసురుడు అశ్వాసురుడు మొదలగువారిని లిఖించవలయును మఱియు నచ్చటనే యమునా నదియందు మడుగులో కాళీయుడను సర్పవిగ్రహముండునట్లుగాను లిఖింపవలయును-

శ్లో॥ ఇత్యేవమాదియత్కించిచ్చరితం హరిణా కృతమ్। లేఖ

యిత్వాపప్రియత్నేన పూజయేద్భక్తితత్పరః॥ ఉపచారైష్షోడశభిర్దేవకీం చేతిమంత్రతః॥

తా॥ ఈ ప్రకారము కృష్ణమూర్తి యవతారములో జరిగిన చరిత్రము ననుసరించిన వారియొక్క విగ్రహములనన్నియు లిఖించి భక్తికలవాడై ప్రయత్నముచే పూజాద్రవ్యముల నన్నియు సంపాదించి దేవకీ అనుమంత్రమును జెప్పుచు షోడశోపచారములచే పూజింపవలయును-

శ్లో॥ గాయద్భిః కిన్నరాద్యైస్సతతపరిణతాం వేణువీణాదినాదైః। భృంగారాద్యాదర్శదూర్వా దధికలశకరైః కింకరైస్సేవ్యమానామ్। పర్యంకేస్వాస్తనస్థా ముదితతరపుత్రిణీసమ్యగాస్తే। సా దేవీదివ్యమాతా విజయసుతసుతా దేవకీకాంతయుక్తా॥

తా॥ వేణు వీణ మొదలగు సాధనములతో సంగీతము పాడుచుండెడిగంధర్వులతో చుట్టుకొనబడినదియు- బంగారము దర్పణము గరికలు పెరుగు కలశములు మొదలగునవి హస్తములయందుంచు కొనిన కింకరులచే సేవింపబడినదియు, కుమారుండగు కృష్ణుని తొడలయందుంచుకొని యానందయుక్తమగు ముఖముకలదియైశోభస్కరమగు శయ్యయందు గూర్చున్నదియు, దేవమాతయగు అదితి యంశము వలన బుట్టిన దేవకీదేవి పెనిమిటియగు వసుదేవునితో కూడియుండి సర్వోత్కృష్టముగా ప్రకాశించుగాకయని ధ్యానము చేయవలయును-

శ్లో॥ ప్రణవాదినమోంతైశ్చ పృథఙ్నామాను కీర్తనైః। కుర్యాత్పూజావిధిజ్ఞస్తు సర్వపాపాపనుత్తయే॥ దేవక్యావసు దేవస్య వాసుదేవస్యచైవహి।బలదేవస్యనందస్య యశోదాయాఃపృథక్పృథక్॥

తా॥ వేరుగా నామములను జెప్పుచు మొదట ఓంకారమును చివర నమః అనుపదమును జెప్పవలయును - పూజావిధిని తెలిసికొనిన వాడగుచు సమస్త పాపములు నశించుటకొఱకు దేవకీదేవి-వసుదేవుడు, కృష్ణమూర్తి, బలరాముడు,యశోద నందుడు మొదలగువారలను వేరువేరుగా పూజచేయవలయును-

శ్లో॥ చంద్రోదయేశశాంకాయ అర్ఘ్యందద్యాద్ధరింస్మరన్। క్షీరోదార్ణవసంభూత అత్రిగోత్రసముద్భవ॥ నమస్తేరోహిణీకాంత అర్ఘ్యంనః ప్రతిగృహ్యతామ్॥

తా ॥ పాల సముద్రమునందు జన్మించిన వాడును అత్రిమునీశ్వరుని వంశమునందు జన్మించినవాడును రోహిణీదేవికి పెనిమిటియగు ఓ చంద్రుడా! నీకు నమస్కారము చేసెదను- నాచే నివ్వబడిన యర్ఘ్యమును గ్రహింపుమని ప్రార్థించి భగవంతుని మనస్సున దలచుచు చంద్రోదయ కాలమునందు చంద్రునకు నర్ఘ్యమిడువ వలయును-

శ్లో ॥ దేవక్యావసుదేవంచ నందంచైవ యశోదయా । రోహిణ్యాచసుధారశ్మిం బలంచహరిణాసహ ॥ సంపూజ్యవిధివద్దేహీ కింనాప్నోతిసుదుర్లభమ్ । ఏకాదశీకోటిసంఖ్యా తుల్యాకృష్ణాష్టమీతథా ॥ ఏవంసంపూజ్యతద్రాత్రౌ ప్రభాతేనవమీదినే । యథాహారే స్తథాకార్యో భగవత్యామహాత్సవః॥

తా ॥ దేవకీయుక్తుండగు వసుదేవుని యశోదాయుక్తుండగు నందుని రోహిణీయుక్తుండగు చంద్రుని బలరాముని కృష్ణుని యథావిధిగా పూజించిన వానికిపొంద శక్యముగాని దేమియులేదు అవగా సమస్తమును పొందును కావున ఈ కృష్ణాష్టమి యనునది కోటి యేకాదశులను చేసిన ఫలము నొసగును గాన కృష్ణాష్టమీ దినంబున రాత్రి పూర్వమందు చెప్పినరీతిగా పూజించి తెల్లవారిన పిమ్మట నవమీ దినంబున కృష్ణునకును భగవత్స్వరూపిణి యగు శక్తికిని సమానముగా నుత్సవము జేయవలెను-

శ్లో॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చా ద్దద్యాద్వైగోధనాదికమ్ । యద్యదిష్టతమంతత్ర కృష్ణోమేప్రీయతామితి॥

తా ॥ అనంతరము కృష్ణమూర్తి నాయందనుగ్రహము కలవాడగు గాక యని గోవులు ధనము బంగారము భూములు మొదలగు తనకిష్టమగు వాని నన్నియు దానములనిచ్చి పిమ్మట బ్రాహ్మణులకు భోజనంపెట్టవలెను-

శ్లో॥ నమస్తేవాసుదేవాయ గోబ్రాహ్మణహితాయచ। శాంతిరస్తుశివంచాస్తు ఇత్యుక్త్వాతంవిసర్జయేత్॥

తా ॥ గోవులకును బ్రాహ్మణులకును మేలును చేయునటువంటి వాసుదేవునకు నమస్కారము, శాంతియు శుభమును నాకు కలుగుచు నుండుగాకయని దేవతను ద్వాసన చెప్పవలయును-

శ్లో॥ తతోబంధుజనైస్సార్థం స్వయంభుంజీతవాగ్యతః। ఏవం యఃకురుతేదేవ్యాః కృష్ణస్యచమహోత్సవమ్ ॥ ప్రతివర్షం విధానేన

యథోక్తం లభతే ఫలం । పుత్రసంతానమారోగ్యం సౌభాగ్యమతులం భవేత్ ॥

తా॥ అనంతరము జ్ఞానము కలవాడయి బంధువులతో గూడుకొని భుజింపవలయును, ఈప్రకారము ప్రతిసంవత్సరము కృష్ణునకు శక్తికి పూజగావించి యుత్సవమును చేసినవాడు పుత్రసంతానము ఆరోగ్యము సామ్యములేని ఐశ్వర్యము పొందను అగు చెప్పిన ఫలములనన్నియు పొందగలడు-

శ్లో॥ ఇహధర్మమతిర్భూత్వా అంతే వైకుంఠ మాప్నుయాత్ ॥

తా॥ ఈ లోకంబునయందు నంతకాలము ధర్మమునందాసక్తి కలవాడయి జన్మాంతమునందు వైకుంఠలోకమునకేగును.

శ్లో॥ ఉద్యాపనమథో వక్ష్యే పుణ్యేహ్ని విధిపూర్వకమ్। పూర్వేద్యురేకభక్తాశీ స్వపేద్విష్ణుంస్మరన్హృది । ప్రాతస్సంధ్యాది సంపాద్య బ్రాహ్మణైస్స్వస్తివాచయేత్ ॥

తా॥ ఇకముందు యుద్యాపనమును చెప్పెదను వినుము, పంచాంగశుద్ధిగల దినమునందు యుద్యాపనము చేయదలచినవాడయి పూర్వదినమునందు ఒక్కపర్యాయమే భుజించి నువస్సున భగవంతుని ధ్యానింపుచు ఆరాత్రినిద్రించవలయును మరునాడుదయమున ప్రాతఃకాలంబున స్నానసంధ్యాది నిత్యకర్మలను నెరవేర్చుకొని వ్రతమును ప్రారంభించుటకు బ్రాహ్మణులను బిలచి పుణ్యాహవాచనాది క్రియలను చేయించుకొనవలయును-

శ్లో॥ ఆచార్యం వరయిత్వాతు ఋత్విజశ్చైవపూజయేత్। పలేనవాతదర్ధేన తదర్ధార్ధేనవాపునః ॥ ప్రతిమాం కారయేచ్ఛక్త్యా విత్తశాఠ్యం న కారయేత్ । మండపే మండలే దేవాన్బ్రహ్మాద్యాన్ స్థాపయేద్బుధః ॥

తా॥ అనంతరము ఆచార్యునకు ఋత్విక్కులకు వరుణల నివ్వవలయును నవటాకుగాని అందులో సగముగాని అందులో నాలుగవవంతుగాని తనశక్తి కలిగినట్లు బంగారముతో ప్రతిమను చేయించవలెను శక్తిలోపము చేయకూడదు, ఆప్రతిమను మంటపము నందుంచి పిమ్మట బ్రహ్మ మొదలగు దేవతల నందరి నావాహనము చేయవలయును-

శ్లో ॥ తత్రసంస్థాపయేత్కుంభం తామ్రమృణ్మయమేవవా । తస్యోపరిన్యసేత్పాత్రం రాజతంస్వర్ణకంతువా॥

తా॥ ఆమంటపమునందే రాగికలశమునుగాని మట్టికుండనుగాని బియ్యముతో నిండించి యుంచవలయును- దానిపైని వెండిపళ్లెముగాని రాగిపళ్లెముగాని వెదురు పాత్రగాని యుంచవలయును-

శ్లో॥ వాససాచ్ఛాద్యగోవిందం తత్రైనంపూజయేద్బుధః। ఉపచారైష్షోడశభిర్మంత్రై ర్వైదికతాంత్రికైః॥

తా॥ విద్వాంసుడగువాడు ఆ మంటపమందుంచిన విష్ణుప్రతిమయందు ఆఖండితమగు నూతన వస్త్రమునుంచి పిమ్మట వేదోక్తమంత్రములతోను కల్పోక్తమంత్రములతోను షోడశోపచార పూజలనుగావింపవలెను-

శ్లో॥ తతోర్ఘ్యంహరయేదద్య ద్దేవకీసహితాయచ । శంఖె కృత్వాజలంశుద్ధం సపుష్పఫలచందనమ్॥ జానుభ్యామవనింగత్వానారికేళఫలాన్వితమ్ । జాతఃకంశవధార్థాయ భూభారోత్తారణాయచ ॥ కౌరవాణాం వినాశాయ దైత్యానాంనిధనాయచ । గృహాణార్ఘ్యం మయాదత్తం దేవక్యాసహితోహరే॥

తా ॥ అనంతరము దేవకీ సహితుడైన కృష్ణునకు నర్ఘ్యమియ్యవలయును అది యేవిధముగాననగా శంఖములో జలమునుంచి పుష్పములు ఫలములు మంచిగంధము మొదలగువానితో యా శంఖము నలంకరించి కొబ్బరికాయను యా శంఖమును చేతనుంచుకొని మోకాళ్లను భూమిమీద నుండునట్లుగా వంచి దేవకీ సహితుడవగు యోకృష్ణమూర్తీ! నీవు కంసుని సంహరించుటకును భూభారమును హరించుటకును కౌరవులను నశింపు చేయుటకును రాక్షసులను వధించుటకును జన్మించితివి కావున నేనిచ్చునట్టి యర్ఘ్యమును గ్రహింపుము, అనిప్రార్థించి యర్ఘ్యమియ్యవలెను-

శ్లో॥ చంద్రాయార్ఘ్యంతతోదద్యా త్పూర్వోక్తవిధినాసుధీః॥

తా॥ విద్వాంసుడు పూర్వమునందు చెప్పబడిన రీతిగానే చంద్రునకు నర్ఘ్యమియ్యవలెను-

శ్లో॥ నమస్తుభ్యంజగన్నాథ దేవకీతనయప్రభో। వసుదేవాత్మజానంత త్రాహిమాంభవసాగరాత్॥

తా॥ దేవకీ వసుదేవులకు కుమారుడవును, యాదవులోకమునకు ప్రభుడవునగు యో కృష్ణమూర్తీ! నీకు నమస్కారము చేసెదను సంసారసముద్రమునుండి నన్ను రక్షింపుము.

శ్లో॥ ఇత్థంసంప్రార్థ్య దేవేశం రాత్రౌజాగరణంచరేత్ । ప్రత్యూషే విమలేస్నాత్వా పూజయిత్వాజనార్దనమ్ ॥ పాయసేనతిలాజ్యైశ్చ మూలమంత్రేణభక్తితః । అష్టోత్తరశతంహుత్వా తతఃపురుషసూక్తతః॥ మంత్రేణేదంవిష్ణురితి జుహుయాద్వ్యాహృత్యాహుతీః॥

తా॥ యీప్రకారము భగవంతుని ప్రార్థించి రాత్రిజాగరణముచేసిమరునాడుదయంబున నిర్మలమగు జలములో స్నానముచేసి కృష్ణునిపూజించి మూలమంత్రమునుచ్చరింపుచు పరమాన్నము తిలలు నెయ్యి మొదలగు వానిచే నూట యెనిమిది పర్యాయములు హోమముచేసి పిమ్మట పురుషసూక్తముతోను, ఇదంవిష్ణుః, అనుమంత్రముతోను ఆజ్యహోమము భక్తితోనుచేయవలెను.

శ్లో॥ హోమశేషంసమాప్యాథ పూర్ణాహుతిపురస్సరం। ఆచార్యంపూజయేత్పశ్చా భూషణాచ్ఛాదనాదిభిః॥ గామేకాంకపిలాందద్యాద్వ్రతసంపూర్ణహేతవే॥

తా ॥ అనంతరము పూర్ణాహుతి మొదలగు హోమములన్నియుసమాప్తినొందించి అనంతరము ఆచార్యునకు వస్త్రములు ఆభరణములు మొదలగు వానినిచ్చి పూజించి వ్రతము పూర్తినొందుటకు కపిలగోవును దానమియ్యవలెను.

శ్లో॥ పయస్వినీ సుశీలాంచ సవత్సాం సగుణాంతథా । స్వర్ణశృగీంరౌప్యఖురాం కాంస్యదోహాని కాయుతామ్ ॥ ముక్తాపుచ్ఛాంతామ్రపృష్ఠీం స్వర్ణఘంటా సమన్వితాన్ । వస్త్రచ్ఛన్నాం దక్షిణాఢ్యామేవంసంపూర్ణతామియాత్ ॥

తా॥ ఎటువంటి గోదానము చేయవలయుననగా, పాలునిచ్చునదియు, మంచి స్వభావముగలదియు, దూడగలదియు, సుగుణములు కలదియు, బంగారపు కొమ్ములు కలదియు, వెండి డెక్కలుగలదియు, కంచుపాదుగుతో కూడినదియు, తోకయందు ముత్యము లుంచబడినదియు, రాగివీపుతో నుండినదియు, బంగారపు ఘంటలు కలదియు, నూతనవస్త్రముచే గప్పబడినదియు, నగు గోవును సంపూర్ణమగు దక్షిణతో కూడ నిచ్చినయెడల వ్రతము సంపూర్తినొందును-

శ్లో॥ కపిలాయాఅభావేసి గౌరన్యాపిప్రదీయతే। తతఃప్రదద్యా దృత్విగ్భ్యో దక్షిణాంచయథార్హతః॥

తా॥ కపిలగోవు సంభవించనప్పుడు మఱియొకటి యేగోవు నయినను దాన మివ్వవచ్చును అనంతరము ఋత్విక్కులకు వారికి తగినట్లుగాదక్షిణ నివ్వవలయును.

శ్లో॥ బ్రాహ్మణా న్భోజయేత్పశ్చా ద్దద్యా త్తేభ్యశ్చ దక్షిణామ్। కలశాన్జలసంపూర్ణా న్దద్యాచ్చై వసమాహితః॥

తా॥ అనంతరము ఎనమండుగురు బ్రాహ్మణులకు భోజనము పెట్టి నిర్మలమగు మనస్సు కలవాడగుచు- జలముతోనిండియుండిన నూతన కలశములను దక్షిణలతో సహితముగా వారికి నివ్వవలెను-

శ్లో॥ ప్రాప్యానుజ్ఞాంతథా తేభ్యో భుంజీతసహబంధుభిః । ఏవం కృతే బ్రహ్మపుత్ర వ్రతోద్యాపనకర్మణి ॥ నిష్పాప స్తత్క్షణా దేవ జాయతే విబుధోత్తమః॥

తా॥ అనంతరము వారివల ననుజ్ఞ తీసికొని తాను బంధువులతోకూడభుజింప వలయును బ్రహ్మమానసపుత్రుడవగు యోసనత్కుమారా! ఈప్రకారము వ్రతము నకు నుద్యాపనముచేసిన బ్రాహ్మణుడు అక్షణమునందే పాపమువలన విడువబడును-

శ్లో॥ పుత్రపౌత్రసమాయుక్తో ధనధాన్యసమన్వితః। భుక్త్వాభో గాంశ్చిరంకాల మంతే వైకుంఠమాప్నుయాత్॥

తా॥ ఇహలోకంబున పుత్రులు పౌత్రులతో కూడినవాడై ధనము ధాన్యం మొదలగు నైశ్వర్యము కలవాడగుచు చాలాకాలము సమస్త సుఖముల ననుభవించి యంత్యకాలమందు శాశ్వతమగు వైకుంఠలోకమున కేగును అని సాంబమూర్తి సన త్కుమారునితో చెప్పెను-

ఇతి శ్రీస్కాందపురాణే ఈశ్వర సనత్కుమార సంవాదే
శ్రావణమాస మాహాత్మ్యే శ్రీకృష్ణ జన్మాష్టమీ
వ్రత కథనంనామ త్రయోవింశో
ధ్యాయ స్సమాప్తః.

---

## అథ చతుర్వింశోఽధ్యాయ ప్రారంభః.

ఈశ్వర ఉ॥ శ్లో॥ పురాకల్పే బ్రహ్మపుత్ర దైత్యభారప్రపీడితా। బ్రహ్మాణం శరణం ప్రాప పృథ్వీదీనాతివిహ్వలా॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాడు, బ్రహ్మదేవుని కుమారుడవగు సనత్కుమారా! పూర్వకల్పమందు భూదేవి దుష్టులయిన రాక్షసుల భారమును సహింపలేనిదై దైన్యభావముచే వ్యాకులము కలదియగుచు బ్రహ్మదేవుని శరణుపొందెను.

శ్లో॥ వృత్తాంతం తస్యా ముఖాచ్ఛ్రుత్వా బ్రహ్మదేవగణైస్సహ। క్షీరార్ణవే హరిం గత్వా తుష్టావ స్తుతిభిః ప్రభుం॥

తా॥ రాక్షసుల వలన తనకుగలిగిన బాధను భూదేవి చెప్పగా విని బ్రహ్మదేవుడు దేవతులతో కూడుకొనినవాడై పాల సముద్రమందు వటపత్రమున శయనించియున్న విష్ణుమూర్తి వద్దకు వెళ్లి యనేకవిధములుగా విష్ణుని స్తోత్రము చేసిరి.

శ్లో॥ ప్రాదురాసీత్తతో దిక్షు శ్రుత్వా సర్వం దిధేర్ముఖాత్। మాభైష్ట దేవా దేవక్యాం జఠరే వసుదేవతః॥ అవతీర్ణో భవిష్యామి హరిష్యే భూమివేదనామ్। భవంతు యాదవా దేవా ఇత్యుక్త్వాంతర్దధే విభుః॥

తా॥ యిట్లు నాలుగు ముఖంబుల వలనను పలుకుచుండగా నాలుగుదిక్కుల యందును ప్రతిధ్వని లిచ్చుచున్నట్టి ఆ బ్రహ్మదేవుని స్తోత్రము విన్నవాడై విష్ణుమూర్తి యిట్లు చెప్పుచున్నాడు, ఓ దేవతలారా! రాక్షసులవలన మీరు భయపడవలదు దేవకీ వసుదేవుల వలన నేను భూమియందవతరించి భూభారమును హరించెదను కావున మీరును భూమియందు యాదవులుగా పుట్టవలయును అని చెప్పి ప్రభువగు విష్ణుమూర్తి యంతర్ధానము నొందెను,

శ్లో॥ దేవక్యాం జఠరే జాతో వసుదేవేన గోకులే। స్థాపితః కంసభీతేన వవృధే తత్ర కంసహా॥

తా॥ అనంతరము విష్ణుమూర్తి వసుదేవునివలన దేవకీదేవియొక్క గర్భమునందు జన్మించగా కంసునివలన భయముచే వసుదేవుడా కృష్ణమూర్తిని తీసికొని వెళ్లి యాదవులుండెడి ప్రదేశమునందు విడిచిరాగా నక్కడ కృష్ణుడు పెరుగుచుండెను.

శ్లో॥ ఆగత్య మథురాం పశ్చాత్కంసస్సగణమాహనత్। తతస్సర్వే పౌరజనాః ప్రార్థయామాసురాదరాత్॥

తా॥ అనంతరము కంసుడు సేనాసమేతుడై మధురా పట్టణమునకు వచ్చి యాదవులను బాధింపగా నా పట్టణ జనులందరును దీనులై కృష్ణుని నిట్లు ప్రార్థించుచున్నారు-

శ్లో॥ కృష్ణకృష్ణమహాయోగిన్ భక్తానామభయప్రద। ప్రాణఘ్నాత్ పాహినో దేవ శరణాగతవత్సల॥

తా॥ భక్తులకు అభయమిచ్చువాడవును శరణుపొందిన వారియందు ప్రేమ గలవాడవును యోగీశ్వరులలో నగ్రేసరుడవునగు ఓకృష్ణమూర్తీ! మా ప్రాణములకు బాధకలిగించెడి దుష్టులను సంహరించి మమ్ములను రక్షింపుము-

శ్లో॥ కించిద్విజ్ఞాపయే దేవ ఏతన్నో వక్తుమర్హసి। తవజన్మదినేకృత్యం నజ్ఞాతం కేనచిత్క్వచిత్ ॥ జ్ఞాత్వాచ తద్దినే సర్వే కుర్మో వర్ధాపనోత్సవమ్ । తేషాం దృష్ట్వాచ తాం భక్తిం స్వస్మిన్ శ్రద్ధాంచ సౌహృదమ్॥ కృత్యంజన్మదినే తేభ్యః కథయామాస కేశవః । శ్రుత్వా తేపి తథాచక్రుర్విధానాత్తేన తద్వ్రతం॥

తా॥ ఓ ప్రభువా! మేము ప్రార్థించి విజ్ఞాపనము చేయుచున్నాము- అది యేదనగా నీవు జన్మించినదినమందు చేయవలసిన కృత్యమేదియో మాలోనొకరైనను ఎప్పుడును తెలిసికొనియుండలేదు ఆవిషయమును మీరు చెప్పినయెడల ఆ ప్రకారముగా ఆ దినమునందు వర్ధంతి యుత్సవమును చేసెదము అని ప్రార్థించగా నప్పుడు కృష్ణమూర్తి తనయందు వారికుండెడి భక్తియును శ్రద్ధయును మిత్రభావమును జూచినవాడై వారికి తనజన్మదినమందు చేయవలసిన విధానమంతయు జెప్పగా వారువిన్నవారై యథాప్రకారముగా చేసిరి.

శ్లో॥ వరాంశ్చబహుధాప్రాదా ద్భగవాన్వ్రతకారిణే। అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనమ్॥

తా॥ అప్పుడు భగవంతుండగు కృష్ణమూర్తి వ్రతము చేసినవారికి యనేకవిధములగు వరముల నిచ్చెను దీనిని గురించి పూర్వము జరిగిన కథ యొకటి కలదు దానిని చెప్పెదను వినుము-

శ్లో॥ అంగదేశోద్భవో రాజా మిత్రజిన్నామనామతః । తస్యపుత్రో మహాసేన స్సత్యజిత్సత్పథేస్థితః॥ పాలయామాససర్వజ్ఞో విధివద్రంజయన్ప్రజాః ॥

తా॥ అంగదేశమునందు అమిత్రజిత్తు అను రాజు కలడు వానికి సత్యజిత్తు అను సోకకుమారుడు గలడు అతడు సమస్తరాజనీతి నెరింగిన వాడై సన్మార్గమునందు ప్రవర్తించుచు చతురంగబలసమేతుడై ప్రజలకు ననురాగము కలిగించుచు న్యాయముగా భూమి నేలుచుండెను-

శ్లో॥ తస్యైవంవర్తమానస్య కదాచిద్దైవయోగతః। పాఖండైస్సహసంవాసో బభూవబహువాసరమ్। తత్సంసర్గాత్సనృపతిరధర్మేకనిరతోభవేత్॥

తా॥ యిట్లు కొంతకాలము వెళ్లగా దైవయోగముచే నొకప్పుడు నాస్తికమతస్థులతో సహవాసము కలిగి పిమ్మట బహుకాలము వారితోనే చెలిమి చేయుటవలన నారాజు అధర్మప్రవర్తకుడయియుండెను-

శ్లో॥ వేదశాస్త్రపురాణాని నినిందబహుశోనృపం। వర్ణాశ్రమగతేధర్మే విద్వేషంపరమంగతః॥

తా॥ వేదములు శాస్త్రములు పురాణములు మొదలగు వానినొనేక విధములుగా నారాజు నిందించుచుండెను వర్ణాశ్రమ ధర్మముల యందును మిక్కిలి ద్వేషము కలవాడయియుండెను-

శ్లో॥ ఏవంబహుతిథేకాలే ప్రయాతేమునిసత్తమ। కాలేననిధనంప్రాప్తో యమదూతవశంగతః॥ బధ్వాపాశైర్నీయమానో యమదూతైర్యమాంతికమ్। పీడితస్తాడ్యమానోసౌ దుష్టసంగతిదోషతః॥ నరకేపాతితఃప్రాప యాతనాంబహువత్సరమ్। భుక్త్వాపాపస్యశేషేణ పైశాచీం యోనిమాస్థితః॥ క్షుధాతృష్ణాసమాక్రాంతే భ్రమన్సమరుధన్వసు॥

తా॥ యిట్లు బహుకాలము జరుగగా నో మునీశ్వరుడా! ఆరాజు కాలవశముచే మరణము నొందెను అంతట యమదూతలువచ్చి పాశములచేకట్టి యమునివద్దకు తీసికొనివెళ్లి యనేక విధములుగా బాధలుపెట్టి దుర్మార్గుల సహవాసము కలిగియుండుటవలన నితనిని నరకములలో పడవేసి యనేక సంవత్సరములు యాతనపెట్టి పాపముల నన్నిటి ననుభవింపజేసి పిమ్మట పిశాచ శరీరములో ప్రవేశపెట్టిరి-అప్పుడు

ఆకలి దాహము మొదలగు వానిచే పీడింప బడుచు నిర్జల ప్రదేశముల యందు తిరుగుచుండెను-

శ్లో॥ కస్యచి త్త్వథ వైశ్యస్య దేహమావిశ్యసంస్థితః । సహతే నైవసంయాతో మధురాం పుణ్యదాంపురీమ్ । సమీపే రక్షకై స్తస్య తస్మాద్దేహాద్బహిష్కృతః॥

తా॥ ఒకప్పుడు ఒక వైశ్యునిదేహములో ప్రవేశించి పుణ్యప్రదమగు ఆమధురాపట్టణములో ప్రవేశించగా యితడు పిశాచము పట్టిన వాడని యాపట్టణ కావలివారలు వెడలగొట్టిరి అప్పుడా పిశాచము వైశ్యునిదేహము విడిచిపోయెను-

శ్లో॥ బభ్రామవిపినేసోథ ఋషీణామాశ్రమేషుచ। కదాచిద్దైవయోగేన హరేర్జన్మాష్టమీదినే ॥ క్రియమాణాంమహాపూజాం వ్రతిభిర్మునిభిర్ద్విజైః। రాత్రౌజాగరణంచైవ నామసంకీర్తనాదిభిః॥ దదర్శసర్వంవిధివ చ్ఛ్రుశ్రావాథహరేఃకథామ్ । నిష్పాప స్తత్‌క్షణాదేవశుద్ధోనిర్మలమానసః ప్రేతదేహంసముత్సృజ్య విష్ణులోకే విమానగః॥ యమదూతైఃపరిత్యక్తో దివ్యభోగసమన్వితః॥ విష్ణుసాయుజ్యమాపన్నో వ్రతస్యాస్యప్రభావతః॥

తా॥ అనంతర మాపిశాచము అరణ్యముల యందును మునీశ్వరుల యాశ్రమములయందును తిరుగుచుండగా నొకప్పుడు దైవయోగము వలన నొకచోట కృష్ణాష్టమీదినంబున మునీశ్వరులును బ్రాహ్మణులును వ్రతముచేయుచు విశేషపుణ్యప్రదమగు కృష్ణునియొక్క పూజను గావించి పిమ్మట నారాత్రి విష్ణునామ స్మరణముకథాశ్రవణము మొదలగు వానిచే జాగరణముచేసిరి ఆపిశాచము యిదియంతయుచూచుట వలనను విష్ణు కథలను వినుట వలనను ఆ క్షణమునందే పాపమువలన విడువబడి పరిశుద్ధుడై నిర్మలమగు మనస్సుగలవాడగుచు పిశాచ శరీరము వదలిపోయెను, అప్పుడు యమదూతలు విడిచిపెట్టివెళ్లగా విష్ణు దూతలువచ్చి దివ్యవిమానం మీద నెక్కించి విష్ణులోకమునకు తీసికొనివెళ్లిరి, అక్కడదేవతా సంబంధమైన భోగముల నన్నియు ననుభవించి యావ్రతమహిమ వలన విష్ణుసాయుజ్యమును పొందెను-

శ్లో॥ నిత్యమేతద్వ్రతంచైవ పురాణెసార్వకాలికమ్ । కథ్యతే విధివత్సమ్య జ్మునిభి స్తత్వదర్శిభిః । సార్వకాలికమేవైత త్కృత్వాశామానవాప్నుయాత్ ॥

తా॥ ఓ మునీశ్వరా! యథార్థముగ తెలిసికొనిన మునీశ్వరులు ఈ వ్రతమును సర్వకాలముల యందును ముఖ్యముగా చేయవలయునని పురాణములో జెప్పియున్నారు కావున ఎల్లప్పుడును యీ వ్రతము చేసినవాడు కోరికలన్నియును పొందును.

శ్లో॥ ఏవంయః కురుతే కృష్ణ జన్మాష్టమ్యాం వ్రతంశుభమ్। భుక్త్వేహ వివిధాన్భోగా న్శుభాన్కామాన వాప్నుయాత్॥

తా॥ యీ ప్రకారము కృష్ణ జన్మాష్టమీదినంబున శుభప్రదమైన వ్రతమును జేసిన వాడు యీ లోకంబున సమస్త సుఖముల ననుభవించి సమస్త శుభములను కోరికలను పొందును.

శ్లో॥ తత్రదేవవిమానేన పరమాలక్షం విధేస్సుత। భోగాన్నానా విధాన్భుక్త్వా పుణ్యశేషాదిహాగతః॥ సర్వకామసమృద్ధస్తు సర్వాశుభవివర్జితః। కులేనృపతివర్యాణాం జాయతే మదనోపమః॥

తా॥ అంత్యకాలమందు దేవదూతలు వచ్చి దేవ విమానమందు గూర్చుండబెట్టుకొని స్వర్గలోకమునకు తీసుకొని వెళ్లుదురు, ఓ బ్రహ్మకుమారా! అక్కడ సమస్త భోగముల ననుభవించి పుణ్యంమిగులుట వలన భూలోకంలో గొప్పరాజుల కుటుంబంలో మన్మథునితో సమానమగు సౌందర్యం కలవాడయి జన్మించి యేవిధమగు నశుభములను పొందక సమస్త కోరికలయొక్క ఫలితం నొందుచుండును,

శ్లో॥ యస్మిన్సదైవవిషయే లిఖితంస్యాత్పురార్చితమ్। కృష్ణజన్మోపకరణం సర్వశోభాసమన్వితమ్॥ పూజ్యతే విశ్వస్యత్తత్ర వ్రతై రుత్సవసంయుతైః॥ పరచక్రభయంతత్ర నకదాచిద్భవిష్యతి॥

తా॥ పూర్వమున చెప్పబడినదియు సమస్త శుభములతో గూడి నటువంటి కృష్ణజన్మ సంబంధమగు చరిత్రం ననుసరించిన విగ్రహాదులు లిఖింపబడినవై యెవని యొక్క దేవతా గృహమందుంచబడి పూజింప బడునో యెక్కడ సమస్తోత్సవముల తోగూడుకొనినట్లుగా వ్రతములుచేయబడి భగవంతుడు పూజింపబడునో అటువంటి ప్రదేశంబుని ఇతరరాజులసంబంధమగు భయం యీతిబాధలు మొదలగునవి యెన్నడును కలుగవు.

శ్లో॥ పర్జన్యః కామవర్షీ స్యా దీతిభ్యో న భయం క్వచిత్ । గృహే వా పూజయే ద్యస్తు చరితం దేవకీజనేః॥ తత్ర సర్వసమృద్ధం స్యా న్నోపసర్గాద్భయం భవేత్ । సంసర్గేణాపి యో భక్త్యా వ్రతం పశ్యేదనాకులః। సోపి పాపవినిర్ముక్తః ప్రయాతి హరిమందిరం॥

తా॥ మేఘుడు సస్యములకు సుపరాగమగునట్లు వర్షించుచును అతివృష్టి అనావృష్టి మూషకశలభములు మొదలగువానివలన బాధలెన్నడును కలుగవు కృష్ణ జన్మచరితము పూజింపబడిన గృహమునందు సమస్త ఐశ్వర్యములు సమృద్ధిగా నుండును తిరిగిజన్మించుట యను భయము కలుగదు, సత్పురుషుల సహవాసము వలనగాని భక్తి వలనగాని కృష్ణుని వ్రతమును స్థిరచిత్తుడై చూచినవాడు సమస్త పాపముల వలన విడువఁబడి జన్మానంతరమున శాశ్వతమగు విష్ణులోకమును పొందును అని యీ ప్రకారంగా సాంబమూర్తి సనత్కుమార మునీశ్వరునితో చెప్పినట్లుగా సూత మునీశ్వరుడు, శౌనకాదిమునీశ్వరులతోఁ జెప్పెను.

ఇతి శ్రీస్కాందపురాణే శ్రావణమాసమాహాత్మ్యే ఈశ్వర

సనత్కుమారసంవాదే కృష్ణజన్మాష్టమీవ్రతకథనం

నామ చతుర్వింశోఽధ్యాయః

సమాప్తః

శ్రావణమాస మాహాత్మ్యం

సంపూర్ణము.

---

## అథన్యాసాదికమ్.

ఓం అస్య శ్రీకృష్ణసహస్రనామస్తోత్రమాలామన్త్రస్య పరాశర ఋషిః, అనుష్టుప్ఛన్దః, శ్రీకృష్ణః పరమాత్మా దేవతా, శ్రీకృష్ణేతి బీజమ్, శ్రీవల్లభేతి శక్తిః, శార్ఙ్గీతి కీలకం, శ్రీకృష్ణప్రీత్యర్థే పారాయణే వినియోగః, అథన్యాసః, పరాశరాయ ఋషయే నమఇతి శిరసి, అనుష్టుప్ఛన్దసే నమయితి ముఖే, గోపాల కృష్ణాయ దేవతాయై నమః ఇతి హృదయే శ్రీకృష్ణాయ బీజాయనమ ఇతి గుహ్యే, శ్రీవల్లభాయశక్త్యై నమఇతి పాదయోః, శార్ఙ్గధరాయ కీలకాయ నమస్ఇతి సర్వాఙ్గే అథ కరన్యాసః, శ్రీకృష్ణఇత్యారభ్య శూర వంశైకధీ రిత్యన్తాని అఙ్గుష్ఠాభ్యాంనమః, శౌరి రిత్యారభ్య స్వభాసోద్భాసితవ్రజ ఇత్యన్తాని తర్జనీభ్యాం నమః, కృతాత్మవిద్యా విన్యాస ఇత్యారభ్య ప్రస్థాన శకటారూఢ ఇతి మధ్యమాభ్యాంనమః, బృన్దావన కృతాలయ ఇత్యారభ్య మధురాజనవీక్షిత ఇత్యనామికాభ్యాంనమః, రజక ప్రతిఘాతక ఇత్యారభ్య ద్వారకా పురకల్పన ఇతికనిష్ఠికాభ్యాం నమః, ద్వారకానిలయ ఇత్యారభ్య పరాశర ఇతి కరతలకర పృష్ఠాభ్యాం నమః, ఏవం హృదయాదిన్యాసః కార్యః,

## అథ ధ్యానమ్.

శ్లో ॥ కేషాంచిత్ప్రేమపుంసాం విగళితమనసాం బాలలీలావిలాసం కేషాంగోపాలలీలాఙ్కితరసికతను ర్వేణువాద్యేన దేవమ్. కేషాంవామాసమాజే జనితమనసిజో దైత్యదర్పాపహైవం జ్ఞాత్వాభిన్నాభిలాషం సజయతి జగతామీశ్వరస్తా దృశోఽభూత్, ౧, క్షీరాబ్ధౌకృతసంస్తవ స్సురగణై ర్బ్రహ్మాదిభిః పణ్డితైః ప్రోద్భూతో వసుదేవసద్మని ముదాచిక్రీడయోగోకులే, కంసధ్వంసకృతే జగామ మధురాం సారామసద్వారకాం గోపాలోఽఖిలగోపికా జనసఖః పాయాదపాయాత్సనః, ౨, ఫుల్లేన్దీవరకాన్తి మిన్దువదనం బర్హావతంసం ప్రియం శ్రీవత్సాఙ్క ముదారకౌస్తుభధరం పీతాంబరం సుందరం, గోపీనాం నయనోత్పలార్చితతనుం గోగోపసఙ్ఘావృతం గోవిన్దం కలవేణువాదనరతం దివ్యాఙ్గభూషం భజే.

---